# ఘండికోట బ్రహ్మాజీ రావు రచనలు

## నవలలు

పరుగు లిడే చక్రాలు – ప్రవహించే జీవిత వాహిని
నవ్వింది నాగావళి
శ్రామికశకటం
విజయవాడ జంక్షన్
నల్లమబ్బుకో వెండి అంచు
ప్రేమమూర్తి
రాగలత
గులాబిముళ్ళు
ప్రతిమ
జలప్రళయం
డాక్టరు భాయి
పరివర్తన
జంగమా హేమవల్లి
బావి
సుందరం
పసిడి పంజరం
వాన – వరద

## కథానికలు

మయూరాక్షి (సంపుటం – 40 కథానికలు)

## అనువాదాలు

శ్రీమత్ సుందరకాండ – తాత్పర్య సహితం.
శ్రీమత్ సుందరకాండ – సౌందర్య దర్శనం – సంగ్రహకథ – మొదటి భాగం.
వేయిన్నొక్క రాత్రులు – అరేబియన్ నైట్సు కథలు
కేంద్ర సాహిత్య అకాడమీ ప్రచురణ

# రాగలత

నవల

ఘండికోట బ్రహ్మాజీరావు

జనసేవా పబ్లికేషన్స్
46-18-11/6, మండావారి పేట, దొండపర్తి
విశాఖపట్నం - 530 016

రాగలత

**Ragalata**

Novel in Telugu
by Ghandikota Brahmaji Rao
46-18-11/6, Manadavaripeta
Dondaparthi
Visakhapatnam - 530 016
Ph : 746187

Printed in August 2001
Published
Janaseva Publications
46-18-11/6, Manadavari peta
Dondaparthi
Visakhapatnam - 530 016
Ph : 746187

Designed
Prsanna Bharathi Printers

**Printed**
Sakthi Printers
Dondaparthi,
Visakhapatnam - 530 016

**Price : Rs. 35/-**

For Copies :

1. Visalandhra Publishing House (All Branches)
2. Janaseva Publications at the above address.

# కృతజ్ఞతలు

రాగలత ఆంధ్రసచిత్రవారపత్రికలో ధారావాహికంగా 1987 లో వచ్చింది. నవల కొంచెం చిన్నదే - ఆంధ్ర నాటక రంగం గురించి చెప్తుంది.

రచనా శిల్పంలో వైవిధ్యమున్న ఈ నవల తెలుగు పాఠకుల మన్ననలు పొందుతుందని ఆశిస్తున్నాను.

చక్కగా డి. టి. పి. చేసి ఇచ్చిన శ్రీ కొండేపూడి సుబ్బారావు గారికి, బాగా ముద్రించిన శక్తి ప్రెస్ వారికి కృతజ్ఞతలు.

15-8-2001

ఘండికోట బ్రహ్మాజీ రావు

# రాగలత

## ఘండికోట బ్రహ్మాజీరావు

ఆమె ఎప్పుడూ ఉత్తరమే వ్రాస్తుంది. ఆ ఉత్తరం బుధవారం సాయం కాలం అందుతుంది.

ఆ ఉత్తరం అందిననాడు రాత్రి ఒంటి గంటవరకు దానితోనే కాలక్షేపమవుతుంది. తరువాత మూడురోజులూ దానిమత్తులోనే ఉంటాను. ఆ మర్నాటినుండి మళ్ళా ఉత్తరం కోసం ఎదురు చూస్తాను.

ఆమె వ్రాసే ఉత్తరం అటువంటిది.

అందులో అక్షరాలు ఒకే సైజులో ఏరి కూర్చిన మంచి ముత్యాలకు మల్లే కనిపిస్తాయి. లేత నీలం కాగితం మీద, పంక్తులు తీర్చిదిద్ది వ్రాస్తుందామె.

ఆ ఉత్తరంలో పది పేజీలుంటాయి. ఒక పేజీలో కూడా యోగక్షేమాల గురించి ఉండదు. ఉత్తరం ముగించే ముందు మాత్రం మావాడు చాలా హుషారుగా ఉన్నాడన్న ఒక్క వాక్యం కనిపిస్తుంది. ఈ మధ్య వచ్చిన నాలుగు ఉత్తరాలలోను ఆ వాక్యం కూడా మాయమయింది. నేను చాలా ఆందోళనతో మావాడి ఆరోగ్యం తెలుపమంటూ వ్రాశాను. దానికామె సరి అయిన సమాధానమీయలేదు. చివరి రెండు ఉత్తరాలలో ఏదో వేదాంతం చాల స్పష్టంగా కనిపిస్తున్నది.

ఏమి విషయాలు లేకుండా ఆమె పది పేజీలు ఏవిధంగా వ్రాసిందని ఆశ్చర్యం కలగవచ్చు. ఈ లోకం గురించో, ప్రకృతి గురించో, మానవ స్వభావం గురించో ఆమె విపులంగా వ్రాస్తుంది. అందుకే ఆమె వ్రాసినదాని గురించి చాల ఆలోచించవలసి వస్తుంది. ఒకప్పుడు ఆశ్చర్యం కలుగుతుంది. ఇంత జ్ఞానం ఆమెకెక్కడిదని, అదే ఆమె ప్రత్యేకత

అటువంటిది నాకు బుధవారంనాడు ఉదయం మబ్బులేని ఆకాశం మీద నుండి పడ్డ పిడుగులా ఆమెనుండి టెలిగ్రాము వచ్చింది. అందులో ఏమీలేదు

వెంటనే బయలుదేరి రావలసిందని ఉంది. అందులో గోదావరి నదిలో తెరచాపల మీద సాయంకాలపు రంగులు లేవు. కొబ్బరి ఆకులను కదుల్చుతూ సురటి వలె వీచే దక్షిణానిలం గురించి లేదు.

ఆమెను చూసి రెండేళ్ళు ఆరు మాసాలయింది.

ఆమె ఎలా ఉంటుంది?

ఆమెలాగే ఉంటుంది. ఆమెను పోలినవారిని నేనింతవరకు చూడలేదు.

ఆమె గురించి చెప్పే ముందు మావాడి గురించి చెప్పాలి.

మావాడి పేరు నాగభూషణం. వాడికి చాల బిరుదులున్నాయి. వాడు మామూలు నాగభూషణంకాడు. నటరత్న, నటశేఖర, నటసార్వభౌమ మొదలయినవి చాల ఉన్నాయి. మావాడు బ్లేజరు కోటు వేసుకొని, దానిమీద ఈ మెడల్స్ అన్నీ పిన్నులు పెట్టి తగిలించుకొంటాడు. డ్రామా పేపర్లలో వాడు ఈ అలంకారాలతో ప్రత్యక్షమవుతాడు. పలుచని రంగు కాగితాల మీద చవుకబారు ప్రెస్సులలో మెరుస్తున్న మెడల్స్ కనిపిస్తాయి. వాటి కోసమే వాడు శ్రమించాడు. వాటి కోసమే వాడు బ్రతికి ఉన్నాడు.

నాగభూషణం, నేనూ ఒకే ఊరివాళ్ళం. మా ఇద్దరి మధ్య వయస్సులో చాల తేడా ఉంది. వాడు నాకంటే పదిహేడేళ్ళు పెద్దవాడు. వాడికిప్పుడు నలభై రెండేళ్ళు.

నాకు చిన్నప్పటినుండి నాటకాలంటే మోజు. రంగస్థలం మీద ఉన్న నటుని కంటె గొప్పవాడు మరొకడు లేడనుకొనేవాడిని. నేనూ ఒక రోజు అంత గొప్పవాడిని కావాలని కలలు కంటూండేవాడిని.

నాకప్పుడు పదిహేనేళ్ళు. హైస్కూల్లో చదువుకుంటున్నాను. ఆ రోజుల్లో నాటకాలే హెచ్చు వేసేవారు. పౌరాణికాలు అధికంగా వేసేవారు. వరవిక్రయం, చింతామణి, గయోపాఖ్యానం, హరిశ్చంద్ర మొదలయినవి అన్ని కంపెనీలవాళ్ళు ఆడేవాళ్ళు.

ఆ రాత్రి హరిశ్చంద్ర నాటకం వేస్తున్నారు.

ఊరవతల పొలాలలో పెద్ద టెంటు వేశారు. అందులో స్టేజి, కూర్చోడానికి ఏర్పాట్లు వేశారు. నేల, బెంచీ, కుర్చీ - ఇవి కూర్చోడానికి. నేల కొంచెం వెనక్కుంటుంది. చదువుకుంటున్న కుర్రాడినేమో, మా అమ్మ సులువుగా నాటకానికి నన్ను పంపడానికి ఒప్పుకోలేదు. అప్పటికప్పుడే ఆ కంపెనీవాళ్ళు అయిదు నాటకాలు వేశారు. హరిశ్చంద్ర వాళ్ళ నాటకాలలో చాల గొప్పది. ఒప్పించి నేల టిక్కెట్టు కోసం రూపాయి సంపాదించేసరికి తల ప్రాణం తోకకు వచ్చింది.

నాటకం తొమ్మిదిన్నరకు మొదలని పేపర్లలో వేశారు. సాధారణంగా పదకొండు గంటలకు ముందు మొదలుపెట్టరు. అయినా వేగంగా భోజనం ముగించి ఎనిమిది గంటలకే బయలుదేరాను.

మా వీథి దాటి సందులోకి తిరిగాను. నాకు ముందు ఒక పెద్దమనిషి పెద్ద

సంచీ మోసుకుంటూ నడుస్తున్నాడు. సంచే బరువుగా ఉంది కాబోలు మోయడానికి శ్రమపడుతున్నాడు. నేనతనిని చూడనట్లే అతనిని దాటి ముందుకు నడిచాను.

''ఓయ్ అబ్బాయ్!'' అతనే పిలిచింది.

ఆగాను.

''ఎక్కడికెళ్తున్నావ్?''

''నాటకానికి''

''మరేం! కొంచెం సాయం చేసిపెట్టు.''

''ఏం చెయ్యమన్నారు?'' అతను దగ్గరికి రాగానే అడిగాను.

అతనితో పాటు సారా వాసన దగ్గరికి వచ్చింది.

''చూడు! ఈ సంచీ కొంచెం పట్టుకో!''

సంచి పట్టుకున్నాను. పెద్ద సంచి. బరువుగా ఉంది.

''అందులో ఏమున్నాయో తెలుసా?''

తెలీదు.

''అందులో విగ్గులు-వేసుకునే బట్టలు-రంగులు-''

''మీరు నాటకంలో వేషం వేస్తున్నారా?''

''మరేం''!

''విశ్వామిత్రుడి వేషమా?'' నా దృష్టిలో అతనేదో మామూలు వేషం వేసేవాడని అనిపించింది.

''నేను చిన్నచిన్న వేషాలు వేయను.'' అతను కొంచెం విసుక్కుంటూ అన్నాడు.

అతను మరేం వేషం వేస్తాడు. ఏ నక్షత్రకుడో, సింబాహుడో అయి ఉంటాడు. ఏదయితేనేం బరువు నాచేత మోయిస్తున్నాడు.

కొంచెం దూరం ఇద్దరం మాట్లాడకుండా నడిచాను.

''నువ్వు ఏ తరగతి టిక్కెట్టుకి వెళ్తున్నావు?'' అతనే ప్రశ్నించాడు.

''నేలకి!''

''మరేం! నీ దగ్గిర టిక్కెట్టు ఖర్చుకి ఒక రూపాయి. సోడాలకి మరో పావలా!''

''లేదు ఒక్కరూపాయే ఉంది.''

''అయితే ఒక బీడీ కట్ట, అగ్గిపెట్టె కొని తీసుకురా!''

నాకు ముచ్చెమటలు పోశాయి. ఎంతో బతిమాలి సంపాదించిన రూపాయి ఇతనికింద ఖర్చుపెడితే మరి నాటకం చూసినట్లే.

అతను నవ్వాడు.

''నీకేం భయంలేదు. నిన్ను చాల మంచి చోటుకి తీసుకెళ్తాను. ముందు బీడీ కట్ట పట్రా.''

భగవంతుడిమీద భారం వేసి బీడీ కట్ట, అగ్గిపెట్టె కొని తెచ్చాను. అతను రెండూ జేబులో పెట్టుకున్నాడు. అతను ముందు నడుస్తున్నాడు. బరువు మోస్తూ అతని వెనుకే నేను.

నాటకం వేసి టెంటు వరకు నడిపించి అతని మానాన్న లోపలికి వెళ్ళిపోతే ఏంచెయ్యాలి?

''మీరేం వేషం వేస్తారు?'' నేనే కల్పించుకుని అడిగాను.

''నువ్వు చూస్తావు కదా!'' అన్నాడతను ఏదో ఆలోచిస్తూ

టెంటు వెనుక భాగంలో గ్రీన్ రూమ్ వంటిది ఏర్పాటు చేశారు. అందులో అప్పుడే కొంతమంది ఉన్నారు. రెండో మూడో పెట్రోమాక్స్ లైట్లున్నాయి.

టెంటు తెర తొలగించి అతను లోపలికి నడిచాడు. అతని వెనుకే నేను ప్రవేశించాను.

ఒక నాలుగడుగులు ముందుకు నడిచి అతడు ఆగిపోయాడు. మాకు ఎదురుగా ఒకామె చీర కట్టుకుంటోంది. పైట సరిగా వేసుకోలేదు. ఆమె వయసు ముప్పైయేళ్ళకు మించదు. మనిషి కొంచెం స్థూలంగా బహుశా కాదేమో - ఆమె కొంచెం పొడవైన మనిషి ఆపాటి ఒళ్ళు లేకపోతే బాగుండదు. ఆమె పృథు వక్షం వేపు అయిదు నిమిషాలు చూసి నాతో వచ్చినాయన అమాంతంగా ఆమెను కౌగలించుకొని ముద్దుపెట్టుకున్నాడు.

ఆమె అతన్ని వెనక్కు తోసేయలేదు. అలా అని తనూ అతనిని కావలించుకోలేదు. అతడు కౌగిలి విడిచిన తరువాత రెండడుగులామె వెనక్కు నడిచి గట్టిగా అంది.

''ఓ నాగభూషణం! స్టేజిమీద నీతో చంద్రమతిగా నటిస్తున్నానని చనువు తీసుకుంటున్నావా?

అంటే అతను నటరత్న నాగభూషణం గారన్నమాట.

''నాగరత్నం! నేనంటే నీకు మోజులేదా?'' నాగభూషణం అన్నారు.

''నువ్వంటే నాకు మోజు లేదు.'' అందావిడ.

''మరెందుకు నాతో నటిస్తున్నావ్?''

''అదంతా వ్యాపారం. నాకు కంపెనీవాళ్ళు డబ్బిస్తున్నారు. అందువేత ఎవడు హరిశ్చంద్ర వేషం వేసినా నటించక తప్పదు.''

''అయితే నీకు ప్రేమ, అభిమానం, అనురాగం, మమత, ఇటువంటి మంచి అనుభూతులేవీ లేవన్నమాట.''

ఆమె నవ్వింది. ఆ నవ్వులో పువ్వులు విరిశాయి.

''చూడు నాగభూషణం! నీతో నాలుగు సంవత్సరాలయి నటిస్తున్నాను. ఒక నాడు కూడా నీమీద మనసు కలగలేదు. నీతో వచ్చిన ఈ అబ్బాయిని చూస్తే నాకెంతో ఆనందంగా ఉంది. నొక్కితే పాలుకారే బుగ్గలు. ఎవరబ్బాయివయ్యా నువ్వు?''

జరువు సంచీ నేలమీదబెట్టి వారిద్దరి సంభాషణ వింటూ నిలబడ్డ నావేపు తిరిగి ఆమె అంది.

ఆమెకు ఏం జవాబు చెప్పాలో నాకు తోచలేదు.

ఆమె నావేపు నడిచి నన్ను తన కౌగిలిలోకి తీసుకొని, నుదుటిమీద ముద్దు పెట్టుకుంది. ఇదంతా నాగభూషణంగారు చూస్తూ ఉండగానే జరిగింది.

ఒక అయిదు నిముషాలు నేను ఏ లోకాల్లో ఉన్నానో తెలీదు. ఆమె కౌగిలింతలో అప్రయత్నంగా నా చేతులు కూడా ఆమె నడుముకు చుట్టుకున్నాయి. ఈ మత్తులోంచి తేరుకొని ప్రపంచంలో పడేసరికి, సంచి పట్టుకొని నాగభూషణంగారు అక్కడ నుండి ఉడాయించారు.

ఇంతలో ఎవరో లోపలికి వచ్చారు.

''లోపల ఎవరైనా పైవాళ్ళుంటే వెళ్ళిపోవాలి. ఎవరూ ఉండడానికి వీల్లేదు.'' అతను బహుశా మేనేజరుకాబోలు.

''పద్మనాభం గారూ! ఈ కుర్రాడు మావాడు. ఇక్కడే ఉంటాడు.''

''నువ్వు వేషం వేసుకుంటుంటే.....?''

''ఇంకేముంది- అంతా అయినట్లే- రంగులు పూసుకోవడం కూడా.....''

''ఏదయినా పైవాళ్ళుండడానికి వీల్లేదు.''

''ఆ విషయం ఆలోచిద్దాం. ముందు కాఫీలు ఇలా పంపించండి.'' అతను లోపలికి వెళ్ళిపోయాడు.

''బాబూ నీపేరేమిటి?'' నాగరత్నం నన్నడిగింది.

''రాజశేఖరం.''

''మీ నాన్నగారేంచేస్తున్నారు?''

''నా చిన్నతనంలోనే పోయారు.''

''అన్నలూ, అక్కయ్యలూ ఉన్నారా?''

''లేరు - నేనొక్కడినే''

''చదువుకుంటున్నావా?''

''అవును- ఈ సంవత్సరం పబ్లిక్ పరీక్షలకు రాయాలి.''

''ఈ నాగభూషణం ఎక్కడ కలిశాడు?''

''దారిలో!''

ఆమె ఆశ్చర్యపోయింది.

''ఇంతకు పూర్వం తెలీదా?''

''దారిలో అతనే నన్ను పలకరించారు.''

ఆవిడ మళ్ళా ఆలోచనలో పడ్డది. ఇంతలో కుర్రాడొకడు రెండు కప్పులతో కాఫీ తెచ్చి ఆమెకు, నాకు యిచ్చాడు.

దగ్గరలో ఉన్న స్టూలు తీసుకొని ఆవిడ దానిమీద కూచుంది.

''అయితే నీకు నాటకాలంటే ఇష్టమన్నమాట!''

నేనేమీ జవాబు చెప్పలేదు.

''నీకు నాటకంలో వేషమిప్పిస్తానన్నాడా నాగభూషణం?''

''లేదు చూపిస్తానన్నాడు.''

''అదా సంగతి.''

అప్పటికి తొమ్మిదిన్నర అయినట్లుంది. హాల్లోంచి కేకలు - అరుపులు మేనేజరు లోపలి నుండి అరుస్తున్నాడు. నటులంతా తొందరగా తయారవాలని.

ఆమె నావంక అయిదు నిమిషాలు తేరి చూసి అంది.

''రాజశేఖరం! నువ్వు చాల మంచి నటుడివవుతావు!''

అప్రయత్నంగా ఆమె నోటినుండి ఆ మాటలు వచ్చినట్లయింది.

నేను చాల ఆశ్చర్యపోయాను.

''నాకలా అనిపించింది నిన్ను చూడగానే'' అంది ఆమె మళ్ళా.

''మీరు నామీద అభిమానంకొద్దీ అంటున్నారు. ఏదో నాటకాలు చూడలనే కోరిక ఉన్నంత మాత్రాన నటుడినవాలని ఎక్కడుంది?''

''నాకలా అనిపించింది. మరో నిజంకూడా చెప్తున్నాను వింటావా? ఎన్ని బిరుదులు తగిలించుకున్నా, ఎన్ని వన్సుమోర్లు అనిపించుకున్నా ఈ నాగభూషణం మొదటి తరగతి నటుడు కాలేడు.''

నా చెవులను నేనే నమ్మలేకపోయాను.

చాలామంది ప్రేక్షకుల ఆరాధ్య దైవం నాగభూషణంగారు.

నాగరత్నం గారి అభిప్రాయం కూడా గౌరవించదగ్గదే.

కొత్తనిజమొకటి వింటున్నట్లయింది.

''ఈ నాగభూషనం చాల శ్రమపడతాడు. ఎవరికేనా మరో పని ఉంటుందేమో, ఇతనికి మాత్రం బతుకంతా నాటకమే. బహుశా ఈ సాధనే అతనిని ఇంతవరకు తెచ్చింది. కాని, సహజంగా నటుడిగా రాణించవలసిన మెరుపు ఇతనిలో లేదు.''

నాకు, నాగరత్నంగారికి పరిచయమయి ఒక గంటకూడా కాలేదు. ఆమె నిస్సంకోచంగా ఎంతో ఆత్మీయులకుగాని చెప్పరాని విషయాలు నాతో చెప్తున్నందుకు నాకు చాల ఆశ్చర్యం కలిగింది.

పద్మనాభంగారి కేకలు వినవచ్చాయి.

''నాగభూషణంగారు! ఇంకా తయారవడంలేదా? ఏరా మారుతీ! హీరోగార్నొదిలేసి ఎక్కడ తగలడ్డావు? ముందు ఈ పెద్దమనిషిని తయారుచేయ్! ఏవమ్మా! నాగరత్నం! మాటల్లో పడి వేషం వెనకబెట్టావా?''

''మానేజరుగారూ! నేను సిద్ధంగా ఉన్నాను. నా గురించి ఆలోచించకండి. మొదటి సీను వాళ్ళని తయారుకమ్మనండి.'' అంది నాగరత్నం.

హాలులో (అంటే టెంటులోనన్నమాట) గోల- ఈలలు. చప్పట్లు- గ్రీనురూములో సంరంభం- కాని ఏమీ సంచలనం లేకుండా కూర్చున్నది నాగరత్నం మాత్రమే.

''రాజశేఖరం! ఇంకా మరో అరగంట వ్యవధి ఉంది. అంతవరకూ రెండు పద్యాలు వినిపిస్తాను.''

నాకు ఒళ్ళు జలదరించింది. ఏ తపస్సూ చేయకుండా దేవేంద్రుడు దిగివచ్చి వరాలిస్తానని అన్నట్లనిపించింది.

''.....జలదమా సుంత మార్చలికిన దోసమా.....''

నాగరత్నం చదవుతోంది. పాడడం, చదవడం, ఆలపించడం, గానం చేయడం..... ఇంకా ఎలా అనాలో నాకు తెలీదు. ఆమె చదివే తీరే వేరు. ఆమె గొంతులో ఏమి మృదుత్వముందో, ఏమి మాధుర్యముందో - ఆమె అనవసరంగా రాగాలాపన చేయలేదు. ఆ పద్యంలో కరుణ మూర్తీ భవించింది. మాతృ హృదయం ఆర్ద్రమయి శ్రోతలకళ్ళ వెంబడి నీళ్ళు తెప్పిస్తుంది.

ఆ విధంగా ఆమె రెండు పద్యాలు చదివింది.

ఆకాశం నుండి అమృతం వర్షిస్తున్నట్టే, ఫుక్కిళ్ళు పట్ట కడుపార త్రావినట్లయింది.

ఇంతలో మొదటి గంట వాయించారు.

ప్రార్థనకోసం నాగరత్నం లేచి నిలబడింది.

* * *

ఉన్న ఊళ్ళోనే ఉద్యోగం. వాసయోగ్యమైన స్వంత యిల్లు. వేళకు వండి పెట్టే కన్నతల్లి - దేనికీ నా జీవితంలో లోటులేదు.

చాలామంది పిల్లల్నిస్తామని వచ్చారు. కట్నాలు కురిపిస్తామన్నారు. కానుకల్లో ముంచెత్తుతామన్నారు. మా అమ్మకు ఎన్ని సార్లు ఆశాభంగం కలిగించానో నాకు తెలీదు.

''నాయనా! నీ మనసులో ఏముందో నాతో చెప్పు. నీకు పాతిక సంవత్సరాలు వెళ్లిపోయాయి. నాకు శాఖా భేదంలేదు. కులం గురించి కూడా పట్టింపులేదు. చివరకు వచ్చే పిల్ల రూపవంతురాలా, గుణవంతురాలా అన్న ప్రసక్తి కూడా లేదు. నీ మనసుకు నచ్చితే చాలు. ఆమెకు ఇష్టమయితే ఇంట్లో ఉంటాను. లేకపోతే ఏ కాశీలోనో మిగిలిన కాలం వెళ్ళబుచ్చుతాను. ఆ మధ్య నాటకాల్లో వేషం వేసేవాడివి. రెండున్నర సంవత్సరాలయి ఆ సరదాలు కూడా విడిచిపెట్టావు. వేళపట్టున తినడం, పుస్తకాలు చదువుకోవడం తప్ప - ఉద్యోగం చేయక తప్పదు కదా. మరే పనులలోను నువ్వు జొరపడడంలేదు. నీ స్నేహితులెవరో నాకు తెలీదు. ఆ ఒక్క నాగభూషణం ఎక్కడున్నాడో? అతనుంటే పనిగట్టుకొని వచ్చేవాడు. మాట్లాడేవాడు. పద్యాలు వినిపించేవాడు. నీ జీవితం అడవిగాచిన వెన్నెలై, నిర్గంధకుసుమమై, మోడైపోతుంటే కన్నతల్లిని చూస్తూ ఊరుకోగలనా?''

మా అమ్మ మాటలకేం జవాబు చెప్పడం?

ఈసారి ఆమె పట్టుబట్టి అడిగినప్పుడు జవాబివ్వక తప్పలేదు.

నవ్వుతూనే జవాబిచ్చాను.

''అమ్మా! నువ్వు చెప్పినవన్నీ నిజమే! నాకు వివాహమంటే విముఖతలేదు. నీ మనసు నాకు తెలియదా! ఏదో ఒక రోజు నీ కోరిక తీరడం నిజం. ఆ రోజెప్పుడో చెప్పలేను. అంతవరకు ఓపికపట్టడం మంచింది.''

ఈ మాటలన్నీ అయి వారం రోజులు కూడా అవలేదు.

ఇంతలోనే టెలిగ్రాము.

నాగభూషణం గురించి ఎంతగా ఆలోచిస్తున్నానో, అంతగా అతనికి దూరమై పోతున్నాను. ఈ టెలిగ్రాము రావడంతో పరిస్థితులు మారిపోయాయి.

ఆ టెలిగ్రాములో ఏమీలేదు.

వెంటనే రమ్మని ఉంది. ఎందుకు? ఏమీ అందులో లేదు.

ఏమి ఊహించినా అన్వయించడం లేదు. ఒక్కవిషయం మాత్రం నిజం. నాగభూషణం ఆరోగ్యం బాగులేదు.

సెలవివ్వడానికి ఆఫీసులో తగువులు, ఎప్పుడూ ఏదో ఇనస్పెక్షన్ ఉండనే ఉంటుంది. నడుం వంచి పనిచేసేవాళ్ళకు సెలవు దొరకడం కష్టమయిపోతుంది. వాళ్ళు లేకపోతే ఆఫీసు మూలస్తంభాలతో కూలిపోతుంది.

మా అమ్మతో కూడా చెప్పాను. నాగభూషణం ఆరోగ్యం బాగాలేదు. వారం రోజులు సెలవు మీద వెళ్తున్నాను. అవసరాన్ని బట్టి మరో వారం పది రోజులు సెలవు పొడిగించవలసి ఉంటుంది. మరేం కంగారువద్దు.

మెయిలు పదకొండు గంటలకు విజయనగరం విడిచిపెడుతుంది. దారిలోనే తాలూకా ఆఫీసులో సెలవు కాగితం పెట్టివచ్చాను. పెద్ద గుమాస్తాగారితో, టెలిగ్రాము అందిన వెంటనే అరగంట వారింటిదగ్గిర బ్రతిమాలడంచేత, అతను వచ్చేవరకు మరి వేచి కూర్చోలేదు.

వాల్తేరు చేరుకొనేసరికి కూర్చోడానికి కిటికీ దగ్గర చోటు దొరికింది. సాయంకాలం అయి గంటలకు రాజమండ్రి చేరడం, బస్సుమీదో, రిక్షా మీదో ప్రయాణం చేసి మరో గంటకు కొవ్వూరు చేరుకోడంతో ప్రయాణం ముగుస్తుంది.

ఆ క్షణం నుండి కొత్త కార్యక్రమం ఆరంభమవుతుంది.

దేని గురించీ నేను ఆలోచించుకోలేదు.

ఏదేనా పనిచేస్తుంటే ఆలోచిస్తుండడం అంతగా అలవాటులేదు.

అప్పుడు నాగభూషణం జ్ఞాపకానికి వచ్చాడు.

నాగభూషణం నిజంగా అదృష్టవంతుడు. అతనికి జీవితం వడ్డించిన విస్తరి. అతనే ఉద్యోగం చేయలేదు. నాటకాల్లో వేషాలు వేస్తే వద్దని చెప్పేవాళ్ళు కూడా అంతగా లేరు. అతను ఏమంత చదువుకోలేదు కూడా. చిన్నతనం నుండి మేనత్త గారింట్లో పెరిగాడు. అతని తల్లిదండ్రులు చిన్నప్పుడే పోయారు. మేనత్త చాల గారాబంగా పెంచింది. చదువుసంధ్యలు అబ్బకపోయినా, ఆ వంశోద్ధారకుడు బతికి బట్టకడితే చాలునని ఆమె తలచింది. అందుచేత అతను ఆడింది ఆటగా, పాడింది పాటగా వెలిగింది. ఏదో నాటకం కంపెనీవాళ్ళు నెల్లాళ్ళు నాటకాలాడితే ఆ నెల్లాళ్ళు ఇల్లు పట్టకుండా తిండితిప్పలు సరిగా లేకుండా వాళ్ళ వెనకే తిరిగితే ఆమె ఏమీ అభ్యంతరం చెప్పలేదు. ఏడో తరగతి చదువుతూ బడి మానేశాడు. ఇంట్లో కర్ర కత్తులు తయారుచేసి వాటికి ముచ్చి రేకులంటించడం, బాణాలు తయారుచేయడం, ఎవరూ చూడకుండా జిగురు, ముగ్గుపిండి వంటి రంగులు ముఖానికి పట్టించుకుని, బొగ్గు గుండతో మీసాలు దిద్దుకొని నాటకాలలో హీరోల డైలాగులు చదువుతూ నటించడం చేశాడు. ఈ సంగతులన్నీ అతని మేనత్త నాకు చెప్పింది. ఆవిడ మేనల్లుడి ప్రతాపం చూసి మురిసిపోయేది.

నాగభూషణంగారి వీధిలోనే.ఒక వృత్తి నటుడుండేవాడు. అతను నాటకాలలో హాస్య పాత్రలు ధరించేవాడు. సుబ్బిసెట్టి పాత్ర, విదూషకుడి పాత్ర ఇటువంటివి వేసేవాడు. నాటకాలు వెయ్యని రోజుల్లో పిల్లలకు ప్రయివేట్లు చెప్పుకునే వాడు. ఒక రోజు నాగభూషణాన్ని వెంట బెట్టుకొని అతని మేనత్త ఆ నాటకాల మామ యింటికి వెళ్లింది.

''తమ్ముడూ! నీ మేనల్లుడికి నాటకాలంటే చాల పిచ్చి. చదువు సంధ్యలు అబ్బకపోయినా సంగీత మబ్బింది. పది రాగాల దాకా పాడతాడు. బాగా నటిస్తాడు. చిల్లర పాత్రలు వెయ్యనంటాడు. రాజుల పాత్రలో లేక దేవుళ్ళ వేషాలో వేస్తానంటాడు. బడికి పోయి ఇక చదవనని నిర్మొహమాటంగా నాతో చెప్పాడు. వీడు చదుకొని ఉద్యోగం చెయ్యాలా, ఏడవాలా? వీడికి మరికొన్ని రాగాలు, పాటలు, పద్యాలు అన్నీ నేర్పి పెట్టు'' అంది ఆమె.

నాటకాల మామ ఎగిరి గంతేస్తూ నాగభూషణానికి ట్రెయినింగ్ యివ్వడానికి ముందు కొచ్చాడు. ఆ కాలంలో నటుడన్న వాడికి కనీసం పాతిక రాగాలైనా వచ్చి ఉండాలి. నాటకంలో రెండు మూడు పోర్షన్లయినా రావాలి. ఒకరోజు విదూషకుడుగా వేషం వేసినవాడు మరో రోజు రాజుగా దర్శనమివ్వవచ్చు. నాగభూషణం మేనత్త సంవత్సరానికో నాలుగు పుట్ల ధాన్యం, పది కుంచాల పెసలు నాటకాల మామకు ఇస్తుండేది.

నాతో పరిచయమైన నాటికి నాగభూషణం నాటకరంగంపై మంచి పేరు సంపాదించు కున్నాడు.

ఈ పేరుకోసం చాలా పనులు చేశాడు. స్టేజి మీద జడుపు పోతుందని స్నేహితులు తాగడం నేర్పించారు. మేనత్త బతికున్నన్నాళ్ళు ఆ పని రహస్యంగా చేశాడు. ఆవిడ పోయినతరువాత ఇంటికి తెప్పించుకొని తాగుతుండేవాడు. ఆ మేనత్త చాల ముందాలోచన కలది. ఆమె చనిపోయిన పదిహేను సంవత్సరాల వరకు భూములు మీద వచ్చే ఆదాయం అనుభవించే హక్కు మాత్రం ఇచ్చింది. తరువాత భూములను అమ్ముకునే హక్కు వచ్చేటట్టు వీలునామా వ్రాసింది. సంవత్సరానికి నాలుగు గరిసెల ధాన్యం, రెండు పుట్ల పెసలు, పుట్టెడు మినుములు రైతులు కొలిచేవారు. ఆమె యింటికి సరిపడే వాటిని అట్టిపెట్టి మిగిలినవి అమ్మి సంసారం లోటు లేకుండా నడిపించింది. ఆవిడ పోయిన తరువాత కొన్నాళ్ళు నాగభూషణం చాల ఇబ్బందులు పడ్డాడు. భోజనానికి సరియైన హోటలు కుదరలేదు. ఇల్లు కూడా కళ లేకుండా పోయింది. నాటకాలాడడం కోసం పై ఊళ్ళు పోయి అతను తిరిగి వచ్చేసరికి యిల్లొక పాడుపడ్డ బీడయి ఉండేది.

అప్పటికి నా చదువయిపోయింది. నాగభూషణంతో స్నేహం నాలుగు సంవత్సరాలయింది. అంత వరకు నేను అతని యింటి విషయాలను పట్టించుకోలేదు.

మేమిద్దరం రోజూ సాయంకాలం ఏదో నిర్జనమైన ప్రదేశానికి పోయి కూర్చునే వాళ్ళం. నాగభూషణానికి చదువబ్బలేదు. మామూలు వాక్యాలు కూడా సరిగా చదవలేడు. అటువంటప్పుడు పెద్ద పెద్ద సమాసాలు వచ్చినచోట పప్పులో కాలు వేస్తుండేవాడు. మా ఇయిద్దరికీ అనుబంధం పెరగడానికి కారణం వాడి లోపమే. నేను చిన్నప్పటినుండి భాషల్లో ముఖ్యంగా తెలుగు సంస్కృతాలలో మంచి మార్కులు తెచ్చుకునే వాడిని. ఉచ్ఛారణలో దోషం లేకుండా చదవడానికి చాల శ్రమలు పడ్డాను.

మా వాడి నాటకం మొదట చూసిన ఆరు నెలల వరకు తిరిగి వాడిని కలియలేదు. అప్పుడు వాడడిగాడు, తన వేషం ఎలా ఉందని.

''వేషానికేం లోటు లేదు. ఇవన్నీ పై అలంకారాలు - అన్నివిధాలుగా తయారయిన తరువాత ఆ పాత్రకు న్యాయం సమకూర్చాలి. మీరు వేసేది చక్రవర్తి పాత్ర - ఆ పాత్రకు అనుగుణమైన సంభాషణ కవి రూపొందించాడు. మీరు దానిని చదవలేక కప్పదాట్లు వేస్తున్నారు. ఈ లోపాన్ని కప్పి పుచ్చుకోడానికి రాగాలాపనలో ఛెళుకులు విసురుతున్నారు. మీరు అన్నివిధాల సాటిలేని మేటి నటులు కావాలి. ఒకొక్కప్పుడు మీ బిరుదులన్నిటికీ ఈ ఒక్క లోపం వలన అవమానం కలుగుతుంది.''

హైస్కూలులో చదువుకుంటున్న పదిహేనేళ్ళ కుర్రాడు ముప్పై దాటిన మేటి నటుడిని నిర్మొహమాటంగా విమర్శించడం అతను భరించలేకపోయాడు. ఆ లోపం తీరడానికి ఏం చేయాలో అతనికి తెలియదు.

దానికి కూడా నేనే ఒక ప్రణాళిక తయారు చేశాను.

అతను గయోపాఖ్యానం, వర విక్రయం, చింతామణి, సారంగధర, కృష్ణ తులాభారం, హరిశ్చంద్ర నాటకాలలో నాయకుడిగా నటించే వాడు. ఈ నాటకాలన్నీ అతను కొని భద్రంగా ఉంచాడు.

హైస్కూలు పబ్లిక్ పరీక్షలయిన తరువాత మేమిరువురం కలియడం జరిగింది. తిరిగి కాలేజీలో చేరేవరకూ రోజూ మేము నాటకాల గురించి చర్చించేవాళ్ళం. మొదట నాటకమంతా చదివి వినిపించే వాడిని. తరువాత హీరో పోర్షను చదివి వినిపించేవాడిని. పద్యాలు చదివి, పాటలు పాడి వాటిలో ఎక్కడ విరుపులుండాలో, ఎక్కడ రెండు సార్లు ఒకేపదం ఉచ్చరిస్తే బాగుంటుందో అతను చెప్పేవాడు. నేను పదాలలోని దోషాలను అతనికే ఎత్తి చూపి తిరిగి పాటని చదివేవాడిని. చాల కాలం నుండి అలవాటయిన తప్పులు పోగొట్టడానికి కొంత శ్రమ పడవలసివచ్చింది.

మొదటి నాటకం చింతామణి. దానిలో నాగభూషణం బిల్వమంగళుడు. నాటకాల మామ సుబ్బిసెట్టి - నాటకాల మామ ఇప్పుడు నాగభూషణానికి ఏమీ నేర్పడం లేదు. నాగభూషణం మాత్రం తృణమో పణమో గురువు గారికి ముట్టచెప్తూనే ఉండేవాడు.

బిల్వమంగళుడి పోర్షను నాగభూషణం చేత తప్పులు లేకుండా అప్పజెప్పేసరికి ఒకనెల్లాళ్ళు పట్టింది. ఆ తరువాత అతను చీపురపల్లిలో చింతామణి నాటకం ఆడాడు. నాకు ప్రత్యేకంగా బస్సు ఖర్చులు, భోజనం ఖర్చులు పెట్టి నాటకం చూపించాడు. ప్రతీసారి కన్న ఈ సారి చాల తేలికగా తన పాత్ర నిర్వహించాడు. తప్పులు పలుకుతున్నానేమోనని అతనికి మరి భయం కలగలేదు. ఈ విధంగా అతనికి అన్ని నాటకాలు తిరిగి వినిపించి, అతని హీరో పోర్షన్లు బియ్యం జల్లెడ బట్టి రాళ్ళు తీసినట్లు, తప్పులు తీసేసి అతనికి నూరిపోశాను. ఆ తరువాత అతనికి ఇంకా మంచి పేరొచ్చింది.

ఈ విధంగా నాగభూషణాన్ని నా హైస్కూలు క్లాసులనుండి బియ్యే పాసయే వరకు, అయిదు సంవత్సరాలు చాల పదును పెట్టాను. నాటకాల మీద విమర్శలు, అభిజ్ఞాన శాకుంతలం, ముద్రారాక్షసం, ఉత్తరరామ చరితం, మృచ్ఛకటికం, విక్రమోర్వశీయం, ఇంకా ఇంకా ఎన్నో నాటకాలు మావాడికి వినిపించాను. నాకు ఈ విధంగా నాటకాల గురించి చాల లోతుగా తెలుసకునే అవకాశం మావాడు కల్పిం

వాడు. అందులో గొప్పదనమేమిటంటే, వాడు వినడమే తప్ప చదవడం చేతకాకపో వడంతో నాకు తప్పనిసరిగా వాటిని చదవడం, మావాడడిగే ప్రశ్నలకు జవాబులు చెప్పడంకోసం వాడి కన్న హెచ్చుగా నేను శ్రమపడడం జరిగింది.

నాగభూషణం నాకు రాగాలు నేర్పించాడు. పద్యం చదవడం గురించి చెప్పాడు. నటన గురించి మర్మం లేకుండా, తనకున్న అనుభవాన్ని పురస్కరించుకొని, చెప్పాడు. వాడి నాటకాలు నేను చూశాను కాని, వాడు మాత్రం నానాటకాలు చూడలేదు. ఇం తకీ నేను నాటకంలో వేయడమే అబ్బురం.

నాగభూషణానికి, నాకు గల అనుబంధం పెరగడానికి ఇంకా చాల కారణా లున్నాయి. మా యిద్దరికి స్నేహం కుదరక ముందు మా వాడు నాటకాల మిష మీద చాల డబ్బు ఖర్చుపెట్టాడు. వాడికి స్నేహితులు హెచ్చయారు. ఎవరేనా పొగిడి తే భుజాలు పొంగి పోయేవి. పనికిరాని తాగుబోతులు చీమల్లా వాడిని పట్టుకొని వాడి ఆస్తిని కర్పూరంలా కరిగించారు. నాటకాల్లో వేషాలు వేసే ఆడవాళ్ల వెంటబడి ముందు వెనుకలు ఆలోచించకుండా అప్పులు చేశాడు. వాటిని తీర్చడానికి అతనికి సంవత్సరానికొకసారి అవకాశం వచ్చేది. సంక్రాంతి దాటిన తరువాత రైతులు కొలిచి న ధాన్యం అమ్మి కొన్ని అప్పులు మాత్రమే తీర్చగలిగేవాడు. ఆ విధంగా ప్రతీ సంవ త్సరం అప్పులు పెరగడమే మిగిలింది.

నాకు అతనితో పరిచయం అయేసరికి అతని మేనత్త బతికే వుంది. అందు చేత చేసిన అప్పులు, తాగుళ్ళు రహస్యంగా దాచుతూ వచ్చాడు. ఆరోజుల్లో నాటకా లాడి డబ్బు సంపాదించిన వారు లేరనే చెప్పొచ్చు. వాళ్ళు కీర్తి ప్రతిష్ఠల కోసమే దేవు లాడే వారు. ప్రేక్షకుల ఎదుట తమ గొప్పతనం ప్రదర్శించడం, ఎన్ని వన్సుమోర్లు వస్తాయో లెక్క వేసుకోడం, ఎంత మంది ఆడ ప్రేక్షకులు తమ వేపు చూశారన్నది తెలుసుకోడానికి ప్రయత్నం చేయడం. ఇది ఆనాటికి, ఈ నాటికి నటకులకు పట్టిన దురదృష్టం. దానికి మావాడు బలి అయ్యాడని అంటే లాభమేమిటి?

నేను ఇంటరు రెండో యేడు చదువుతుండగా మావాడి మేనత్త చనిపోయారు. అప్పుడప్పుడు వాళ్ళింటికెళ్ళినా మావాడి వ్యవహారంలో నేను జోక్యం కలుగజేసుకో లేదు. అంతవరకు మా యిద్దరికి నాటకాల గురించి చర్చలో తప్ప మిగిలిన విషయా లలో చనువు ఏర్పడలేదు. నాగభూషణం గొప్పనటుడు. ఈ భావమే నాకు ఆ నాటికి ఉండేది. ఇప్పటికి కూడా అదే విధంగా వాడిని గౌరవిస్తాను. అందరు గొప్పవాళ్ళకు మల్లె మా వాడికి కూడా కొన్ని లోపాలనండి. లేకపోతే బలహీనతలనండి, అవి ఉన్నాయి. చిన్న చిన్న విషయాలలో ఇంత గొప్పవాళ్ళు వెలితిబడి పోతారు. జీవితానికి చాల ముఖ్య మైనది శీలం. శీల భ్రష్టుడు లోకం దృష్టిలో హీనుడే.

నాగభూషణం మంచి నాటకాలాడాలంటే చాల విధాలుగా అతన్ని బాగుచేయ వలసి వచ్చింది. ఈ బాగు చేతకు ఎక్కడ మొదలు పెట్టాలో నాకు తెలీదు.

తాగుడు మాన్పడమా, అప్పులు తగ్గించడమా, ఆడవాళ్ళ వెంటపడకుండా చూడడమా - ఏది ముందో, ఏది వెనుకో నాకు బోధపడలేదు. ఇవన్నీ మానేసి, అతని యింటిని, వంటిని ముందు బాగు చేయాలని నిర్ణయించాను.

మా వాడి యిల్లు దానప్పపేటలో ఉంది. ఒక కుటుంబానికి ఆ యిల్లు బాగా సరిపోతుంది. విశాలమైన వీధి అరుగు, కచేరీ సావడి, దాని పక్కనే ఒకగది. వంటిల్లు, పెద్ద నట్టిల్లు, విశాలమైన పెరడు, నుయ్యి - ఇవన్నీ కాక వెనుక భాగం, డాబా మీద పెద్దగది ఉన్నాయి. పెద్దావిడ బ్రతికున్నరోజుల్లో విధిగా పెద్ద పండుక్కి సున్నాలు వేయించి, మరామ్మత్తులు చేయించి ఇంటిని వాసయోగ్యంగా ఉంచేవారు. ఆమె చని పోయిన రెండు సంవత్సరాలకు ఆ యిల్లు బూజులు పట్టి, గోడల పెచ్చులు రాలి పోయి, పెంకులు విరిగిపోయి పాడు పడ్డ కొంపలా తయారయింది.

మా వాడికి నాటకాలాడడం మీద శ్రద్ధేకాని శరీరంమీద శ్రద్ధలేదు. ఎప్పుడు తిండి తినడమో, ఎప్పుడు మానడమో వాడికి తెలీదు. నలుగురయిదుగురు స్నేహి తులని పెట్టుకొని, సోడాలు, బ్రాందీ సీసాలు, వాటిలోకి ఉల్లిపాయల పకోడీలు తెప్పు కుని నవ్వుతూ, కేరుతూ ఒక్కొక్కసారి సాయంకాలం నాలుగు గంటలకి బిరుసెక్కిన అన్నం, పాసిన కూరలు తినేవాడు. ఒకొక్కసారి రాత్రి నాటకంనుండి వచ్చి ఏ రెండుకో భోజనం చేసేవాడు. ఇంటి భోజనం నుదుటరాసి లేకపోవడంతో, హోటలు భోజనంతో వాడు ఆరోగ్యం పోగొట్టుకున్నాడు. మందులు, డాక్టర్లూ - ఏవీ అంతగా సహకరించలేదు.

ఎప్పుడు స్నానం చేసేవాడో, ఎప్పుడు మానేవాడో తెలీదు. బట్టలు ఒకొక్క ప్పుడు కంపుకొట్టేవి. ఇన్ని విధాలుగా వాడు పాడయినా నేను వాడి వ్యవహారాలలో జోక్యం చేసుకోలేదు.

ఒక ప్రమాదకరమైన సన్నివేశమో - సంఘటనో - అటువంటిది, మా యిద్దర్నీ దగ్గిరికి తీసుకొచ్చింది.

మా వాడికి ఆడవాళ్ళంటే తెగమోజు. మూడు లాంతర్ల దగ్గిర కొంతకాలం ఒకావిడను ఉంచుకున్నాడు. ఏ వూరేనా వెళ్తే సానికొంపలకు పరిగెత్తేవాడు. నాటకాల ంటే వెర్రిపడే ఆడవాళ్ళు మావాడికి లభించలేదు. పనికట్టుకొని వీథుల్లో తిరిగి, ఎవ రేనా కొంచెం తేరిచూచినా, చిరునవ్వు విసిరినా, ఉబ్బి తబ్బిబ్బయి వెంటపడడం చేస్తుండేవాడు.

కాలేజీలో ఒక సంస్కృత పండితులుండేవారు. ఆయన మాకు వ్యాకరణం చెప్పేవారు. అతను మా వీథికి రెండు వీథులు ముందున్న వానిలో ఉండేవారు. అతని మూడోపెళ్ళి భార్య ఆ మధ్యనే కాపరానికొచ్చింది. పల్లెటూరిపిల్ల, పెద్దకళ్ళు, పొడ వైన వాల్జడా, అమాయకత్వం తొణికిసలాడే చూపులు - ఆమె అందమయినదనే చెప్పాలి. మావాడి దృష్టి ఆవిడమీద ఎప్పుడు పడిందో నాకు తెలీదు.

సంస్కృత పండితులకు భార్యమీద చాల అనుమానం - ఎక్కడికి ఇల్లు వదిలి వెళ్ళేవారుకాదు. కాలేజీలో ఉన్నా ఆమెమీద ఒకకన్ను వేసి ఉంచడానికి ఇద్దరు శిష్యుల్ని తయారు చేశారు. రోజుకొకడు యింటి దగ్గిర కాపలా ఉండేవాడు. అనుమానాస్ప దమైన వ్యక్తులెవరు యింటిలోకి వచ్చినా కాపలా ఉన్న శిష్యుడు గురువుగారికి తెలి యజేయాలి. ఇటువంటి ఏర్పాటు ఉందని నాకు తెలియనేలేదు.

ఉదయం ఆఖరు పీరియడు. పండితులు మాకు వ్యాకరణ పాఠం చెప్తున్నారు. అప్పుడే ఆయన దిట్టంగా పొడుం పట్టుపీల్చి చెప్పడానికి ఉపక్రమిస్తుంటే యింటి దగ్గిర కాపలా కాస్తున్న కుర్రాడు పరుగు పరుగు క్లాసులోకి జొరబడి అతని చెవిలో ఏదో చెప్పాడు.

''ఎవడ్రా నాగభూషణంగాడు?'' ఆయన కోపంతో అడిగారు.

''వాడేనండీ! వాడే!! నాటకాలేస్తాడే!'' అన్నాడు వాడు మాకు వినిపించేటంత మెల్లిగా.

అతను మరో ఆలోచన లేకుండా ఆ కుర్రాడి వెంట తొందరగా వెళ్ళిపోయారు.

'నాగ భూషణం' - 'నాటకాలు' ఈ మాటలు వింటే నాకు వెంటనే తోచింది 'హీరో' నాగభూషణం ఏదో నాటకమాడుతున్నాడని.

సంస్కృత పండితులకి ఏభైయ్యేళ్ళుంటాయి. మనిషి పొట్టిగా ఉండడం చేత స్థూలంగా ఉన్నట్లు కనిపిస్తారు. అతని మొలలో పొడుంకాయ ఉన్నట్లే ఎప్పుడూ పాల కర్రతో చేసిన చేతికర్ర ఉంటుంది. చాల గట్టిదాకర్ర. నాగభూషణం ఎందుకు వాళ్ళింటికి వెళ్ళాడో నాకు వెంటనే బోధపడలేదు.

ఒకటిమాత్రం నిజం - పెద్దాయన మా వాడిని బడిత పూజ చేయడానికి వె ళ్తున్నారు. చేతికర్ర పొన్ను తగిలితే తల పగిలిపోతుంది. కాళ్ళు, చేతులు విరిగిపోతాయి. నటభూషణ, నటరత్న, నటసింహ నాగభూషణం మరి కొన్నాళ్ళవరకు స్టేజి ఎక్కడు. తెలుగు ప్రేక్షకుల కోసమేనా అతనిని కాపాడవలసిన బాధ్యత నామీద ఉంది.

అంతే!

క్లాసు విడిచి పరుగెత్తాను. అతను మెయినురోడ్డుమీంచి వేళ్తే నేను పక్కసం దుల్లోంచి పరుగులు తీసి మాస్టరుగారి యిల్లు చేరుకున్నాను.

మావాడు అభ్యంతర మందిరంలో ఆవిడతో మాట్లాడుతున్నాడు. లోపలి నుంచి మాటలు వినవస్తున్నాయి.

''మీ యింట ఏం కూరవండుతున్నారు'' అది మగాడి గొంతు.

''పొట్లకాయ కూర''! ఆమె మృదు స్వరం.

''ఎంత నాజూకండీ మీమాటలు. కన్యాశుల్కంలో మీవంటివారు మధురవాణి వేషం నా సరసనవేస్తే ఆడియన్సు దంగయిపోతారు!''

''ఇదేమిటండి మంచినీళ్ళడిగారు, పడగ్గదిలోకి ప్రవేశించి ఈ తప్పుడు మాటలేమిటి? వెంటనే పైకి పోండి.''

ఏ క్షణంలోనేనా గురువుగారు ఊడిపడతారు.

అప్పుడు నేను శంకరాచార్యులవారి శిష్యుడికి మళ్లీ సంగీతం వినిపించాను.

''ప్రళయ రుద్రులుగాను పంతుళ్ళవారు
పాలకర్రా పట్టి వస్తున్నవారు!
పారిపోకుంటేను పగిలేను బుర్ర
ప్రాణాలు మిగిలితే బలుసాకు చాలు!''

కొంచెం గట్టిగా పాడేనేమో, మావాడు నాకంఠం గుర్తపట్టి పైకొచ్చాడు. అప్పుడే గురువుగారు వీథితలుపు తోసుకొని లోనికి వస్తున్నారు. వీథిదారి మరి బందయినట్లే. పెరటివేపు ఇద్దరం పరుగెత్తాం. పెరటి తలుపు తెరిస్తే వెనుక వీథిలో పడతాం.

పెరటి తలుపు గడియ తొందరగా రాలేదు. అదొచ్చి మావాడు బయటపడేసరికి, గురువుగారి కర్ర నాకాలికి తగిలింది. పరిగెత్తి రాలేక అతను గురిచూసి చేతికర్ర నామీద విసిరారు. అది నా ముడుకుకి తగిలి నేను పడిపోయాను. గురువుగారు ఆయాసపడుతూ పరుగెత్తలేక నడుస్తూ నావేపు వస్తున్నారు. ప్రాణాలతో బయటపడాలంటే పెరటి తలుపుదాటిపోవాలి.

బలం కూడదీసుకొని కాలునొప్పిని లక్ష్యపెట్టకుండా వెనక వీథిలోకి దూకాను.

మావాడు ఎక్కడా కనిపించలేదు.

పెరటి తలుపు పెద్ద చప్పుడుతో మూతపడింది.

కదల్లేక నేను రోడ్డు మీద పడిపోయాను.

* * *

మెయిలు అనకాపల్లి దాటింది. రెండుగంటలయింది. నవంబరు నెల. కాలం సౌమ్యంగా ఉంది. కిటికీలోంచి చూస్తే వరిపైరులు బాగా ఎదిగి ధాన్యం కంకులు కనిపిస్తున్నవి. ఏటి ఇసుకలలో రెల్లుపూలు వెండి తళతళలతో మెరుస్తున్నాయి.

మళ్ళా నాలోకంలో పడ్డాను.

చదువు చెప్పే మాస్టర్లు చాలమంది ఉంటారు. అందరిని గురువులని పూజిం చాలా? నిజానికి, నాగభూషణం నాకు చెప్పిన దానికన్న, నేను వాడికి చెప్పినదే హెచ్చు. వయసులోవాడు పెద్దవాడు కాని, శాస్త్రం నేనే వాడికి బోధించాను. ఒకానొక సంద ర్భంలో వాడు ఒప్పుకున్నాడు. తనకంతగా తెలియదని.

గురువనేవాడు కేవలం విద్యచెప్పి తన బాధ్యతను వదిలించుకోడు. తన శిష్యుడు తనంతవాడవాలని, లోకంలో పేరు పొందాలని, అతని శ్రేయస్సు కోరుతాడు. అది గురుశిష్యులకున్న అనుబంధం.

ఆవిధంగా చూస్తే నన్నే గురువుగా మావాడు భావించాలి. అధఃపతనం చెం దుతున్నవాడిని దారిలోకి తెచ్చి శాస్త్రాన్ని నెమరు వేయించాను. మావాడు అలా ఎప్పుడూ అనుకోడు. తనకన్న చిన్నవాడు చిన్నవాడే. నలుగురిలో తనకు శిష్యుడే - తనను మించినవాళ్ళు ఎవరూలేరు. ఇది మావాడి తత్త్వం.

ఏది ఎలా ఉన్నా మావాడు నా నాటకాల గురువని అందరితో చెప్పుకుంటు న్నప్పుడు నేనెందుకు కాదనాలి? ఆ గొప్పవాడికే దక్కనీండి.

నాకు మంత్రోపదేశం చేసిన గురువులేరని చెప్పలేను. ఆ ఘనత కేవలం నాగర త్నానికి చెందుతుంది. ఆడవాళ్ళు మంత్రోపదేశం ఇవ్వడానికి అర్హులా? ఆమెకన్న అర్హులు మరొకరు లేరు.

.....నాగరత్నం నటనసైడు కర్టెన్లలోంచి చూస్తున్నాను. అదే మొదటిసారి ఆమె నాటకం చూడడమేమో. చెప్పుకోలేని దివ్యానుభూతిని పొందుతున్నాను. ఆమె పక్కను నటించడం చేతనే నాగభూషణానికి పేరొచ్చింది. మరో సాధారణమైన నటి పక్కను వాడు రాణించడు.

మావాడు సీను సీనుకీ సోడాలు కొట్టి బ్రాందీ కలుపుకొని తాగుతున్నాడు. చివరి సీనుల కొచ్చేసరికి వీరబాహుడికన్నా హరిశ్చంద్రుడే హెచ్చు తాగినట్లనిపించింది. అదంతా నాగరత్నంమీద కోపంతోనే చేశాడు.

నాగరత్నం మొదటినుంచి చివరివరకు చాల సులువుగా, హాయిగా నటించింది. కొంచెమైనా తడబడలేదు. పద్యాలు చదవడం, పాటలు పాడడం అన్నీ సన్నివేశాలకు అనుగుణంగా చేస్తున్నది. నేనంతక ముందు పెద్దవాళ్ళ నాటకాలు చూడలేదు. స్కూలులో పిల్లల నాటకాలు, శ్రీరామనవమి సంబరాలలో మా వీధి కుర్రాళ్ళు వేసిన నాటకాలు తప్ప ఈ వృత్తి కళాకారుల నాటకాలు చూడలేదు. అందుచేత ఈ నాటకం తొలిసారి చూసినప్పుడు చలించకుండా ఉండలేకపోయాను.

నాటకం అయిపోయేసరికి రాత్రి రెండుగంటలయింది. తిరిగి నాగరత్నంతో కొంచెంసేపు మాట్లాడాను. 'నా నటన ఎలా ఉంది?' అని ఆమె నన్నడగలేదు. నాటకమయిన తరువాత కూడా, రంగులు కడుక్కున్న తరువాత, ఆమె ముఖం నిర్మలంగానే ఉంది.

నా భుజం తట్టి దగ్గిరగా తీసుకొని ఆమె అంది.

''బాబూ! మేము రేపే వెళ్ళిపోవాలి. కాని పురజనుల కోరికమీద ఈ నాటకమే మరో రెండుసార్లాడతాం. మరి మూడు రోజుల తరువాత నాటకముంది. ఆవేళ కూడా నువ్వురా! నేను ఎనిమిది గంటలకే వస్తాను. మనిద్దరం చాలసేపు కబుర్లాడుకోవచ్చు''.

ఇల్లు చేరేసరికి కోళ్ళు కూస్తున్నాయి. ఎర్రబారిన కళ్ళతోనే పొద్దున్న స్కూలు కెళ్ళాను. నాకెవరి పాఠాలు చెవికెక్కడంలేదు. నాగరత్నం ఆడినమాట, పాడినపాట, చదివిన పద్యం చెవుల్లో గింగురుమంటున్నాయి.

నాగరత్నం చెప్పిన ప్రకారమే మరో మూడు రోజుల తరువాత ఆ నాటకమే ఆడారు. మా అమ్మ కేకలేసినా ఏదో నచ్చజెప్పి రాత్రి ఎనిమిది గంటలకి నాటకం పెండాలు చేరాను. అప్పటికి నాగభూషణం రాలేదు. తోవలో కలియనూలేదు. నేను వచ్చిన పది నిమిషాలకు నాగరత్నం వచ్చింది. ఆమెతోపాటు ఒక ముసలావిడ ఎప్పుడూ ఉంటుంది. ఇద్దరూ జట్కామీద వచ్చారు. నన్ను పెండాలు దగ్గిర చూసి ఆమె వేషాలు వేసే చోటికి తీసుకుపోయింది.

లోపల పెట్రో మాక్సు లైట్లు వెలుగుతున్నాయి. ఆమె అక్కడున్న కుర్చీలో కూర్చొని, సావకాశంగా తనతో తెచ్చిన మేకప్ సామాను చిన్నబల్లమీద పెట్టి అద్దంముందు నిల్చొని పైట సవరించుకుంది.

''నువ్వెప్పుడేనా నాటకాలు వేశావా?'' ఆమె అడిగింది.

''లేదు, నాటకాలు చూడడంలేదు, వేయడం కూడానా?'' అన్నాను.

''మరెందుకీ నాటకానికొచ్చావ్?''

''నాగభూషణంగారు అద్భుతంగా నటిస్తారని, అతని రాగాలు వింటే చాలు జన్మ తరిస్తుందని ఎవరినోటవిన్నా తెలుస్తోంది.''

''మరో నటులగురించి నువ్వు వినలేదా?''

''లేదు, వారెవరికీ బిరుదులు కనిపించలేదు. పంచి పెట్టిన నాటకం పేపర్లలో మొదటినుంచి చివరి వరకు నాగభూషణంగారి గురించే ఉంది.''

''ఈ నాగభూషణం ఎంతకేనా తగును. మేనేజరుతో చెప్పి ఆ కరపత్రాలన్నీ తనే వేయించాడు. ప్రచారంకోసం ఎన్ని బాధలేనా పడతాడు.''

''ప్రచారంకన్నా కీర్తి అంటే బాగుంటుంది.''

నాగరత్నం నావేపు చూసింది.

''నీకు పద్యాలు బాగా అర్థమవుతాయా?''

అవునని తల ఊపాను.

అప్పుడామె అయిదో, ఆరో పద్యాలు చదివింది. నాగరత్నం గొంతుక చాల బాగుంటుంది. మంచి రాగజ్ఞానముంది. అంతకుమించి భాషమీద అధికారముంది. ఆమె మాటల్లో అమృతముంది.

''నాటకాల్లో రసం ప్రధానమైనది. దానిని పోషించడమే నటుడి ధర్మం. మహారాజు పాత్ర అయినా మామూలు భృత్యుడి పాత్ర అయినా ప్రేక్షకుల హృదయాలను కదిలించకపోతే ప్రయోజనం లేదు'' అంది ఆమె.

అందులో ఆమె నటుడి వేష భాషల గురించికాని, రాగజ్ఞానం గురించికాని ప్రస్తావించలేదు. ఆమె ఆ రాత్రి నాతో అన్న ఈ మూడు వాక్యాలు నిత్యం స్మరిస్తూనే ఉంటాను. వీటి వెనుక ఎంత అనుభవముందో, ఎంత శాస్త్ర జ్ఞానముందో తరువాత తరువాత నాకు తెలిసింది.

ఇదే నాగరత్నం ఉపదేశించిన మహా మంత్రం!

ఎంతమంది నాగభూషణాలకు ఇది చెప్పినా అర్థంకాదు.

అందుకోసమే ఈనాటికి ఆమెనే గురువుగా భావిస్తాను.

ఆ రెండోసారి నాగభూషణంతో మాట్లాడడానికి నాకు అవకాశం చిక్కలేదు. ఈసారి నాగభూషణం నటనలో కొత్త దనముంటుందని నేను పూర్తిగా నమ్మాను. ఈసారి కూడా అతని పోర్షను బాగులేదు.

మరి మూడు రోజుల తరువాత అదే నాటకం ఆడించారు. మా వూరికి అదే ఆఖరుసారి అన్నారు. తప్పక వచ్చి చూసి తరించమన్నారు. పల్లెటూళ్ళకు కూడా వెళ్ళి పేపర్లు పంచుకొచ్చారు. నాగరత్నం ఆహ్వానం నా పట్ల ఎప్పటికీ వర్తిస్తుంది. ఆఖరుసారి ఆమెతో కబుర్లు చెప్పాలని ఏడున్నరకో పెండాలు చేరుకున్నాను. ఆమె మరో ఇరవై నిమిషాల తరువాత వచ్చింది.

నన్ను చూడగానే చాల సంతోషించి లోపలికి తీసుకుపోయింది.

''బాబూ! ఈరోజు నీకో కొత్త సంగతి చెప్తున్నాను. ఈ రాత్రి నువ్వు నాతో రోహితుడి వేషం వేస్తావు'' అంది ఆమె.

ఆ మాటలు విని నేను ఉబ్బి తబ్బిబ్బవలేదు.

''నాకేమీ తెలియదు, పోర్షన్ రాదు. పద్యాలు చదవలేను. స్టేజిమీద రసాభాస అవుతుంది. మీరు చేసిన ఎన్నిక సరిఅయినది కాదేమో?'' అన్నాను నేను.

నాగరత్నం తడబలేదు.

''రాజశేఖరం! కొందరు నటులుగా జన్మిస్తారు. నువ్వు వేరే వేషం వేసుకోడం, పద్యం కంఠతా పెట్టడం అక్కర్లేదు. నువ్వీ నాటకం రెండు సార్లు చూశావు. రోహితాస్యుడి పోర్షను అంతపెద్దది కాదు. అందులో మాటలన్నీ నీకు జ్ఞాపకం ఉన్నవే. నాతో మాట్లాడినప్పుడు నువ్వు రమారమి పోర్షనంతా అప్పచెప్పినట్లే. ఇటువంటి అవకాశం నీకు మరి కలగదు. నిన్ను రంగస్థలానికి పరిచయం చెయ్యడం కోసం నేను ఈ ఏర్పాటు చేశాను. ముందుగా చెప్తే నీకు చాల సంశయాలు కలగవచ్చునని కిందటిసారి మనం కలిసినప్పుడు ఏమీ చెప్పలేదు. నేను నీ పక్క నుంటాను. ప్రాంప్టింగ్ చేసే అతను చాల మరుకైనవాడు. నువ్వు మరేమీ సందేహించకు. చొక్కా, షరాయి విప్పు, నీకు వేషం వేస్తాను.

నేనేమీ జవాబు చెప్పడానికి ఆమె అవకాశమివ్వలేదు.

ఆరాత్రి నా పోర్షను బాగుందా లేదా అనేది ప్రశ్నకాదు.

ప్రేక్షకులు నామీద చెప్పులు విసరలేదు.

నాగరత్నం పక్కన నటిస్తుంటే నాకు ఏవిధమయిన భయం కలగలేదు. ఆత్రత లేదు. కాళ్ళు వణకడం లేదు. నటించడం చాల సహజంగా కనిపించింది.

వేషం వేసుకున్న నాగభూషణం హరిశ్చంద్రుడిగానే కనిపించాడు. నాగరత్నం ఎంతో మమత పెంచుకున్న చంద్రమతి. నేను చేస్తున్నది నటనగా అనిపించలేదు. ఆ నాటినుండి పాత్రలో తాదాత్మ్యం పొందడం నాకలవడింది.

ఆరోజు నాగరత్నం చాల అద్భుతంగా నటించింది. ఊళ్ళ ఊళ్ళ నుండి జనం వచ్చి పడ్డారు. హాలు కిక్కిరిసిపోయింది. నాటకం మొదలు పెట్టిన దగ్గిరనుంచి చివరి వరకు మంత్రబద్ధుల్లా మనుష్యులు కూర్చున్నారు. నాగభూషణం పద్యాలకు వన్సుమోర్లు కొట్టారు కాని, నాగరత్నం నటనకు కళ్ళంట నీళ్ళు కార్చారు. వారు పొందిన అనుభూతి చాల సహజమైనది. వన్సుమోరు కొడితే మళ్ళా అటువంటి భావం పొందలేరు. పొందిన అనుభూతి తలచుకొని తలచుకొని రసానందం పొందాలి.

నాకు ఆ వయసులో ఆ విషయాలేవీ తెలియవు.

నాటకం ముగిసి అందరం తిరిగి గ్రీన్ రూములోకి వచ్చాము. నాగరత్నం అద్భుతంగా నటించినందుకు ఈర్ష్య పడుతున్నాడు నాగభూషణం.

నాటకం అయిపోయిన తరువాత అట్టేసేపు నాతో మాట్లాడుతూ కూచోలేదు నాగరత్నం.

''బాబూ! త్వరగా వెళ్ళిపో, ప్రజలు నువ్వు ఇంతకుపూర్వం వేసిన రోహితాస్యుడు కాడని పసిగట్టారు. నిన్నందరూ అభినందించడానికి వస్తున్నారు. ఇది గొప్పలకు తరుణంకాదు. కొన్నాళ్ళు నువ్వెవరో ఎవరికీ తెలియకుండా ఉండడం మంచిది.''

తొందరగా బట్టలు వేసుకుంటున్నాను.

''బాబూ! మరో విషయం చెప్పడం మరచిపోయాను. రేపు మా కంపెనీ వాళ్ళందరూ వెళ్ళిపోతున్నారు. నేను మాత్రం ఎల్లుండి రాత్రి వెళ్తాను. ఎల్లుండి ఉదయం తొమ్మిదిన్నరకు నేనుండే లాడ్జికి రా! మళ్ళా ఎప్పుడు కలుస్తామో, సరదాగా కొంతసేపు మాట్లాడుకుందాం.''

నాగరత్నం వెళ్ళిపోతుంటే నాకదో విధంగా అనిపించింది. కొద్ది రోజుల స్నేహానికే ఆమె యందు అంత గౌరవమా?

దానికామె సమాధానం చెప్పింది.

కొంతమందికి జన్మాంతరాల స్నేహం ఉంటుంది. మా యిద్దరి మధ్య అటువంటి అనుబంధమే ఉందని ఆమె చెప్పింది.

నేను నాటకంలో వేషం వేసినట్లు ఎవరికీ తెలీదు. నాగభూషణానికి కూడా తెలిసినట్లు లేదు. అతడు కొంచెం ఆలస్యంగా వచ్చాడు. ఆ సరికే నా వేషధారణ పూర్తి అయి నాగరత్నానికి కొంచెం దూరంలో కూర్చున్నాను. అతడు నేను వేషం వేయగలనని కలలో కూడా అనుకోడు. స్టేజిమీద అతను ఇతరులు ఎలా నటిస్తున్నారని కొంచెమైనా విచారించడు. తనూ, తన నటన, తన వన్సుమోర్లు, తన లోకం. ఆఖరు రాత్రి ఆ వూర్లో నాటకమాడడమేమో, అతను అట్టే తాగి రాలేదు. ప్రేక్షకులు కోరిన విధంగా వారిని రాగాల మత్తులో ముంచాడు. ఆరోజు చాల వన్సుమోర్లు కొట్టారు పల్లెటూరి ప్రజలు.

నేను ఇంటికొచ్చి, మా అమ్మ పడుకున్న తరువాత కొబ్బరినూనె ముఖానికి రాసుకొని, సున్నిపిండి పట్టించి రంగన్నది కనిపించకుండా కడుక్కున్నాను.

దేనికేనా ఫలితం ఉండక తప్పదు. ఆ సంవత్సరం పెద్ద పరీక్షల్లో చాలా మంచి మార్కులు వచ్చి పాసవవలసింది. లెక్కలు బాగా చేయక, ఇంగ్లీషు అషామాషీగా చదివి పరీక్ష పాసయాను.

కాని, నాకు విచారం లేదు.

జీవితానికి లక్ష్యమంటూ ఒకటి అప్పుడే ఏర్పడింది.

ఆమెను కలియడం కోసం రెండు రాత్రుళ్ళు చాల మేలుకొని ఆలోచించాను. ఆమెతో ఏం మాట్లాడాలి. ఏవి మాట్లాడకూడదు? ఈ విధంగా ఆందోళన పడడమే మిగిలింది. చివరకు ఏ నిర్ణయానికి రాలేక ఆమె చెప్పేవి వినడం ఉత్తమమనే అభిప్రాయానికి వచ్చాను.

ఆమె గోకుల్ లాడ్జిలో రెండో అంతస్తులో ఎడమవేపు చివరి గదిలో ఉంటానని చెప్పింది. సాధారణంగా ఆమె ఆలస్యంగా నిద్ర లేస్తుంది. అందుచేత తొమ్మిదికి లాడ్జి చేరుకొని, సరిగా తొమ్మిదిన్నరకు బస చేసిన గదికి చేరుకున్నాను.

పైన వరండాలో ఎవరూ లేరు. ఎడం చేతిపక్క చివరి గది తలుపు తట్టాను. లోపలినుండి జవాబు లేదు. మెల్లిగా తలుపు తోశాను. తెరచుకుంది.

లోపలికి ప్రవేశించిన నేను దిగ్భ్రాంతుడనయాను.

నాగరత్నం మంచంమీద పడుకొంది.

ఆమెకు తెలివి వచ్చినట్లుంది. కదిలింది.

గది నాలుగు పక్కలా చూశాను. ఒక మూలకున్న టేబిలుమీద బ్రాందీ సీసా, సోడాబుడ్లు కాళీవి, గళాసులు ఉన్నాయి. వాటి పక్కనే సిగరెట్టు పీకలు పడి ఉన్నాయి.

''బాబూ! వచ్చి నా పక్కన కూచో'' నాగరత్నం పిలిచింది.

మంచంమీద ఆమె పక్కను కూర్చున్నాను.

''నువ్వు వచ్చేవేళకు స్నానం అవీ ముగించుకుని కూర్చుందామనుకున్నాను. మగత నిద్ర, తెలివి ఉన్నట్లు లేనట్లూ, నా శరీరంమీద కూడా నాకు అధికారం లేకపోయింది. ఏ తెల్లారుఝామునో పడుకున్నాను.''

నేనేమీ జవాబు చెప్పలేదు. ఏమి మాట్లాడడానికి నాకు తోచలేదు. తలంతా ఖాళీగా ఉంది.

మళ్ళా ఆమె నిద్రలోకి జారిపోయింది.

ఇంతలో లాడ్జి కుర్రాడు తలుపుమీద కొట్టి అడుగుతున్నాడు.

''అమ్మగారూ! తొమ్మిదిన్నర దాటిపోయింది. లేపమన్నారు.''

నాగరత్నం కళ్ళు మూసుకునే అంది.

''ఒక్క పావుగంట తరవాత వేన్నీళ్ళు తీసుకురా. తరువాత ఇద్దరికీ టిఫిను, కాఫీలు.'' మరొక్క పది నిమిషాలలో ఆమె దుప్పటి కప్పుకొని లేచి బాత్‌రూము లోకి వెళ్ళింది.

ఆమె బాత్‌రూము నుండి పైకి రావడానికి పదినిమిషాలు పట్టింది. ఆ పది

నిమిషాలు నేను బాధ పడ్డాను. బల్లమీద బ్రాందీ సీసాలు, నలిగిన ఆమె శరీరం, తెలివి లేకుండా, చివరకు చీర కట్టుకోడానికి కూడా ఓపిక లేకుండా నిద్రపోయిన ఆమె పైనం తలచుకుంటే నాకు జుగుప్స కలగలేదు. ఇంత మంచి ఆమెకు కూడా జీవితం నిలుపుకోడానికి ఈ బాధలు తప్పలేదు కదా అని విచారించాను.

ఆమె గదిలోకి వచ్చిన తరువాత నా సందేహాలన్నీ తీరిపోయాయి. కుర్రాడు వేన్నీళ్ళు తెచ్చాడు. గది సర్దుతుంటే ఆమే నన్ను తలగడ క్రిందనున్న డబ్బు తీసి మంచం కింద నున్న తన సూట్‌కేసులో పెట్టమంది. తొందరగా స్నానం చేసి వచ్చి చలువ చేసిన బట్టలు కట్టుకొంది. వేగంగా అలంకరించుకుంది.

తరువాత గదంతా వెలుగే - ఆమె మనస్సుకు మల్లే ఆనందంతో ఆ గది పరిమళించింది.

సన్నని రాగం ఆమె గొంతులోంచి వచ్చింది. కుర్రాడు తెచ్చిన టిఫిన్ ఇద్దరం తిన్నాము. కాఫీలు తాగడం అయిన తరువాత కుర్రాడిని పంపించిన తరువాత ఆమె స్వయంగా వెళ్ళి గది తలుపు వేసింది.

''బాబూ! ఇప్పుడు మనం హాయిగా మాట్లాడుకోవచ్చు. ఇంతకీ అసలు సంగతి అడగడమే మరిచిపోయాను. స్టేజిమీద నటిస్తుంటే ఎలా ఉంది నీకు?'' నవ్వుతూ ఆమె అడిగింది. ఇద్దరం మంచంమీద ఎదురెదురుగా కూర్చున్నాం.

''ఎలా చెప్పడమో నాకు తెలీదు. ఎదురుగుండా కూర్చున్న జనాన్ని చూస్తే నాకు దిగులు కలగడానికి బదులు వారేదో నేను చెప్పేవి, మీరు పాడేవి వినడానికి ఆత్రత చూపిస్తున్నట్లు కనిపించింది. నేను నటిస్తున్నాని, ప్రేక్షకులను రంజింప చేయాలని నాకు తట్టలేదు. ఇంతకుముందు మూడుసార్లు నాటకం చూశానేమో, నా పోర్షను ప్రాంప్టింగ్ చేయకుండా అప్రయత్నంగా జ్ఞాపకమొచ్చింది. నాకేం కష్టమనిపించలేదు'' అన్నాను నేను.

ఆమె నా ముఖంలోకి వేయి కళ్ళతో చూస్తున్నది.

''చంద్రమతి నాగరత్నంగారని, నాగభూషణంగారు హరిశ్చంద్రుడని, నేను రోహితాస్యుడని నాకు తట్టలేదు. మనం వేరు వేరు దిక్కుల నుండి వచ్చి రంగస్థలం మీద కలుసుకుంటున్నామని నేననుకోలేదు. అతడు రాజు, మీరు రాణి, నేను మీ పుత్రుడిని. ఇదే నా మనసులో నిలిచింది.''

''అందుకే నీ నటన అద్భుతంగా ఉంది.''

''మీ పద్యాలు, మీ మాటలు, మీ నటన అంత సమీపంలో ఉండి చూస్తుంటే నా మనసు ఆనంద సంకులమయింది. నాకు భయమన్నది కలగలేదు, సరికదా ఏదో ఉత్సాహం పొంగి పొర్లింది.''

''నువ్వు రెండే పద్యాలు చదివావు, రెండూ అమోఘంగా చదివావు. హాలులో అంతా నిశ్శబ్దం. నాకు కూడా ఏదో చెప్పరాని ఆశ్చర్యం.''

ఈసారి నేనే ఆమె కళ్ళల్లోకి జవాబు లేకుండా చూశాను. ఆమె కళ్ళల్లో వేయి చంద్రుల చల్లదనం. ఆమె హృదయంలో ఏదో అనిర్వచనీయమయిన అనుభూతి.

''బాబూ! నేను చాలకాలమయి చింతిస్తున్నాను. నాకు పిల్లలు లేరని.

ఆమె చాల ఆవేశంతో చెప్తున్నది. వినడమే నాధర్మం.

''నువ్వు నాటకంలో నా పక్కను నటించడంతో నా విచారమంతా తీరిపోయింది. నా కడుపున పుట్టిన వాడికి మల్లే నువ్వు సంచరించావు. నువ్వు నటించావని అంటే సరి కాదు. నీది నటన కాదు. ఎన్ని సంవత్సరాలనుండో నా హృదయాన్ని మెలి పెడుతున్న ఈ సమస్య తీరిపోయింది.''

ఆమె కళ్ళు చెమ్మగిల్లాయి. క్రమంగా వాటి నుండి బిందువులు కారుతుంటే ఆమెనన్ను తన హృదయానికద్దుకొంది. వెచ్చటి ఆమె కన్నీళ్ళతో నా చెంపలు క్షాళిత మయాయి. రెండు చేతులు చాచి, ఆమెను కౌగిలించుకొని ఆమె హృదయంలో నా ముఖం దాచుకున్నాను. ఆమె నా కన్నీళ్ళు తన చీర కొంగుతో తుడిచింది.

ఒక్క పది నిమిషాలు ఇద్దరం ఒకరి ముఖాల్లోకి ఒకరం చూసి, నిశ్శబ్దంగా ఉండిపోయాం.

''మనం మళ్ళా ఎప్పుడో కలుస్తాం. అనుకోకుండా ఇప్పటికిమల్లే కలుస్తాం. మనం కలిసే వరకు మనస్సులలో ఈ జ్ఞాపకాలన్నీ ప్రాతఃకాలవేళ మంచు బిందువులు పడితాజాగా ఉన్న పారిజాతాలవలె పరిమళిస్తూ ఉంటాయి.''

తరువాత ఆవిడ చాల పద్యాలు వినిపించింది. శ్లోకాలు వినిపించింది. తన గురించి చెప్పింది.

ఆవిడ చాల చదువుకొంది. సంస్కృతంలో పంచకావ్యాలు పూర్తి చేసింది. వాళ్ళది పెద్దాపురం. ఆ వూళ్ళో ఒక శాస్త్రులుగారు పురాణం చెప్తారు. ఆయన బహు సౌమ్యుడు. మహా పండితుడు. అతని కంఠంలో మార్దవం ఒక సారి విన్నవారు ఎప్పుడూ మరిచిపోరు. ఆయన నాగరత్నానికి పంచకావ్యాలే కాక, నాటకాంతం సాహిత్యమని, సంస్కృత నాటకాలన్నీ పాఠం చెప్పారు. భరతుడి నాట్య శాస్త్రం బట్టీ పట్టించాడు. తెలుగు నాటకాలు ఆమెకు కరతాలామలకం- ఇంకా వాసుదేవయ్య గారు గాత్రం చెప్పారు. అప్పాయమ్మగారు అభినయించడం చెప్పారు.

ఇన్ని విధాలుగా పాండిత్య మున్నా నాటకాల వేపు ఎందుకు ఆవిడ తిరిగారని నాకు సందేహం కలిగింది.

ఆమె దానికి సమాధానం చెప్పింది. ఈ విద్యలన్నీ తానుగా ఆనందించడానికి

బాగుంటాయి. సంగీతం, నాట్యం ఏ కొద్ది మందినో అలరిస్తాయి. కాని జనుల హృద యాలను చేరుకోవాలంటే నాటకం కన్నముఖ్య మయిన సాధనం లేదు.

ఒకచోట ఆమెను గౌరవంగా సంబోధిస్తున్నాను. ఒకసారి ఆప్యాయంగా చను వుగా పిలుస్తున్నాను. ఈ అనిశ్చయ స్థితి నుండి ఆమే నన్ను విముక్తుడిని చేసింది.

తల్లికీ కొడుకుకీ మధ్య అరమరికలు, గౌరవాలు ఎందుకూ!

నాగరత్నం నా పెంపుడు తల్లి, నా గురువు, నన్ను మనిషిని చేసిన మహామనీషి.

* * *

మెయిలు తుని స్టేషను దాటి పోయింది. మధ్యాహ్నం రెండు గంటలకు పైగా వేళయింది. మనసు ఏమీ బాగులేదు. పది సంవత్సరాలయి మావాడితో తిరుగుతు న్నానేమో చాల బాధగానే ఉంది. ఆ మనిషి బాగుండాలని, మళ్ళీ యధా ప్రకారం నాటకాలు వెయ్యాలని నేను కోరుతున్నాను.

హంస వరందాటి దాటిపోయింది. రైలు అన్నవరంలో ఆగింది. కార్తీక మాసం సత్యన్నారాయణ స్వామి వారి వ్రతాలు చేసుకొని చాల మంది పాసింజర్లు అక్కడ ఎక్కారు. బండి కదిలి వెళ్తుంటే ఎవరో గొలుసు లాగి ఆపారు. అంతా గందగోళం. ఆడవాళ్ళొకచోట, పిల్లలొకచోట, మగాళ్ళొకచోట-మొత్తానికి ప్లాట్‌ఫారము మీద నున్న నాలుగయిదు వందల మంది బండిలోకి ఎక్కేశారు. మళ్ళా నేను ఇరుకుగా కూర్చో వలసి వచ్చింది.

కిటికీ దగ్గిర కూర్చున్నానేమో, అంతగా బాధనిపించలేదు. చల్లని గాలి ప్రాణా నికి హాయిగా తగుల్తోంది. పెట్టి నిండా మనుష్యులు. అయినా నా మనసు మళ్ళీ నాగ భూషణం వేపే పరుగెడుతున్నది.

..... నాకు చాల కోపం వచ్చింది. అంతటి విశ్వాస హీనుడిని మరి చూడ దలచుకోలేదు. వాడి ప్రాణాలు కాపాడడం కోసం నా కాలు విరగ్గొట్టుకున్నాను. వాడి కేం తెలుసు. నేను చచ్చానో, బ్రతికానో, వాడికవుసరం లేదు. సమయానికి వేషం కట్టినంత మాత్రాన ఆడ వాళ్ళందరూ లొంగి పై బడతారా? వాడికి సరసమాడడం కూడా తెలీదు. మధ్యాహ్నం వేళ మంచి నీళ్ళు కావాలని ఇంట్లో ప్రవేశించి, తన గురించి చాల చెప్పుకొని, ఆమె వెంటే పడక గదిలోకి పోయి, మీరు వంకాయకూర బాగా వండుతారని విన్నాను. మొదలయిన మాటలాడుతూ ఆమెను మచ్చిక చేసు కోదలచాడు. సరసమాడడం సామాన్య మైన పనా? ఏ కొద్దిమందో తప్ప ఆడవాళ్ళ ను సులువుగా బుట్టలో వేసుకోలేరు. వాళ్ళు అంత చవకబారయితే వాత్స్యాయనుడు కామసూత్రాలే రాసి ఉండేవాడు కాడు.

ముడుకు వాచిపోయి రోడ్డు పక్కను అరగంట వరకు ఆ మనిషి కోసం చూస్తూ

కూర్చున్నాను. ఎప్పటికీరాడు. ఒంటెద్దు బండి ఒకటి వెళ్తుంటే మెల్లిగా బండి వాడి సాయంతో మీదికెక్కి- యిల్లు చేరుకునే సరికి ప్రళయమయింది. మా అమ్మకు ఏమని చెప్పేది? ఎన్ని అబద్దాలు చెప్పినా నిజం తెలిసినప్పుడు మనిషి విలువ తగ్గిపోతుంది. మా అమ్మతో జరిగినదంతా చెప్పాను. యిల్లు చేరిన వెంటనే వైద్యం మొదలయింది. చింత పండు పిసికిన ముద్ద, సున్నం బెల్లం, కావడాలు.... ఈ విధంగా వారం రోజులు గడచిపోయాయి. మావాడి అంతు పట్టడం లేదు. నాకు రోజు రోజుకీ వాడి మీద కోపం పెరిగింది. మా స్నేహం పూర్తిగా తెగిపోయే స్థితికి చేరుకుంది. ఆ రోజు బాగా చీకటి పడ్డ తరువాత బుర్రకో తువాలు చుట్టుకొని మావాడు వచ్చాడు. నన్ను చూడ గనే బావురుమని ఏడ్చాడు. ఈ వారం రోజులబట్టి వాడు నా గురించి బాధపడుతు న్నాడట. నాముఖం చూడడానికి చెల్లక పిరికిగా యింటి దగ్గర కూర్చున్నాడు. మనిషి రెండు రోజులుగా పస్తున్నట్లు ఉన్నాడు. గెడ్డాం బాగా పెరిగింది. ముఖం ఎండిపోయింది. వాడు చెప్పిన వాటిలో అసత్యమేదీ లేదు.

ఇకనాకు ఎవరిమీద కోపం?

పరీక్షలింకా పదిహేనురోజులే ఉన్నాయి. మరి కాలేజీ క్లాసులకు వెళ్లలేదు. పరీ క్షలయే దాకా మెల్లిగా కాలంగడిపి, పరీక్షలయిన వారం రోజుల నుండి మావాడి మీద శ్రద్ధ చూపించడం మొదలుపెట్టాను.

ముందు వాడుంటున్న యిల్లు - ఎన్ని సంవత్సరాలు నుండో దానికి మరా మ్మత్తులు లేవు సరికదా సున్నాలయినా వేయించలేదు. డబ్బు మావాడిదే. కాని, పర్య వేక్షణ నాది- ఇల్లు ఒక దారికి వచ్చే సరికి రమారమి నెల్లాళ్ళయింది. లంకంతయి ల్లు. అందులో మహానుభావుడు ఒక్కడు. ఉన్నప్పుడుంటాడు. లేకపోతే నెలల తర బడి పికరుండదు. పాడయిన పెరడు, పెరటి గోడ, నుయ్యి అన్నీ బాగుచేయించాను. ఇంట్లో కొళాయిలు కూడా ఉన్నాయి. అంతటితో అయిపోలేదు. మేడ గదుల్లో రెండు మంచాలున్నాయి. ఒకటి పందిరిమంచం రెండవది పట్టెమంచం. పరుపులు ఎండలో వేసి, గలీబులు మార్చి , దుప్పట్లు కొత్తవి తెచ్చి తలగడలు కుట్టించి- ఈ విధంగా ఎన్నని చెప్పను?

నేను మావాడిని - మాకు చాల చనువు ఏర్పడడంతో- గౌరవ సూచకంగా పిలుపులు మానేశాం- అందుకోసమే శిష్య ప్రాయుడనైనా వాడిని చాల చనువుగా పిలు స్తూ వ్యవహరించడం మొదలు పెట్టాను. బి.యే. యూనివర్సిటీ పరీక్షలయిన తరు వాత రెండేళ్ళ పాటు ఒకే దీక్షతో పనిచేశాను.

ఇల్లు బాగు పడ్డ తరువాత ఇల్లాలి ఊసెత్తాను. దానికి వాడు ససేమిరా ఒప్పు

కోలేదు. డాక్టరు లేడిడాక్టరును, లెక్చరరు కనీసం మాస్టరమ్మను- ఈ విధంగా తన వృత్తిలోనే రాణిస్తున్న మరొక స్త్రీని పెళ్ళాడడానికి మావాడు భీష్మించుకు కూర్చు న్నాడు. నేను కూడా అట్టే ప్రయత్నించలేదు.

''ఓ నాగభూషణం! నువ్వు, నీ పెళ్ళాం పద్యాలు చదువుకొంటూ, పాటలు పాడుకుంటూ మేడ గదిలో వేషాలు వేస్తుంటే తిండెవరు పెడతారు;''

నా ప్రశ్నకు వాడు జవాబు చెప్పలేదు. ఒక స్త్రీని కాదు, చాల మంది స్త్రీల స్నేహం కోరవలసినవాడు. అందుచేత నా సలహా తోసి పుచ్చాడు.

ఇక మావాడి భోజనానికి ఏం చేయాలి?

మా యింట్లో తెచ్చి పెట్టుకోడానికి నాకు మనస్కరించలేదు. చాల ముఖ్య మైనది ఆహార సమస్య. దాని సమస్యకు నేను పెద్ద ప్రయత్నమే చేయవలసి వచ్చింది. పేదవాళ్లైనా గౌరవంగా బ్రతకడానికి యిబ్బందులు పడుతున్న కుటుంబ మొకటి దృష్టిలో పడింది. వాళ్ళని తెచ్చి యింట్లో దింపాను. వారి నుండి అద్దె తీసుకోకుండా, మరో నూరు రూపాయలు నెలకు వాళ్ళ కిచ్చి, మావాడికి భోజన సౌకర్యాలు కల్పిం చాను. పాత బియ్యపుటన్నం, పెరుగు, నెయ్యి, కాయగూరలు, వేళపట్టున భోజనం- ఇవన్నీ మావాడి ఆరోగంలో చాల మార్పులుతెచ్చాయి.

బియ్యే పరీక్ష మంచిమార్కులతోనే పాసయాను. ఉద్యోగాలకు దరఖాస్తులు పంపడం చేస్తూనే ఉన్నాను. దూర ప్రదేశాలలో ఒకటి రెండు ఉద్యోగాలే వచ్చాయి. నేను, మా అమ్మ వెళ్ళడానికి అభ్యంతరం లేదు. మావాడు దారిన పడుతున్నప్పుడు నేను వదిలిపెట్టలేక పోయాను. అందులో మావాడి స్వార్థం కూడా ఉంది. దానికి పదిరెట్లు నా స్వార్థం- కొంచెం డబ్బుకి ఇబ్బందిలేని వాళ్ళమవడం చేత ఏ వేషాలు వేసినా నప్పింది.

నాగభూషణానికి నాకు సఖ్య మేర్పడి పన్నెండు సంవత్సరాలయింది. ఈ కాల మంతటిలో నేను బియే పాసయిన తరువాత రెండేళ్ళు వాడితో గడిపినది చాల ఉత్కృష్టమైన కాలం. ఈ రెండేళ్ళూ మావాడు నాటకాలు ఆడలేదు. రోజూ యిద్దరం ఎని మిది గంటలు, పది గంటలు శ్రమపడే వాళ్ళం. ఈ రెండేళ్ళలోను మావాడికి తెలుగు నాటకాలు మాత్రమే కాక, సంస్కృత నాటకాలు, ఇంగ్లీషులో షేక్స్పియరు నాటకాలు అన్నీ చదివి వినిపించడమే కాదు - చిన్నచిన్న విషయాల దగ్గరనుంచి ప్రత్యేకంగా చర్చించాము.

ఇదంతా నా స్వార్థం! ఒకరికి చెప్పి చర్చించాలంటే నేను బాగా దానిని అధ్యయ నం చేయాలి. అభిజ్ఞాన శాకుంతలం, విక్రమోర్వశీయం, మృచ్ఛకటిక, ముద్రారాక్షసం,

ఉత్తరరామ చరిత, భాసుడి నాటకాలు - అన్నీ సంస్కృతంలోను, వాటి అనువాదాలు తెలుగులోను క్షుణ్ణంగా బట్టీ పెట్టాము. ఇంగ్లీషు మావాడికి రాకపోయినా, షేక్స్పియరు నాటకాలు చదివించి వినేవాడు. ఆ చదవడం మామూలుగా ఉండకూడదు. పాత్రలు రంగస్థలం మీద చదివినట్టే ఉండాలి. మధ్య మధ్యను భరతుడి నాట్యశాస్త్రం బ్రాడ్లీ వ్రాసిన విమర్శ ఇవన్నీ వినిపించాను. దశరూపకం - ఒకటేమిటి- ఆ క్షేత్రంలో లభించినవన్నీ తూర్పారా బట్టాను. రెండు సంవత్సరాయిన తరువాత మావాడు మంచి నాటకం కంపెనీ వాళ్ళు బతిమాలగా తిరిగి నటించడానికి వెళ్ళిపోయాడు. నాకు మరో ఆరు నెలల తరువాత ఉన్న ఊళ్ళోనే ఉద్యోగం దొరికింది. దానా దీనా నేను మావాడి నాటకాలన్నిటికీ హాజరవడం, నాటకం అయిపోయిన తరువాత వాడడిగే ప్రశ్నలకు జవాబుల రూపంలో విమర్శించడం చేసేవాడిని.

ఈ విధంగా మా యిద్దరి అనుబంధం గట్టిపడింది.

ఎవరేనా నటుల దగ్గిర నన్ను తన శిష్యుడిగా చెప్పుకునేవాడు. అంతకు మించి నాకు రాగాలు నేర్పడం గాని, వేషధారణలో మెలకువలు కాని, నటనలో ప్రేక్షకులను సమ్మోహింపజేసే పద్ధతులను కాని వాడు నేర్పించలేదు.

కాని, నేను ఏకలవ్యుడిని.

నా గురువు వేరే ఎక్కడో ఉన్నారు. ఎక్కడున్నారో తెలిసినా వారిని కలియడం లేదు.

రైలాగుతోంది. జనంలో సంచలనం- ఊపిరి పీల్చుకోడానికి వ్యవధి లభిస్తుంది.

* * *

మెయిలు సామర్లకోటలో చాల సేపాగింది. ఇంజను కేవో మరామత్తులు చేస్తున్నారు. ప్లాట్ ఫారమ్ మీదదిగి, స్టాలులో కాఫీ తాగి పచారు చేస్తున్నాను. వెనకనుంచి ఎవరో వచ్చి నా భుజం మీద చెయ్యి వేసి పలకరించారు.

''రాజశేఖరం!''

నేను తిరిగి చూశాను. అతను మోహనరావు, మా చుట్టమాయన. నా పెంపుడు తల్లి తమ్ముడు. వరుసకు నా మేనమామ. పెద్దాపురంలో కళావంతుల సంఘానికి ప్రెసిడెంటు.

''ఓహో! మోహనరావుగారా? ఎన్నాళ్ళకి? అందరూ బాగున్నారా? అమ్మగారెలా ఉన్నారు?'' అడిగాడు. ఆ దగ్గిర బంధువును చూడగనే కళ్ళు చెమర్చాయి.

అతడు నన్ను అందరి మధ్య కావలించుకున్నాడు.

''ఎన్నాళ్ళకి చూశాను. అమ్మగారు బాగున్నారా? రాత్రికి ఇక్కడ ఉండి వెళ్ళి పోకూడదా?''

అతడు చాల ఆప్యాయంగా ఆహ్వానించాడు.

''చాల తొందర పని మీద కొవ్వూరు వెళ్తున్నాను, మా స్నేహితుడు బాగు లేడు టెలిగ్రాము వచ్చింది''.

''పోనీ! రాత్రికి భోంచేసి బస్సులో వెళ్ళిపోకూడదా''?

''మనింటికి రావడానికి నాకభ్యంతరమేముంది?''

ఆ యిల్లు ఇప్పుడు నాదే. మా పెంచుకున్న తల్లి నాకది వీలునామాలో ఇచ్చింది. అంతమంది దగ్గిరచుట్టాలు ఉన్నా ఆవిడ మనస్ఫూర్తిగా నాకిచ్చింది. దానికి వాళ్ళె వరూ అభ్యంతరం చెప్పలేదు. వాళ్ళందరూ ఆ ఇంట్లో ఉంటున్నారు. ఈ మార్పులు, వాళ్ళ జీవన విధానంలో మార్పులు తేలేదు. మోహనరావు చాల ఇబ్బందులలో పడ్డాడు. అతనో బ్రాకెట్ల కంపెనీ నడిపేవాడు. పోలీసు రెయిడ్లు జరిగాయి. కంపెనీ దివాలా తీసింది. పాతికవేల వరకు పెద్ద వడ్డీకి అప్పులు తెచ్చాడు. ఆర్జనలేదు. వడ్డీకి చేతిలో పైసా కూడా ఆడేది కాదు. అపుడు నాకుత్తరం వ్రాశాడు. ఇల్లు తనఖా పెట్టి బాంక్ నుండి ఋణం తీసుకుంటానని వ్రాశాడు. అందులో ఋణం తీర్చడం గురించి ఏమీ రాయలేదు. నేను వీలునామా, పవరఫ్ అటార్ని, ఇంకా యింటి క్రయచీటి. మిగిలిన పత్రాలు అన్నీ రిజిస్టరు చేసి పంపించాను. ఆరు నెలల తరువాత అన్నీ నాకు తిరిగి వచ్చాయి. అతను శ్రమ పడి ఋణం తీర్చాడు. వాళ్ళందరూ బాగుండాలంటే ఎవరో మంచి వాడి కంట్రోలులో ఉండాలి. ఇది మా తల్లి నాగరత్నం ఆలోచించి చేసిన మంచిపని.

మోహనరావు ఇప్పుడు చుట్టల వ్యాపారం చేస్తున్నాడు. అతని చెల్లెలికి ముగ్గురు కొడుకులు. వాళ్ళు అట్టే చదువుకోలేదు. వాళ్ళ తల్లి వృత్తిలోకి దిగకుండా ఒకరితో వెళ్ళిపోయింది. ఆ కుటుంబాన్ని పోషించే భారం కూడా ఇతని మీద పడింది.

అతనికి చాల వ్యసనాలున్నాయి. ఎవరెంత చెప్పినా ప్రయోజనం లేకపోయింది. కంపెనీ దివాలా తీసిన తరువాత అతను మూడు నెలలు నరక యాతన అనుభవించాడు. జీవితం నేర్పిన పాఠాలివి. ఆ మూడు నెలలు నాకు ఉత్తరం వ్రాయడమా మానడమా అన్న సందేహంలో పడ్డాడు. చాల నిజాయితీ కలవాడు. అందుకే అతనంటే నాకు చాల గౌరవం.

''వ్యాపారమెలా ఉంది?'' నేనడిగాను.

''ఇప్పుడు బాగుంది. కుర్రాళ్ళు చాల శ్రమ పడుతున్నారు. మనింట్లో వెన కాతల ఒక సిమెంటు రేకుల షెడ్డు వేయించాను. అందులో చిన్న పరిమాణంలో

మట్టల ఫ్యాక్టరీ నడుపుతున్నాము. మార్కెటులో మన సరుకుకి మంచి గిరాకీ ఉంది.'' అన్నాడు మోహనరావు.

ఇంజను మరొమ్మొత్తులయి మళ్ళా బ్రేయినుకు తగిలింది. మోహనరావు పరుగులు తీసి ప్లాట్ ఫారమ్ మీద ఉన్న పళ్ళదూకాణంలో తాటాకుల బుట్ట నిండా పళ్ళుకొని తెచ్చి నాచేతిలో పెట్టాడు.

''ఇవన్నీ ఎందుకు?''

''నీ స్నేహితులెవరో జబ్బుగా ఉన్నారుకదా? వారికేనా పనికివస్తాయి.''

ఇంతలో సిగ్నలివ్వడంతో ఇంజను కూత పెట్టింది. రైలు నడిచింది అతని చేతులలోంచి చేతులు తీసుకున్నాను. చెమ్మగిల్లిన అతని కళ్ళల్లోంచి నా చూపులు మరల్చుకున్నాను. నాకన్న పెద్దవాడు చెతులెత్తి దండం పెట్టాను.

''తిరుగుదలలో ఇక్కడ దిగి రెండురోజులుండాలి''

నేను తల ఊపాను - రైలు పరుగందుకుంది.

.... నాకు ఉద్యోగం దొరికి అప్పటికి ఆరు నెల్లే అయింది. కాకినాడలో వారం రోజులు పని పడింది. పని శనివారం పన్నెండు గంటలకు పూర్తయింది. హోటలులో భోజనం చేసి తిన్నగా సామర్లకోట వచ్చాను. నేను వెళ్ళవలసిన రైలు రెండు గంటలు లేటు. ఏం చెయ్యడమో నాకు తోచలేదు. అపుడు నాకు జ్ఞాపకం వచ్చింది. నాగురువు, నా పెంపుడు తల్లి అక్కడికి రెండు మైళ్ళ దూరంలోనే ఉంది. ఇంతకన్న మంచి అవ కాశ మెప్పుడు దొరుకుంతుంది? ఆమె గురించి చాల కాలమయి ఏవార్త తెలియ లేదు. ఎంత కాలమయింది ఆమెను చూసి? రమారమి ఏడేళ్ళయింది. ఈ ఏడేళ్ళ లోను నేను మహానుభావుడు నాగభూషణాన్ని బాగు చేయడానికి కంకణం కట్టుకోడం చేత మా గురువు గురించి శ్రద్ధ తీసుకోలేదు. మళ్ళా ఆనాటికీనాడు.

రిక్షాబేరమాడి నాగరత్నం యిల్లు చేరేసరికి మధ్యాహ్నం మూడు గంటలయింది. ఆమె చెప్పిన గుర్తులు అంతగా అవుసరం లేక పోయింది. నాటకాల నాగరత్నం యిల్లు రిక్షా వాళ్ళందరికీ తెలుసు.

ఆమె ఇల్లు చాల విశాలమైన స్థలంలో ఉంది. వేయి చదరపు గజాలకు పైగా ఉన్న స్థలంలో మధ్యలో చక్కని ఇల్లుంది. ముందు భాగంలో పూల మొక్కలు, పెరటి వేపు మామిడి, సపోటా, బాదము మొదలైన చెట్లున్నాయి. ఒక పక్కకు పెద్ద నూయుంది. చుట్టూ ప్రహరీగోడ, ఎత్తయిన ద్వారం.

పగటి పూట - ఆవరణలోకి రావడానికి అట్టే యిబ్బంది లేకపోయింది. వీధి తలుపులు తీసే ఉన్నాయి. లోపల చాల మంది జనం కనిపించారు. హడావిడిగా డాక్ట రొకాయన పెట్టి పట్టుకొని వెళ్ళి పోతున్నాడు. అతనిని మరొకరనుసరిస్తున్నారు. గిర

బాల జుత్తు మధ్య పాపిడి, వెడల్పయిన ముఖం. అతను మోహనరావని తరువాత తెలిసింది. వాతావరణంలో భయాందోళనలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఎవరూ నన్నాపరు. ఇంటి వసారాలోకి వెళ్తే చాలమంది కుర్చీలు వేసుకొని కూర్చున్నారు. అందరి ముఖాలలోను విచారం స్పష్టంగా కనిపిస్తోంది. అందులో నాగభూషణం కూడా ఉన్నాడు. రాజమహేంద్రవరంలో ఆ రోజుల్లో నాటకాలాడు తున్నాడు. మావాడే నన్ను పలకరించాడు.

''ఏమిటి సంగతి?'' నేను ప్రశ్నించాను.

''పరిస్థితి చాల విషమించింది.'' అన్నాడు నాగభూషణం.

''ఎవరికి?''

''నాగరత్నానికి''

నేను తొందరగా లోపలికి పరుగెత్తాను.

పెద్ద గదిలో కిటికీ దగ్గిర పట్టె మంచం మీద నాగరత్నం పడుకుంది. చాల మంది ఆడవాళ్ళు లోపలున్నారు. ఒళ్ళు చలవలు కమ్మినట్లున్నాయి. ఉప్పు మూటలు కట్టి కాస్తున్నారు.

నన్ను చూడగానే ఆమె ముఖం మీద ఆనందం వెల్లి విరిసింది.

''అలివేణీ! మా బాబుకు దారీయండి!''

వాళ్ళందరూ ఆశ్చర్య సంభ్రమాలతో పక్కకు తప్పుకున్నారు.

''మా బాబు వస్తాడని నాకు తెలుసు. నీకు ఉత్తరం రాయమన్నాను. రాశారు కూడా. బహుశా అందలేదేమో!''

నాకు ఎంత ఆపుకుందామన్నా దుఃఖం ఆగలేదు. ఆమె మంచానికి అంటుకు పోయింది. భోరున ఏడ్చాను. నాటకరంగానికి తీరని లోటు కలుగుతున్నదని వాపోయాను. కళ్ళు తుడుచుకుని అన్నాను.

''నేను వారం రోజులయి కాకినాడలోనే ఉంటున్నాను. అందుచేత ఉత్తరం అందుకునే అవకాశం లేకపోయింది. ఇవాళ మధ్యాహ్నం బండిలో వెళ్ళిపోవలసిందే. రైలు రెండు గంటలు ఆలస్యంగా వస్తుందంటే, ఏదో హఠాత్తుగా జ్ఞాపకం వచ్చి ఇక్కడికి వచ్చాను.''

''మనం మైపికంగా మీ ఊళ్ళో కలుసుకున్నాం. ఎన్నాళ్ళయింది? ఏడు సంవత్సరాలయింది. అప్పుడు మా బాబు ఎంతుండేవాడు?..... రోహితాస్యుడిగా నా వొళ్ళో పడుకున్నాడు. నా పద్యాలు వింటూ ఒళ్ళు మరచిపోయాడు. ఏ జన్మదో ఈ అనుబంధం.''

ఇంట్లో వాళ్ళందరూ నన్ను గౌరవంగా చూశారు. అందరినీ మా పెంపుడు తల్లి పరిచయం చేసింది. వాళ్ళందరూ ధైర్యం వచ్చినట్లు సంచరించారు. పదిమంది వరకు పేరున్న నటులు వచ్చారు. వారందరికీ భోజన సదుపాయాలు ఏర్పాటయాయి.

రాత్రి తొమ్మిది దాటింది. అందరినీ ఆమె గదిలోంచి పంపించి వేసింది. నేనొక్కడనే ఆమె మంచం మీద కూర్చున్నాను.

''బాబూ! నా జీవితం ఇంత తొందరగా ముగుస్తున్నదని నాకేం విచారం లేదు. ఏదో ఒకరోజు వెళ్ళి పోవాలి. ఎవరికీ భారం కాకుండా వెళ్ళిపోతే అదో అదృష్టం. ఇంత వరకు నామనసు భారంగా ఉండేది. నువ్వు రావడంతో నా హృదయం ఆనందంతో నిండిపోయింది. మామూలు మనిషికి ఇంకేం కావాలి!''

నా కళ్ళంట నీళ్ళు!

''మళ్ళా మనం ఏదో జన్మలో తల్లి కొడుకులుగా కలుసుకుందాము. స్త్రీకి ఇంత కన్న వరమేం కావాలి. నేనీ జీవితంలో సాధించిన దేమని ఒక్కొక్కసారి విచారిస్తాను. బహుశా నీవంటి కొడుకును సంపాదించడమే నేను చేసిన గొప్పపని. నాతో పాటు నాటకాలు వేసిన స్నేహితులందరూ ప్రోగ్రాములు కూడా రద్దు చేసుకొని వచ్చారు. ఇదీ లోకం-బాబూ! నువ్వు చాల గొప్పవాడివవుతావు. నీ గురించి నాగభూషణం చాల కొంచెమే చెప్పినా, నేను మాత్రం చాలా ఊహించాను. నిన్ను చూసిన తరువాత నా సంశయాలన్నీ తీరిపోయాయి. హృదయమున్న మనుష్యులు లోకంలో దొరకడం అరుదు కదా?''

నేనేం జవాబు చెప్పను!

ఆమెకు మందు తాగించాను. పళ్ళరసం ఇచ్చాను. ఆమె నాతో మరి అట్టే మాట్లాడలేదు. కళ్ళుమూసుకుంది.

కొంచెం సేపు నటులందరితో మాట్లాడి వచ్చాను. ఎవరూ పడుకోలేదు. మాట్లాడుకుంటున్నారు. నాగరత్నం గురించి చెప్పుకుంటున్నారు. వారందరికీ ఆమె అంటే చాల గౌరవం.

రాత్రి పదకొండు గంటలకు ఆమెకు తెలివి వచ్చింది. ఆమె తమ్ముడు మోహనరావుని పిలిచింది. వాళ్ళందరూ వారం రోజులై నిద్రాహారాలు లేకుండా ఆమెతో బాధ పడుతున్నారు. నేను వచ్చిన తరువాత వాళ్ళు కొంచెం విశ్రాంతి తీసుకోడానికి వెళ్ళారు. మోహనరావు తొందరగా పోయి అడ్వకేటు వెంకటేశ్వరరావు గారిని తెచ్చాడు. మా అమ్మ అపుడు వీలు వ్రాయించింది. ఆమె యావదాస్తి అంటే ఇళ్ళు, భూములు, బాంకులో నిలువ వున్న పదివేల రూపాయలు, ఆమె పుస్తకాలు - ఆమె సర్వస్వం నాకే వ్రాసింది. మా బంధువుల ముఖాలలో నిర్వేదం తోచడం సహజమే.

దీనికి నేను బాధ్యుడినా?

అందరూ వెళ్ళిపోయారు. రాత్రి ఒంటిగంటయింది.

''ఎందుకిటువంటి పని చేశావు? భగవంతుడేదో నాకిచ్చాడు. ఈ సంపదనేం చేసుకుంటాను?''

ఆమె శుష్కించిన పెదవుల మీద చిన్న నవ్వుతోచింది.

''బాబూ! మనవాళ్ళందరూ వ్యసనపరులు. ఈ ఆస్తిని వారికింద ఉపయోగించాలన్నా వాళ్ళు తగరు. వాళ్ళందరినీ చూసేభారం నీమీద వేస్తున్నాను. ఇది స్వార్థమే అనుకో! నీకన్న నమ్మదగినవాళ్ళు మరొకరు లేరు.''

ప్రశాంతంగా ఆమె ఉదయం చనిపోయింది.

ఆమె కట్టె వెనుక ప్రముఖ నటులు, పుర ప్రముఖులు నడిచారు.

నేను ముందు అగ్నితో అడుగులు వేశాను. నేను ఆ అర్హతను సంపాదించుకున్నాను.

ఈ రోజు ఆ శరీరానికి అగ్ని సంస్కారం చేస్తున్నాను.

ఆహా! విధి!

*　　*　　*

మెయిలు రాజమండ్రి చేరేసరికి సాయంకాలం ఆరుదాటింది. కార్తీకమాసమేమో, అప్పుడే చీకట్లు కమ్ముకుంటున్నాయి. చిన్న చలిగాలి వీస్తున్నది. ఆకాశం నిర్మలంగా ఉండి అక్కడక్కడ చుక్కలు తోచాయి.

నేను చాల పొరపాటు చేశాను. స్టేషనుకు రమ్మని రాగలతకు టెలిగ్రాము ఇవ్వవలసింది. కొవ్వూరులో నాగభూషణం ఇంటికి నేను వెళ్ళలేదు. నాదగ్గిర అడ్రసు మాత్రం ఉంది. ఒకటి మాత్రం నిజం. ఆ యిల్లు గోదావరి గట్టున ఉంది. నాకు టెలిగ్రాము అందిన దగ్గిరనుండి సెలవు గురించి, ప్రయాణం గురించి తొందరపడ్డాను. రాగలత స్టేషనుకు వస్తే ఏ సమస్యలు ఉండేవికావు.

నేనే ట్రెయినులో వస్తున్నానో రాగలతకు తెలీదు. బస్సులో వస్తానో, రైలులో వస్తానో కూడా ఆమెకు తెలీదు. నేను తప్పక వస్తానన్నది ఆమెకు తెలుసు.

నా అవివేకానికి చాల విచారించాను. ఒక్క ఆడకూతురు, రోగంతో మంచం పట్టిన నాగభూషణానికి రెండున్నర సంవత్సరాలయి సేవ చేస్తున్నది. ఒకరోజు కూడా ఏవిధమైన సహాయం కోరలేదు. నాగభూషణానికి ఆరో ప్రాణమైన నేను కూడా ఏమీ పట్టించుకోకుండా వాడిని విడిచిపెట్టాను. ఒంటరిగా ఆమె, భారాన్ని తన భుజాల మీద వేసుకొని చాల శాంతంగా నావను నడుపుతున్నది.

ఎవరినీ ఏమనడానికి వీలులేదు.

సంకటమైన పరిస్థితులలో ముందుకు నడవడమే కర్తవ్యం. స్టేషనుదాటి పైకి నడిచాను. నాకున్నవి హేండ్‌బాగు, పళ్ళబుట్ట మాత్రమే. జట్కాలు, రిక్షాలు లాభంలేదు. ఆటోరిక్షా బేరమాడి అడ్రసు ఇచ్చాను నాగభూషణం ఇల్లు కనుక్కొనే సరికి రాత్రి ఎనిమిది గంటలయింది. ఊరి చివారన యిల్లుంది. రోడ్డుమీదికి వీధి మెట్లున్నాయి. అనుకున్నట్లే మేడమీద గదులున్నాయి. కిందిభాగం ఎవరికీ అద్దెకి ఇచ్చినట్లు లేదు.

ఆటో వాడిని పంపించి వీధి అరుగుమీద కూర్చున్నాను. గోదావరిమీద నుండి చల్లనిగాలి వస్తున్నది. దూరంలో రేవులో గుడిలో దీపాలు కనిపిస్తున్నవి. గోదావరికి అవతల గట్టున పేపరు మిల్లు, పెరుగుతున్న నగరం, ఇళ్ళల్లో దీపాలు కనిపిస్తున్నాయి.

నేను చేయడానికి ఏపనీలేదు. రాగలత తప్పకుండా వస్తుంది. ఇల్లు తాళంవేసి వెళ్ళినప్పుడు ఏదేనా చీటీరాసి గడియసందులో పెట్టిందేమోనని చూశాను. అటు వంటిదేమీ దొరకలేదు. ఇరుగు పొరుగున్నారా అంటే ఈ ఇల్లు అన్నిటికీ దూరంగా ఉంది. అప్పటికీ ఊరుకొక ఫర్లాంగు దూరంలో ఉన్న కిళ్లీబడ్డీ దగ్గర అడిగాను. అక్కడో ముసలిదుంది. ఆమెకు ఈలోకమే తెలీదు.

తప్పకుండా నాగభూషణాన్ని ఏ హాస్పిటలులోనో చేర్చి ఉంటుంది. కొవ్వూరులో ఏవీ పెద్ద హాస్పిటల్సు లేవు. వెళ్తే రాజమండ్రీయే వెళ్ళాలి. గవర్నమెంటు హాస్పిటలుకు వెళ్ళి కనుక్కుంటే తెలుస్తుంది. వెళ్ళాలా మానాలా? నేనొకతోవ, ఆమె ఒకతోవ అయితే ప్రయోజనంలేదు. ఎంత అర్ధరాత్రయినా ఆమె తప్పకుండా వస్తుంది. నేను వస్తానని ఆమెకు తెలుసు.

కృష్ణపక్షం - పంచమినాటి చంద్రుడు రాజమహేంద్రవరం పట్టణంమీద ఉదయి స్తున్నాడు. అరుగుమీద కూచుంటే గోదావరిలో నీళ్ళు కనిపించవు. గట్టు అడ్డం వస్తుంది. లేచి గట్టువేపు వెళ్దామనుకున్నాను. ఇంతలో ఆమె వస్తే.....

క్రమంగా జనసంచారం బాగా పలచబడిపోయింది. వీధి నిర్మానుష్యంగా ఉంది. ఆకలేస్తున్నది. అప్పుడు జ్ఞాపకమొచ్చింది మామ మోహనరావిచ్చిన పళ్ళబుట్ట. తాడు విప్పి రెండు అరటిపళ్ళు తిన్నాను. మరేం తినాలనిపించలేదు. మనసు నిండా ఆం దోళన, అప్రయత్నంగా కళ్ళంట నీళ్ళు - నాగభూషణం చాలగట్టివాడు. వాడికేం భయంలేదు. మనసును ఎంత సముదాయించుకున్నా దుఃఖమాగడంలేదు. రాగలత వాడి జీవితంలో ప్రవేశించేవరకు నేను వాడిని చూసుకునేవాడిని - వచ్చిన ఉద్యోగాలు వదిలిపెట్టాను. రెండు సంవత్సరాలవరకు ఖాళీగా వాడికోసమే యింటిదగ్గిర కూర్చు న్నాను. వాడినో మనిషిని చేయడానికి భగీరథ యత్నం చేశాను. వాడి చిన్న చిన్న కోరి

కలు ప్రేమకోసం వాడి తాపత్రయం అంతా నాకు అట్లే అనిపించింది. వాడికున్న బల హీనతలు కొన్ని పరిస్థితులలో, లేదు. సాధారణంగా అన్ని పరిస్థితులలో పూర్తిగా నామీదే ఆధారపడి వాడి ఆలోచనంతా నాచేతే చేయించి, తోడబుట్టిన సోదరుడికన్న దగ్గిర యిన నాగభూషణం గురించి ఆలోచిస్తుంటే కడుపు తరుక్కుపోతున్నది.

చూస్తుంటే చంద్రుడు ఇళ్ళమీదనుంచి ఆకాశంమీదికి మెల్లిగా పాకుతున్నాడు. నేనిదే మొదటిసారి నాగభూషణం ఇంటినుంచి చంద్రోదయం చూడడం. రాగలత ఋతువు ఋతువుకీ ఈ చంద్రుడిని మేడమీద గదిలో కూచొని చూసింది. ఒక ప్పుడు వెర్రిగా, చంద్రుడు వెళ్ళిపోయేవరకు చూసింది. చూస్తున్నప్పుడు ఆమె మన సులో ముసిరిన భావాలన్నీ ఒకటీ విడిచి పెట్టకుండా కాగితంమీది కెక్కించి నాకు పంపించింది. ఆమె ఉత్తరం చదువుతుంటే నేను కూడా ఆ ఆనందయాత్రలో పాలు పంచుకునేవాడిని. అంతతన్మయంతోను ఆమె వ్రాస్తుంది.

రాగలత గురించి, అంటే ఆమె నిజజీవితం గురించి, నాకంతగా తెలియదు. ఆమె ఎప్పుడూ తన గురించి రాసుకోలేదు. యధాలాపంగా ఆమెతో జరిగిన సంభా షణలలో కొన్ని విషయాలు బయటపడ్డాయి.

రాగలత తల్లి పేరు చంద్రిక. ఆమె భాగవతారిణి. హరికథలు చెప్తారు. వాళ్ళ కోయిల్లు గోదావరి స్టేషనుకు సమీపంలోనే ఉంది. జాబాలి తల్లికి మల్లే ఆమె కూడా బహు పతులను సేవించారు. కాని, రాగలత మాత్రం ఆమె కడుపు పంట కాదు. రాగ లతను ఆమె పెంచుకున్నారు. చిన్నప్పటి నుండి ఆమె తనకు తోచిన రీతిగానే ప్రవ ర్తించింది. చదువులలో ముఖ్యంగా ఇంగ్లీషులో ఆమె చాలా మంచి మార్కులు తెచ్చు కుంది. తల్లి వ్యవహారం ఆమెకు నచ్చలేదు. చివరకు చంద్రిక కూతురి పద్ధతికి స మాధానపడి రాగలతకు అడ్డుపడలేదు.

రాగలతకో మేనత్త ఉండేదట. ఆమె ఇచ్చిన ప్రోత్సాహమే రాగలతకు నాట కాల మీద ప్రత్యేకమయిన అభిమానం ఏర్పడడానికి కారణం. ఆమె హైస్కూలు తరగతులలో ఏ నాటకాలలోను వేషం వెయ్యలేదు. కాలేజీ చదువుతున్న రోజులలో వార్షికోత్సవాలకు ఆడపిల్లల గ్రూపులో వేషం వేసింది.

సంగీతంలో కొంత శిక్షణ పొందింది. భరతనాట్యం కూడా నేర్చుకుంది. కాలేజీ కల్చరల్ అసోసియేషన్‌కు సెక్రటరీ - మనిషి ఒక నిముషం కూడా వ్యర్థం చేయదు. చాల విషయాల మీద చాలా పుస్తకాలు చదివింది. నాట్యశాస్త్రం మీద లలిత కళల మీద ప్రత్యేకమయిన శ్రద్ధ కలది.

ఈ విధంగా చెప్పుకు పోతుంటే ఆమె మంచి గుణాలకు అంతు కనిపించదు. కాని, ఆమె చాల స్వతంత్రమయిన అభిప్రాయాలు కలదని, ఎవరి మాట లక్ష్యం

చేయదని, తనకు నచ్చినది చేయడంలో ఇతరుల యిబ్బందులను కూడా లక్ష్యపెట్ట దని చాలమందికి తెలియదు.

నాగభూషణం ప్రభావం ఆమెపై కనిపించక పోయినా, ఆమె ప్రభావం మాత్రం మావాడిమీద బాగా కనిపిస్తుంది. మావాడు సర్వ నాశనమయిన తరుణంలో ఆమె వాడిని కాపాడింది. పాడి జీవితంలో సంతోషం నింపింది. బహుశా నేను కూడా ఆమె కుమల్లే త్యాగం చేయలేదేమో!

తాను చేస్తున్న టీచరు ఉద్యోగం మానేసింది. నాగభూషణంతో వచ్చి ఉండి పోయింది. తన ఆదర్శాలు, తన ఆశయాలు, తన సుఖం. తన సంపద సర్వం మావా డి కోసం ధారపోసింది. ఒకనాడు కూడా ఆమె ఎవరిమీదా నిందారోపణ చేయలేదు. బహుశా ఆమె వంటివ్యక్తి లక్షలో కూడా ఎదురుపడదు.

ఆకాశం మీద చంద్రుడు మీదకు పాకుతూ మధ్యకు చేరుకున్నాడు.

కర్తవ్యతా మూఢుడనై అరుగు మీద ఒక మూలకు చేరి కూర్చున్నాను. తువాలు తీసి చెవుల మీద నుండి కప్పుకున్నాను. తూర్పునుంచి చలిగాలి మందంగా వీస్తున్నది. ఆకాశంలో నక్షత్రాలు మిల మిల మంటున్నాయి. మహాశాంతి లోకమంతటినీ ఆవ రించినా, నా హృదయంలో ఏదో ఆందోళన కొట్లాడుతోంది.

కోళ్ళు కూశాయి. దూరంగా ఉన్న రేవులో మనుష్యుల రాక పోకలు మొదల య్యాయి. కార్తీక స్నానాలకు ఆడవాళ్ళు గోదావరికి రావడం మొదలుపెట్టారు.

ఆటో ఒకటి వచ్చి యింటిముందు ఆగింది. అందులోంచి రాగలత ఒక్కర్తే దిగింది. ఒంటరిగా అంత రాత్రి పూట ఎందుకొచ్చిందో బోధపడలేదు. లేచి నిల బడ్డాను. ఆటోకి డబ్బిచ్చి ఆమె గుమ్మంలో నన్ను చూచి ఆగింది.

''నీకు బాగా యిబ్బందయింది. నువ్వు మెయిలులో వస్తావని తెలుసు. ఇంటి దగ్గిర కూచుంటావని తెలుసు. ఎంతో ప్రయత్నం చేసి ఇప్పటికేనా రాగలిగాను. రా యింట్లోకి''.

''ఎలాగుంది మావాడికి''? నేను ప్రశ్నించాను. లోపలికెళ్ళకుండా.

''ప్రస్తుతం ఆక్సిజన్ తీసివేశారు. ముందు లోపలికి పద. అన్ని సంగతులు వివరంగా చెప్తాను''.

అప్పటికి నాలుగు గంటలయింది. తూర్పు తెల్లవారడానికి రెండుగంటలు వ్యవధి మిగిలింది.

''పళ్ళు తోము కుంటావా? లేక కాఫీ తాగి తోముకుంటావా? ''ఆమె అడిగింది''.

''పళ్ళు తోముకొని వస్తాను.''

కాఫీ తయారు చేస్తూ ఆమె అన్ని సంగతులూ చెప్పింది.

నాగభూషణం ఆరోగ్యం రెండు వారాలయి అంతబాగులేదు. బాత్‌రూమ్‌కి తీసుకెళ్తుంటే పడిపోయాడు. వెంటనే డాక్టరును పిలిపించి ఇంజక్షనిప్పిస్తే మనిషి బ్రతుకు ముఖం పట్టాడు. రెండు మూడు రోజులలోనే మళ్ళా మామూలు పరిస్థితులకు వచ్చాడు. క్రమంగా ఆరోగ్యం తగ్గుతుంటే మావాడు మంచం మీదే ఉండిపోయాడు. మనుషులను పెట్టి బట్ట కట్టించడం, నీళ్లు పోయించడం వంటివి చేయించింది. ఇన్ని బాధలు పడుతున్నా నాకెందుకు రాయలేదని అడిగాను.

''నాగభూషణం నీకు ఉత్తరంలో ఈ విషయాలు వ్రాయడానికి ఇష్టపడలేదు. ఏమీ మార్పు లేనట్లు నాధోరణిలో నన్ను రాసుకోమన్నాడు. చివరకు నేను అతని ఆరోగ్యంగురించి చేసిన సూచన అతను అర్థం చేసుకోలేదు. లేకపోతే ఆ రెండు మాటలు కొట్టి వేయమనేవాడు. '

మావాడి మనస్తత్వం నాకు అంతుబట్టలేదు.

పరిస్థితులు నిన్న ఉదయానికి విషమించాయి. ఇంటి డాక్టరు వచ్చి వెంటనే హాస్పిటలులో చేర్చమన్నాడు. ముందు నాకు టెలిగ్రామిచ్చి, మనుషులను తెచ్చి టాక్సీలో రాజమండ్రి గవర్నమెంటు హాస్పిటలుకు తీసుకుపోతే అక్కడ ఇంటెన్సివ్ కేర్ యూనిట్‌లో బెడ్ దొరకలేదు. స్పెషలు రూము కూడా దొరకలేదు. ఇన్నీస్ పేటలో అమెరికానుండి వచ్చిన కార్డియాలజిస్టు ఒక నర్సింగ్ హోము పెడితే అక్కడికీ తీసుకు పోయింది. అక్కడ అన్ని సదుపాయాలు ఉన్నాయి. కొంచెం డబ్బు హెచ్చవుతుంది. దానికామె విచారించలేదు.

ఈ ప్రయత్నాలన్నీ చేసి నర్సింగ్ హోములో చేర్చేసరికి మధ్యాహ్నం రెండు గంటలయింది. ఆ క్షణం నుండి ఇప్పటి వరకు, అంటే రాగలత నర్సింగ్ హోము, విడిచి పెట్టే వరకు, ముగ్గురు డాక్టర్లు నాగభూషణం తోనే ఉండిపోయారు. చేయవలసిన ప్రయత్నాలన్నీ చేశారు. ఆక్సిజన్ తీసిన తరువాత, రోగి నిద్రపోతుంటే, నర్సు నొకామెను ఉంచి రాగలత నాకోసం వచ్చింది.

ఆమె బాగా అలిసిపోయింది. కళ్ళు లోతులకు పోయాయి. ఆమెకు సహాయం చేయలేకపోయానని విచారించాను.

ఇద్దరం స్నానాలు ముగించి, కాఫీలు మరో సారి తాగి, నర్సింగ్ హోముకు ఆటోలో చేరేసరికి ఏడుగంటలయింది.

నర్సింగ్ హోము చాల బాగుంది. విశాలమైన గదిలో ఇనుపమంచం మీద

షోము పరుపు పైన మావాడు నిద్రపోతున్నాడు. అది నిద్ర అనుకున్నాము. కోమాలో ఉన్నాడని ఆ తరువాత తెలిసింది. గదిలో ఎయిర్ కండిషనరు పని చేస్తున్నది. అంత కుమించి మరో శబ్దం లేదు.

పైన వరండాలో వెడల్పాటి బెంచీ ఉంది. దాని మీద ఇద్దరం కూర్చొని కార్యక్రమం గురించి ఆలోచనలు చేశాము.

పొద్దున్న వచ్చినప్పుడు రాగలత తన సూట్‌కేసు, నేను నా హాండ్‌బాగు, పళ్ళ బుట్ట నర్సింగ్‌హోముకి తెచ్చాము. పరిస్థితులు ఏవిధంగా మారుతుంటాయో చెప్పడం కష్టం. ఎటు వంటి విపత్కరమైన పరిస్థితులలోను అలజడి చెందకూడదని నేను చెప్పాను. నర్సింగ్‌హోము చేరిన వెంటనే నాగభూషణాన్ని చూచినప్పుడు నాకే ధైర్యం లేదు. ఎంత ఆపుకుందామన్నా దుఃఖం ఆగలేదు. రమారమి పది సంవత్సరాలయి ఒకో తల్లికి పుట్టిన బిడ్డల కన్న చాల దగ్గిరగా ఇద్దరం బ్రతికాము. ఎన్నో రాత్రులు నిద్ర మానుకొని నాటకాల గురించి చర్చించాము. దెబ్బలాడుకున్నాం. కలుసు కున్నాము. ఆ మనిషి బాగుపడాలని ఎన్నో ఆలోచనలు చేసి పథకాలు వేసి, వాటి నన్నిటిని అమలు పరిచాను.

మావాడు ఒక రోజు రాగలతను పెళ్ళాడుతున్నానని చెప్పినప్పుడు నేనేమీ ఆశ్చర్య పడలేదు. వాడే చెప్పాడు. ఆమె స్వయంగా తనను పెళ్ళాడడానికి ముందుకు వచ్చిందని.

రాగలత అహోరాత్రాలు వాడికింద కష్టపడింది. నేను వాడి భారమంతా ఆమె మీద విడిచి పెట్టి దూరమయాను. రాగలత రావడంతో మా సంబంధాల మధ్య పెద్ద అగాధం ఏర్పడింది. దానికి ఆమె ఎంత మాత్రం కారణం కాదు. ఈ విషయం ఆమెకూ తెలుసు - నాకూ తెలుసు - ప్రాణసమానంగా ఒకరినొకరు చూసుకొన్న స్నేహితులు తన మూలాన్న విడిపోయినందుకు ఆమె చాల విచారించింది. ఆమె ఉత్తరాలలో సూటిగా ఇటువంటి ప్రస్తావనలేదు. ఏవో సన్నివేశాలను గుర్తు తెస్తూ మానవ స్వభావాన్ని విశ్లేషిస్తూ ఈ సంగతి నాకు తెలియ జేయడానికి, ఆమె చాల శ్రమ పడింది.

నేనెవరిని నిందిస్తాను?

నన్ను నేనే నిందించుకోవాలి. ఈ నాటకాల పిచ్చిలో పడి నాగభూషణం వెంట ఎందుకు పడ్డానో ఈ నాటికి నాకు అంతు పట్టలేదు. ఈ పిచ్చి లేకపోతే నేనూ అందరి కొడుకులకు మల్లే తల్లి మాటలు గౌరవించి ఆమె ఎంచిన పిల్లను పెళ్ళి చేసుకొని పిల్లా పాపలతో హాయిగా ఉండేవాడిని. అటు తల్లికీ, ఇటు స్నేహితుడికి నా ప్రవర్తన నచ్చనట్లు నేను నడుచుకుంటున్నాను.

నా జీవితం పైని నాగభూషణం ప్రభావం ఎంత వరకు?

త్వమే వాహం, త్వమేవాహం న సంశయః - వాడికి నాకు భేదంలేదు.

ఏదో వాడిమీద మమకారం కొర్ది అనుకుంటున్నాను. రాగలత రంగంలోకి రావడంతో వాడు పూర్తిగా మారిపోయాడు. ఒకప్పుడు నేను ఎంతగా అవుసరమను కున్నాడో ఇప్పుడు నేనంటే అంతకు నాలుగు రెట్లు విముఖతతో ఉన్నాడు. అందుకో సమే రెండున్నర సంవత్సరాలయి వాడు అనారోగ్యంతతో బాధ పడుతున్నా నేనొక్క సారి కూడా చూడడానికి పోలేదు. వాడు లక్ష అనుమానాలు నామీద పెంచుకున్నాడు. నా పొడకూడా కిట్టకుండా పోయింది. వాడికి దూరంగా ఉండి, వాడిక్షేమం కోరడమే నా కర్తవ్యమని ఒక నిశ్చయానికి వచ్చాను.

ఇంత వరకూ రాగలత ఖర్చు పెట్టింది. నేను వచ్చిన తరువాత ఆమెనా యిబ్బంది నుండి తప్పించాను. మధ్యాహ్నం డ్వాక్టరు గారు ఏవో ఖరీదైన యింజక్షనులు తెమ్మంటే కొని తెచ్చాను.

మధ్యాహ్నం ఇద్దరం కలిసి భోజనానికి హోటలు కెళ్ళి వచ్చాము. దారిలో కాని, హోటలులో కాని ఆమె అట్టే మాట్లాడలేదు. నర్సింగ్ హోములో ఒకరు లోపల, ఒకరు పైన ఉండేవాళ్ళం. ఏం మాట్లాడుకుంటాము?

గదిలో నాగభూషణం ఎదురుగుండా, వాడి ముఖంలోకి చూస్తూ కూర్చుంటే ఎన్నో సంగతులు తలపుకు వచ్చేవి. సినిమాలో సన్నివేశం తరువాత సన్నివేశం కనిపిం చినట్లే మొదటి రోజు మావాడిని కలిసిన దగ్గిర నుండి రెండున్నర సంవత్సరాల క్రింద అకస్మాత్తుగా, వాడికి 'మహానట' బిరుదం ఇస్తున్న సమయంలో, విజయవాడ విడిచి పెట్టే వరకు వాడితో గడిపిన కాలమంతా నెమరు వేసుకొని కూర్చునేవాడిని. ఈ లోకంతో సంబంధం లేనట్లు వాడు ఏలోకాల్లోనో విహరిస్తున్నాడు.

ఉదయం పది గంటల వరకు డ్వాక్టర్లు రావడం, రోగి పరిస్థితిని సమీక్ష చేయడం, క్రమంగా అభివృద్ధి కనిపిస్తున్నదని మాకు ధైర్యం చెప్పడం జరుగుతుంది. అక్కడ నుండి మధ్యాహ్నం ఒంటిగంట వరకు రాగలత గదిలోపల, నేను వరండాలోను కూర్చుం టాము. తరువాత యిద్దరం భోజనానికి వెళ్ళి వస్తాము. పిమ్మట నేను లోపల కూర్చుం టాను. రాత్రి డ్వాక్టర్లు వచ్చి వెళ్లిన తరువాత రాగలత లోపల కూర్చుంటుంది. అర్ధ రాత్రి అవుతుంటే ఆమె వరండాలోకి వచ్చి బల్లమీద నడుం వాలుస్తుంది. ఈ విధంగా మేము వంతుల మీద రోగిదగ్గిర కూర్చుంటున్నాము.

రోగి దగ్గిర ఉన్నంత సేపు రోగి గురించి ఆలోచించవచ్చు. వరండాలో ఉన్నప్పుడు ఎవరి గురించి ఆలోచించడం?

రాత్రి భోజనాలయిన తరువాత నేను వరండాలో బల్ల మీద కూర్చుని వాడిని, కొద్ది సేపటిలో లైటు ఆరిపేసి పైకి చూసేవాడిని. కృష్ణపక్షం ఏమో- రోజు రోజుకూ చంద్రుడు రావడం వెనకబడేది. ఎదురుగుండా కనిపిస్తున్న పట్టణం మీద క్రమంగా చీకటి తెర కమ్ముకునేది. చూస్తుంటే అంతా శూన్యంగా తోచేది.

నా బ్రతుకు కూడా ఆ చీకటికి మల్లే ఉంది.

నా హృదయం నిండా శూన్యమే ఆవరించుకుంది.

అన్నీ ఆలోచనలే- అన్నీ బాధలే- అన్నీ గుండెల్లో పేరుకుపోయి ఒక్కొక్కప్పుడు ఉక్కిరి బిక్కిరి చేస్తున్నాయి. ఈ బాధ తగ్గడానికి ఒక్కమార్గముంది. మరొకరితో దానిని పంచుకుంటే హృదయం తేలిక పడుతుంది.

ఎవరితో ఈ బాధ పంచుకోవాలి?

చీకటిలోకి చూస్తుంటే అదోలా ఉంటుంది. చలిగాలి రివటలు బలంపుంజుకుంటాయి. వరండాలోని కర్టెన్లు కిందికి దింపడానికి పోయి, అక్కడనుండి విశాలమైన ఆకాశంలోకి చూస్తుంటే కోట్ల కొలది నక్షత్రాలు సానపెట్టిన వజ్రాలవలె కనిపిస్తాయి. వాటి వేపు చూస్తూ కొంత సేపు ఒళ్ళు మరచిపోతాను. శూన్యమైనది కాదీ ఆకాశం.

రాగలత వరండాలో కూర్చొని ఏం చేస్తుంది?

నాకీవిషయం తెలిసే సరికి మరో రెండు రోజులు పట్టింది.

ఆ రోజు రాత్రి వంతు ప్రకారం నేను అర్ధరాత్రి దాటిన తరువాత లోపలికి పోయి నాగభూషణం దగ్గిర కూర్చున్నాను. నాలుగు రోజులుబట్టి చాల హాయిగా మందుల మత్తులో నిద్రపోతున్న మనిషిలో చలనం కనిపించింది. మనిషి మూలుగుతున్నాడు.

ఏం చేయాలో నాకు తెలీదు. తెలిసిందల్లా రాగలతతో చెప్పడమే. ఒక గంట క్రిందే ఆమె వెళ్ళిందేమో, మంచి నిద్రలో ఉంటుంది. ఆమెను లేపడమా మానడమా అని ఆలోచించాను. కాని పరిస్థితి బాగులేదు.

గది తలుపు తీసి వరండాలోకి వచ్చాను. పైన ట్యూబులైటు వెలుగుతోంది. రాగలత బల్ల మీద కూర్చొని ఏదో రాసుకుంటున్నది.

నన్ను చూడగానే ఆమె పుస్తకం అక్కడే పడేసి, తొందరగా లోపలికి వచ్చింది. రెండు నిమిషాలు రోగి పరిస్థితిని చూసి, ఆవరణలోనే మరొక బంగళాలో ఉంటున్న స్పెషలిస్టు దగ్గిరికి పరుగెత్తింది. అతను తొందరగా వచ్చాడు. ఒక్కపది నిమిషాలు నాడి అవి చూసి ఇంజక్షనిచ్చాడు. తెల్లారే వరకు రోగి నిద్రపోతాడని చెప్పి వెళ్ళిపోయాడు.

వంతు ప్రకారం రాగలత వరండాలోకి పోయి పడుక్కోవాలి. కాని, లోపలే ఉండి నన్ను వరండాలోకి పంపించింది.

ఆమె రాస్తూ రాస్తూ విడిచి పెట్టిన పుస్తకం అలానే ఉంది.

బల్లకింద ఆమె పెట్టె తీసి ఉంది. దానిపక్కనే నా హాండ్ బాగుంది. పళ్ళబుట్ట మాత్రం లేదు. రోగికి పళ్లుతినే అదృష్టం పట్టలేదు. మేమిద్దరం తినక తప్పలేదు.

ఆమె రోజూ నిద్రపోవడం లేదన్నమాట.

ఏమిటి రాస్తున్నది?

ఆ పుస్తకం చూస్తేనే ముద్దొస్తుంది. మంచి కిగితాలు, లెదర్ బైండింగ్ లోపల ముత్యాల కోవలు అక్షరాలు. వీటన్నిటినీ మరచిపోయి, ఒకరు రాస్తున్న స్వంత విషయాలను చదవకూడదనే నియమాన్ని ఉల్లంఘించి, ఆ పుస్తకం చేత పుచ్చుకున్నాను.

అంతే.....

ఆమె వచ్చి నా ఎదుట ఎంత సేపయి నిలుచుందో!

నేనీ ప్రపంచంలో లేను.

ఆమె కర్టన్లు మీదికి లాగింది.

గుప్పున వెలుగు ఒక్కసారి వచ్చింది.

''నువ్వు డాక్టర్ని పిలుచుకురా! నీకోసం నేనిక్కడ కూర్చుంటాను.'' కాళ్ళు తడబడుతుంటే డాక్టరు దగ్గరికి పరుగు తీశాను.

* * *

''మాస్టరుగారూ! మీరేనా నాగభూషణం గారు?'' నాకు కొద్ది దూరంలో బెంచీ మీద కూర్చొని మరొక కుర్రాడికి అరగంట నుంచి పద్యాలు వినిపిస్తున్న పెద్ద మనిషిని అడిగాను.

ఆ పెద్దమనిషి నేను వచ్చి నిలబడ్డానని, వయసులో ఉన్న ఆడపిల్లను ఆవిధంగా నిలబెట్టకూడదని భావించినట్లు లేదు. అతని ధోరణే అతనిది. నేను వచ్చినట్లు అతను గమనిస్తే తప్పకుండా తానే ముందు పలకరించేవాడు.

అతడు ఇరవై రెండు, ఇరవై మూడేళ్ళ వయసులో ఉన్నాడు. పంచ కట్టుకున్నాడు. పొడుగు చేతుల చొక్కా తొడుక్కున్నాడు. పక్క పాపిడి, విశాలమైన నుదుటి మీద ముంగురులు అతడు చదివే పద్యాలకు అనుగుణంగా నాట్యమాడుతున్నాయి.

నేను అరగంట సేపయి లోనికి వచ్చి ఆ పద్యాలు వింటూ అలా నిశ్చేష్టురాలనయి ఉండిపోయాను. ఆయనకు చాల బిరుదులున్నాయి. ఆయన నాటకాలంటే ప్రజలు వెర్రెత్తిపోతారు.

గత నెల రోజుల నుండి ఆంధ్ర నాటక కళామండలి వారు రాజమహేంద్ర వరంలో నాటకాలాడుతున్నారు. పది నాటకాలలోను అప్పుడో ఎనిమిది నాటకాల యిపోయాయి. మరి రెండే ఉన్నాయి. విప్రనారాయణ, హరిశ్చంద్ర.

ఒక నాటకమూ చూసే అవకాశం నాకు చిక్కలేదు. పరీక్షలు అవుతున్నాయి. ఇవాళతో ఆఖరి పరీక్ష అయిపోయింది. మధ్యాహ్నం ఒంటిగంటకు పుస్తకాలు మూలకు పడేసి హాయిగా నిద్ర పోదామనుకున్నాను. ఒక నాటకం వేయాలని ప్రిన్సిపాలుగారు ప్రత్యేకంగా కబురు పంపించి చెప్పారు. విద్యార్థినుల కల్చరల్ అసోసియేషనుకు సెక్రె టరీగా ఉన్న నా తలపై ఆ భారం పడింది. అభిజ్ఞాన శాకుంతలం ఆడాలని చాల కాల మయి మేము అనుకుంటున్నాము. కొన్ని పాత్రలకు తగిన అమ్మాయిలున్నారు కాని దుష్యంతుడి పాత్రకు తగిన మనిషి మా లేడీ స్టూడెంట్సులో ఎవరూ కనిపించలేదు. మందాకిని ఉంది. ఎత్తు, ఒళ్లు అన్నీ బాగానే ఉన్నాయి. కాని, ఆమె గొంతుక కీచుగా ఉంటుంది. ఎంత జాగ్రత్తగా మేకప్ చేసినా దుష్యంతుడు వేషం ఆడపిల్ల వేసినదని తెలుస్తుంది. అప్పుడు నాకో చిన్న ఆలోచన తట్టింది. సమర్థులైన మగనటులు దొరి కితే వారిని పిలిపించడానికి ఏవైనా అభ్యంతరాలున్నాయా? ముఖ్యంగా హీరో పాత్ర బాగుండక పోతే నాటకం రక్తి కట్టదు. నేను శకుంతలగా నటించాలి కాబట్టి, నాకు అం గీకారమైతే ప్రిన్సిపాలు గారు ఒప్పుకుంటానన్నారు. ఇరవయ్యో శతాబ్దం అయిపోవ స్తున్నది. ఆంధ్రులం అన్ని విధాల ముందంజ వేస్తున్నాము. ఇటువంటి చిన్న మార్పుకి మరేం తప్పు లేదని అందరి చేత ముందే ఒప్పించాను.

అప్పుడే నాకీ ఆలోచన తట్టింది.

నటరత్న నాగభూషణం గారి నాటకాలు నెల్లాళ్ళయి ఆడుతున్నారు. మా వార్షికో త్సవం వేళకి అన్ని నాటకాలు అయిపోయి అతను కాళీగా ఉంటారు. అతని గురించి ప్రజలలో చాల మంచి అభిప్రాయముంది. అతనికి రంగస్థలం మీద చూసిన వారు అతడు నటుడిగా పుట్టాడని అంటున్నారు. అతనిని ఇంటర్వ్యూ చేసిన పత్రికా విలేఖ రులు అతనికి కల అపారమైన నాట్య శాస్త్రజ్ఞానం గురించి వ్రాస్తున్నారు. మంచి అనుభవం కల మనిషి. అతడిని దుష్యంతుడిగా మా నాటకంలో వేయమని అడ గాలని వచ్చాను. అతని రేటు చాల హెచ్చు. అయినా విద్యార్థినులతో కలిసి వేసే నాట కానికి ఆయన కన్సెషన్ ఇవ్వవచ్చు. ఇన్ని ఆలోచనలు పెట్టుకొని, నాటక మండలి వారికి బస యిచ్చిన సెకెండరీ స్కూలుకి పని కట్టుకొని ఆ సాయంకాలం వెళ్ళాను.

నేను వెళ్ళేసరికి ఆ పెద్ద గదిలో ముగ్గురే ఉన్నారు. ఒకాయన కిటికీ దగ్గిర రెండు బెంచీలు జోడించుకొని రంగురంగుల ముఖమల్ దిండు మీద తల పెట్టుకుని పలు చని శాలువ కప్పుకొని పడుకున్నాడు. మరో యిద్దరు అతనికి కొద్ది దూరంలో బెంచీల మీద ఎదురుగా కూర్చున్నారు.

పద్యాలు చదివే ఆయన చాల చక్కగా ఉన్నాడు. మనిషి కూడా ఒడ్డూపొడుగూ అన్ని విధాల బాగున్నాడు. ఇక అతని పద్యాలు వింటుంటే నేను చేష్టలుదక్కి నిలబడిపోయాను. అరగంట వరకు నిలబడే ఉన్నా నాకేమీ శ్రమ అనిపించలేదు. అతను నేను కోరిన విధంగా అభిజ్ఞాన శాకుంతలంలో పద్యాలే చదువుతున్నాడు. కాళిదాసుడి మూల నాటకం నుండి ముందు శ్లోకం చదువుతున్నాడు. తరువాత తెలుగులో కందుకూరి వారి అనువాదం నుండి పద్యాలు చదువుతున్నాడు. చాల బాగుంది. వెదకబోయిన తీగ కాలికి తగిలింది. మేమాడబోయే నాటకం వీరికి పాతదేనన్నమాట. తక్కువ వ్యవధిలో రడీమేడ్ మగ నటుడు దొరకడం నా అదృష్టంగా భావించాను.

ఆ పద్యాలు అతడు అమోఘంగా చదువుతున్నాడు. నిండు కుండ తొలకదు. అదే దృష్టితో లోకాన్ని మరచిపోయి అతడు చదువుతున్నాడు. ఒకటి రెండుసార్లు మధ్యలో ఆపి ఎదుటి మనిషికి ఏవో వివరించాడు. అతని కంఠం ఎంత సౌమ్యంగా ఉంది?

శాకుంతలంలోని పద్యాల తరువాత అతను హరిశ్చంద్ర నాటకం నుండి రెండు పద్యాలు చదివాడు.

''అకటా చేరెడు నేల కుందగదె.....''

ఏదో దివ్యమయిన అనుభూతి. రంగస్థలంపై అతని పద్యాలు వినే భాగ్యం కలగకపోయినా మరో విధంగా హరిశ్చంద్రలో పద్యాలు వింటున్నందుకు చాల సంతోషించాను. నాగభూషణంగారి హరిశ్చంద్ర నాటకమంటే జనం విరగబడిపోతారు. అందులో ఈ పద్యానికి ఎంతో ఆదరణ ఉంది. ఆ విరుపులు, ఆ సమాసాలు, ఆ నడక .... అన్నీ అద్భుతంగా ఉంటాయని, ఎన్నిసార్లు విన్నా తనివితీరదని అంటారు. నా ఎదుట మనిషి నేను ఆడకూతుర్ని దగ్గర్లో నిలుచున్నాననే నా గుర్తుంచుకోకుండా పద్య పఠనంలో నిమగ్నుడయాడంటే ఎంత డెడికేటెడ్ ఆక్టరు? ఆ పద్యంలో రాగం పాలు తక్కువ. అతని ముఖంలో తోచిన దైన్యం గొంతు నుండి వెలువడుతున్న పద్యంలోని మాటలతో అన్వయించింది. అదే రంగస్థలం మీదనయితే వేలకొలది ప్రేక్షకులు కన్నీళ్ళు కార్చవలసిందే. ఇదంతా నాటకమని నమ్మవలసిన నావంటి దానికే ఆ పద్యం వింటుంటే కళ్ళు చెమ్మగిల్లాయి.

తరువాత చదివిన పద్యం ఎంతో గొప్పగా ఉంది. పద్యం చదివింది హరిశ్చంద్రుడు కాదు. అది చంద్రమతిది. ఆ పద్యమంటే నేను చెవులు కోసుకుంటాను. ఇలా చదువుతే బాగుండునను కుంటాను. నేనా విధంగా చదవడానికి ప్రయత్నిస్తాను. ఆ పద్యం ఒక్కరే నేననుకున్న విధంగా చదవగలరు. మరెవరూ చదవలేరు. ఈ మగ ఆక్టరు ఎంత గొప్పవాడు కాకపోతే చంద్రమతి చదవవలసిన పద్యం అంత దివ్యంగా చదవగలడు?

''జలదమా!....''

నా కరచరణాలలో చలనంలేదు. శరీరమంతా మనసయి, పంచేంద్రియాలు శ్రవణేంద్రియంలో కలిసి పోయాయి. అతడీ పద్యం చదువుతాడని నేను కలలో కూడా అనుకోలేదు.

''....... సుంతమార్బలికిన దోసమా!''

నా హృదయంలోని వీణ తీగలను సుకుమారమైన మూర్ఛనలతో ప్రకంపింప జేస్తున్నది ఆ లలితలలితమైన కంఠం.

ఆ పద్యం పూర్తయేసరికి నేను ఎక్కడున్నానో మరచిపోయాను.

కళ్లనుండి ధారగా కారుతున్న నీళ్ళను రుమాలుతో తుడుచుకొని, డగ్గుత్తికతో అన్నాను!

''నాగభూషణంగారూ! నమస్కారాలు!''

అతనామాటలు విని ఈ లోకంలోకి వచ్చాడు. కూర్చున్నవాడల్లా ఒక్కసారి లేచాడు. ఎదురుగా వయసులో ఉన్న ఆడపిల్లను చూసి కంగారు పడ్డట్లున్నాడు.

''అయ్యో! నాగభూషణంగారూ! ఇంతవరకూ మీ గురించి వినడమేకాని మిమ్మల్ని చూసే భాగ్యం కలగలేదు. ఈరోజు మిమ్మల్ని చూడడమే కాకుండా, మీ పద్యాలని వినే అదృష్టం కలిగింది.''

నా ఎదుట మనిషి బెల్లం కొట్టిన రాయిలా ఏమీ మాట్లాడడు. నా ముఖంలోకి చూస్తూ ఉండిపోయాడు. అతని చూపులలో నా చూపులు కలిశాయని తెలుసుకోడానికి మరో పదినిమిషాలయింది. బహుశా యిద్దరం కూడా ఆ స్థితిలోనే ఉండేవాళ్ళమేమో, ఆ పడుకున్న ఆయన కదిలిరాకపోతే!

''ఓహో! ఎవరా వచ్చినవారు!''

నేనప్పుడు లోకంలోకి వచ్చాను.

''నేను రాగలతను''. అన్నాను.

''రాగలతా!'' ఆ వచ్చినాయన ప్రశ్నార్థకంగా పద్యాలు చదివిన మనిషివేపు చూశాడు.

''రాగలతంటే రతీదేవి'' అన్నాడు పద్యాలు చదివిన అతను.

మా అమ్మ నా పేరుకి అర్థం చెప్పింది. తరువాత ఎవరూ నా పేరుకి అర్థమేమిటని అడగలేదు. చాల మందికి నా పేరుకి రతీదేవి అన్న అర్థముందని తెలియదు. ఎవరూ ఆ సందేహం కూడా వెలిబుచ్చలేదు.

లేచి వచ్చిన ఆయన జలతారు కండువా బనీను మీంచి కప్పుకున్నాడు.

''మీకెవరు కావాలి?'' ఆయనే ప్రశ్నించాడు.

''నటరత్న నాగభూషణం గారు.''

''ఓహో! అదా సంగతి! ఓ కన్యారత్నమా! నువ్వు వెతుక్కుని వచ్చిన నటరత్న నాగభూషణం వీడని తెలుసుకో!''

అతను కండువా సర్దుకొని నిలబడ్డాడు.

''మరి వీరెవరు?'' పద్యాలు చదివిన అతన్ని చూపించి అడిగాను.

''వీడా! వీడు నా శిష్యుడు. ఇంకా చెప్పాలంటే శిష్యుడికి శిష్యుడు. ఈ పిల్ల కాకికి బిరుదులు పొందిన నాగభూషణానికి సాటా?''

''మరి, చాల చక్కగా పద్యాలు చదివారు!'' అన్నాను నేను.

''అది సహవాసదోషం'' అన్నాడు నాగభూషణం.

''మామూలు చెక్క పేడుంటుంది. దానిని మంచి గంధం చెక్క దగ్గిరుంచుతే దాని వాసన అంటుతుంది. అలా చెప్తే ఇంకా బాగుంటుందేమో?'' అన్నాడు పద్యాలు చదివిన అతను.

నాగభూషణం నవ్వాడు.

''సరే! నువ్వు పోయి కాఫీలకు ఏర్పాటుచెయ్యి! రాగలతా! ఇక్కడ కూర్చో! నీ వచ్చిన పనిగురించి మాట్లాడదాం.''

పద్యాలు చదివిన అతను వెళ్ళిపోతుంటే కళ్ళప్పగించి చూస్తున్నాను. అతని మాటలు కూడా ఎంత చక్కగా ఉన్నాయి. శిష్యుడికి ఇంత గొప్పవాడయితే మరి గురువుగారు?

నేను వచ్చిన పని అతనికి చెప్పాను.

''మీరు చాల గొప్ప పేరున్నవాళ్ళు. మీ సరసన నటించడానికి అనుభవమున్న నటీమణులు కావాలి. మేమందరం విద్యార్థినులం. మాకు రంగస్థలమంటే ఇంకా కొత్తే. నాలుగయిదు నాటకాలు వేస్తే అయిపోతుందా? కాలేజీతో నాకున్న సంబంధం అయిపోతుంది. అయిదు సంవత్సరాలుగా నేను కల్చరల్ అసోసియేషన్‌కి సెక్రెటరీగా ఉండి చాల మార్పులు చేశాను. ఇది అన్నిటికన్న పెద్ద మార్పు. కాలేజీ చరిత్రలో ఇదొక మరపురాని ఘట్టంగా ఉండిపోవాలి.''

నాగభూషణం వింటున్నాడు. ఏవీ ప్రశ్నలు వెయ్యలేదు.

''దీనికి ఆహూతులైన వారు పలు రకాలైన వారు. జిల్లా జడ్జీలు, లాయర్లు, డాక్టర్లు, సంపన్నులు, వ్యాపారులు, పండితులు, పామరులు, చిన్నవాళ్ళు, పెద్దవాళ్ళు

అందరినీ రంజింప జేయడం మా బోంట్లకు సాధ్యం కానిది. మీకు నాటక రంగంలో ఆంధ్రదేశమంతటి లోను వ్యాపించిన పేరుంది. మీ కీర్తి ప్రతిష్ఠల క్రింద మేము తల దాచుకుంటాము''.

నాగభూషణం నా మాటలు చాల శ్రద్ధగా వింటున్నాడు.

''అందరికీ అంత బాధ్యతలేదు. నాకు సెక్రెటరీగా కాక మీ సరసన శకుంతలగా నటించవలసిన అవసరం ఉంది. అందుకోసమే నేను చాల భయపడుతున్నాను. ఒకప్పుడు నా నటనలో లోపాలు కనిపిస్తాయి. వాటిని మీరు సహించాలి. అదే నామనవి.''

నాగభూషణం నవ్వి నా ముఖంలోకి చూశాడు.

''మీరు నాటకంలో వేషం వేయడానికి వేయి రూపాయలు పుచ్చుకుంటారని తెలిసింది. హరిశ్చంద్ర వేషానికి రెండు వేలు తీసుకుంటారట. మేము మీకు అంత డబ్బిచ్చుకోలేము. మీ గౌరవానికి భంగం రాకుండా ఏదో చిన్న బహుమతి అందరి ముందు చదివించుతాము. దీనికి మీకు అభ్యంతరం లేదనుకుంటాను.''

నాగభూషణం ఒక్క పలుకైనా ఆడలేదు. పలుకే బంగారమాయెనా?

''అంతేకాదు. మీరు మీ అనుభవాల గురించి ఒక్క అరగంట ఉపన్యసించాలి. అది సోదాహరణంగా ఉండాలి. అంటే మీరు వేసిన నాటకాలలో ముఖ్యమైన సన్నివేశాలు. పద్యాలు నటన - ఏమి మీరు ప్రేక్షకులకు అందజేయదలచుకుంటే - వాటిని ఉదాహరణలుగా చెప్పాలి''.

నాగభూషణం నవ్వుతున్నాడు.

''మీరాకవల్ల మాకాలేజీకి ఎలాను పేరువస్తుంది. మేము కూడా, మాకు శక్తి ఉన్నమేరకు మీ గౌరవాన్ని పెంపొందించి, మీ యశస్సుకు మరి కొంత చేర్చుతాము.''

నాగభూషణం నా ముఖంలోకి చూస్తున్నాడు. ఆ చూపులు నా హృదయం లోతుల వరకూ పోతున్నాయి.

''మౌనం అర్ధాంగీకార మంటారు! మా నాటకం పదిరోజుల తరువాత వేస్తాము. మీ అంగీకారం తెలిసిన తరువాత మిగిలిన వారిని కలిసి, వారికి వీలయిన దినాలు చూసుకొని, నోటీసులు పంచిపెట్టాలి. బహుశా మిమ్మల్ని మా ప్రిన్సిపాలు గారు కలిసి ఈ సంగతులన్నీ చెప్పవలసింది. వారు పరీక్షల హడావుడిలో ఉండి రాలేకపోయామని చెప్పమన్నారు.''

అపుడు నాగభూషణం కూర్చున్నవాడు లేచి నిలబడ్డాడు.

''రాగలతా! ఈ నాటకాల వ్యాపార మెటువంటిదంటే ఈరోజు పొగడుతారు.

రేపు మరచి పోతారు. కాని, నా పద్ధతివేరు. ఒకసారి స్నేహం కలిసిన తరువాత కొంత కాలం మరచి పోలేను. నేను కోరేది స్నేహం మాత్రమే.''

మే మిద్దరం మాట్లాడుతుంటే పద్యాలు చదివిన పెద్ద మనిషి రెండు కప్పులతో కాఫీలు పట్టుకొని కొంచెం దూరంలోనే నిలబడ్డాడు.

''చూడు! వాటినక్కడ బల్లమీద పెట్టి అలా గోదావరి గట్టున తిరిగిరా!'' అన్నాడు నాగభూషణం.

రెండవ అతడు కాఫీ కప్పులు అక్కడుంచి వెళ్ళిపోయాడు.

''రాగలతా! నువ్వు చెప్పిన ప్రకారమే సోదాహరణమైన ఉపన్యాసం ఇస్తాను. తరువాత దుష్యంతుడిగా నీ పక్కన నటిస్తాను. నాకు మరి నాలుగు రోజులలో ఈ వూరిలో పని అయిపోతుంది. మా ట్రూప్ వెళ్ళి పోతుంది. నేనొక లాడ్జిలో బస చేస్తాను. ఇది నా మనస్ఫూర్తిగా చేస్తున్నపని. ఇంకొక ముఖ్య విషయం. నీవంటి చక్కని అమ్మాయి నన్ను సాదరంగా ఆహ్వానిస్తే నేను డబ్బు పుచ్చుకుంటానా? మరేదో బహుమతిగా ఇస్తామన్నావు. అది కూడా నాకవసరం లేదు. మరో విషయం. నా లాడ్జి ఖర్చులు, భోజనం ఖర్చులు. అవి కూడా మీరేమీ భరించనక్కరలేదు. మీరు నోటీసులు వేయించే ముందు నాతో చెప్తే మీకు కొన్ని సలహాలిస్తాను.''

నాగభూషణం మాటలు చాల సంతోషాన్ని కలిగించాయి. అతను అంత ఉదారంగా ఉంటాడని కలలో కూడా నేననుకోలేదు.

''నాలుగయిదు రోజుల్లో మేము రిహార్సల్సు మొదలుపెడతాము. మా కాలేజీలో జరుగుతాయి. సాయంకాలం వేళ మీకు ఎవరిదేనా స్టూడెంట్సు కారుగాని, కాలేజి జీపుగాని పంపిస్తాము. మీరు రావలసింది.''

''రాగలతా! ఈ రిహార్సల్సు మీ బోటి వారికి- నేనటువంటి వాటికి రాను. నా నటననాది. దాని కనుగుణ్యంగా మీరందరూ నటించవలసిందే. దేనికేనా రాజీ పడతాను. కాని ఇటువంటి విషయంలో నా నిర్ణయాన్ని కొంచెం కూడా సడలించలేను.''

నాగభూషణం చాల పెద్ద నటుడు. ఏదోనాతో కొంచెం చనువుగా మాట్లాడు తున్నాడని అనుకోడం తప్పు. అది గొప్పవాళ్ళ లక్షణం.

''క్షమించండి! మీరు చెప్పినట్లే చేస్తాను. మీ నియమాలను ఉల్లంఘించమని చెప్పడం లేదు. వాటిని గౌరవిస్తాము.''

అతని దగ్గిర సెలవు తీసుకొని వెళ్ళిపోయాను.

నాటకం ఆడడంలో చాల సాధక బాధకాలున్నాయి. అందులో ఆడపిల్లలు ఆడడంలో మరీ ఇబ్బందులు తలలెత్తుతాయి. ఏదో విధంగా దుష్యంతుడు గారిని

సంపాదించామనుకుంటే కణ్వపాత్రకు ఎవరూ దొరకలేదు. దుష్యంతుడి పాత్ర ఎంత ముఖ్యమో ఈ కణ్వుడూ అంతే - నాలుగో అంకంలో అతడి పద్యాలే ముఖ్యం. ఏ ఆడపిల్లా సరియైనది కుదరలేదు. ఈ సమస్య గురించి ఆలోచిస్తుంటే నాగభూషణం గారి శిష్యుడు జ్ఞాపకానికి వచ్చాడు.

మధ్యాహ్నం రిక్షా చేయించుకొని నాగభూషణం ఉన్న బసకి వెళ్ళాను. అప్పుడే హోటలులో భోజనం చేసి గురుశిష్యులు వచ్చినట్లున్నారు.

నాగభూషణం నన్ను చూడగానే శిష్యుడికేదో పని పురమాయిస్తున్నాడు.

''అయ్యా! నాగభూషణం గారూ! మీ శిష్యుడితోనే పనుంది. మాటలయిన తరువాత అతనిని పంపించవచ్చు.'' అన్నాను నేను దూరంనుండే.

కాని నాగభూషణం నా మాటలు వినిపించుకోలేదు. ఆ శిష్యుడిని ఎక్కడికో ఆయన పంపించాడు.

''రాగలతా! నీ కొచ్చిన యిబ్బందేదో చెప్తే నేను లక్షమంది శిష్యులను రప్పిస్తాను.''

''మరేం కాదు. మొన్న మీ శిష్యుడు శాకుంతలంలోని శ్లోకాలు, పద్యాలు చదివారు. మాకు కణ్వుడి పాత్రకి సరియైన మనిషి దొరకలేదు. అతను వేస్తారేమోనని అడగడానికి వచ్చాను.''

''రాగలతా! ఇది నాకిష్టంలేని పని. మరెవరినేనా చూసుకోవలసింది.''

అతనంత నిష్కర్షగా చెప్పడంతో కొండంత ఉత్సాహం కుప్ప కూలి పోయింది.

''ఇంతకీ కణ్వుడిది ప్రధాన పాత్రకాదు. ఇంకెవరినో పిలుచుకురావడం కన్న మీ శిష్యుడిని ఉపయోగిస్తే మీ గౌరవం యింకా పెరుగుతుందని నా అభిప్రాయం.''

''రాగలతా! నేను నాశిష్యుడు వేసే నాటకంలో నటించను. వాళ్ళు చేసే పొరపాట్లను నేను సహించలేను. దయచేసి మరెవరినేనా చూసుకో!''

నా ముఖం చిన్నబోయింది. చూపులు నేలకు దించిఅన్నాను.

''మంచిది! నాకు సెలవియ్యండి!''

ఆ మాటలు గొంతుకలోంచి రావడం కష్టమయింది. గది ద్వారం వేపు అడుగులు వేశాను. గది దాటకముందే నాగభూషణం నన్ను పిలిచాడు.

''రాగలతా!''

వెనక్కు వెళ్లాను.

''నీ ముఖం చిన్న బోయింది. నీతో స్నేహం పెంచుకుందామని ప్రయత్నం చేస్తున్నాను. స్నేహితుల పట్ల ఈ విధంగా ప్రవర్తించడం భావ్యం కాదు. నేను మా శిష్యుడు వేషం వేయడానికి అంగీకరిస్తున్నాను. కాని, నా షరతుల మీద.''

నా ముఖం సంతోషంతో వెలిగింది.

''విను! మీరు కరపత్రాలు పంచుతారుకదా! వాటిలో నాకున్న బిరుదులన్నీ ఉల్లేఖన చేయాలి. నేను నటించిన నాటకాల ప్రస్తావన రావాలి. అంతేకాదు. నేను ఆరోజు ఉపన్యాసం కూడాయిస్తున్నట్లు వాటిలో రాయాలి.''

ఇది మొదటి షరతు. దానికి అంగీకరం తెలుపుతూ తల ఊపాను.

''ఇక రెండో షరతు. కణ్వపాత్రధారి పేరందులో ఉండకూడదు. కనీసం నాగభూషణం శిష్యుడని కూడా రాయకూడదు. కొత్తనటుడు అన్నమాటకన్న అధి కంగా పేర్కొనకూడదు.''

అప్పటివరకూ ఆ శిష్యనటుడి పేరునాకు తెలియలేదు. పేపరులో అచ్చువేసే మిషతోనైనా తెలుసుకుందామంటే నాగభూషణం ఆ అవకాశం కూడా నాకివ్వలేదు. ఇంకా మరో గొప్ప సంగతి. నాగభూషణం ఆ శిష్యుడితో నేను కలియకుండా అన్ని జాగ్రత్తలు పడుతున్నాడు. అదేనాకు అంతుపట్టలేదు.

వార్షికోత్సవం చాల ఘనంగా జరిగింది. చాల మంది పెద్దవాళ్ళను ఆహ్వానిం చాము. విశాలంగా నున్న బహిరంగ ప్రదేశంలో స్టేజి, ప్రేక్షకులు కూర్చోడానికి సదు పాయాలు చేశాము.

సభ సాయంకాలం ఆరు గంటలకు సరిగా మొదలయింది. అధ్యక్షుడి ఎన్నిక, ముఖ్యఅతిథి గారి ఉపన్యాసం. అదే మన నాగభూషణంగారి ఉపన్యాసం సరియైన వేళకే మొదలుపెట్టాం. నాగభూషణం ఒక గంట సేపు ఉపన్యసించాడు. నాటకాలు, ఆంధ్ర దేశంలో నాటకాల చరిత్ర, ఉత్తమ నటులు, తరుచు ఆడే తెలుగు నాటకాలు వీటి గురించి ఒక అరగంట వరకు చెప్పి, మిగిలిన అరగంటలో తన అనుభవాలు, తాను వేసిన పాత్రలు, తనకు నచ్చిన పద్యాలు చెప్పాడు. సభ చాల నిశ్శబ్దంగా ఉంది. అతనికి గల అపారమైన నాట్యశాస్త్ర జ్ఞానానికి ప్రజలు ముగ్ధులయారు. ఎంత గొప్పవాడు! అతని ఉపన్యాసం ముగిసిన పావుగంట వరకు చప్పట్లు కొడుతూనే ఉన్నారు.

నాటకం సరిగా ఎనిమిదికి మొదలయింది.

నాగభూషణంతో ఏ విధమైన ఇబ్బంది కలగలేదు. తన వేషం తనే వేసుకు న్నాడు. రంగులు పులుముకోడం దగ్గిర నుండి - అతని శిష్యుడికి మేకప్‌మాన్ వేషం వేశాడు. వాళ్ళిద్దరే మగాళ్ళు. మిగిలిన వేషాలన్నీ ఆడవాళ్ళమే వేశాము.

నాటకం అద్భుతంగా ఉందన్నారు.

నాటకం అయిన వెంటనే పాత్రల పరిచయం జరిగింది. ఒక్కొక్కరి గురించి చెప్తూ, చివరను కణ్వుడి గురించి చెప్పవలసి వచ్చినప్పుడు ఆ నాగభూషణం గారి శిష్యుడు మాయమయిపోయాడు. అతని గురువుని అడిగితే తొందరపని మీద ట్రెయినులో వెళ్ళిపోతున్నాడని చల్లగా చెప్పాడు.

నామనసేం బాగులేదు.

ఎందుచేతనంటారా?.....

నాగభూషణం చాల గొప్పగా నటించాడని ప్రేక్షకులు ప్రశంసించారు.

శకుంతల వేషంలో నేను దివ్యంగా నటించానని మా లేడీ స్టూడెంట్లు అందరూ పొంగిపోయారు.

కాని అందరూ ఏకగ్రీవంగా ఒక్కటే మాటన్నారు. నాలుగో అంకంలో కణ్వుడు చదివిన నాలుగు పద్యాలేచాలు. నాటకానికవి ప్రాణమన్నాడు.

కాని మహానుభావుడు ఆ కణ్వుడెందుకు మాయమయాడు?

*　　*　　*

రాజమహేంద్రవరంలో మా ఇల్లు గోదావరి స్టేషనుకు కొద్ది దూరంలో ఉంది. నా గది మేడమీద ఉంది. కిటికీలోంచి చూస్తుంటే దగ్గిరలో ఉన్న పాత బ్రిడ్జి, కొంచెం దూరంలో ఉన్న కొత్త బ్రిడ్జి కనిపిస్తాయి. పాతదాని మీద వెళ్ళే ప్రతి రైలు చప్పుడు, ప్రతి యింజను కూతా నా చెవుల్లోనే ఉంటాయి.

చదువయిపోయింది. ఫలితాలు తెలిసేవరకు మరేది పనిలేదు. సావకాశంగా ఉదయం ఎనిమిది గంటలకు లేచి, స్నానం అన్నీ ముగించుకొని, గదిలో మంచం మీద పుస్తకమేదో చదువుతూ కూర్చున్నాను.

పది రోజుల క్రితం ఆడిన నాటకం గురించి ఇంకా జ్ఞాపకాలు మిగిలే ఉన్నాయి. నాగభూషణం స్టేజి మీదకొచ్చి దడదడలాడించాడు. దుష్యంతుడి పాత్రకు అతడు తప్ప మరొకడు పనికిరాడనిపించాడు. అతని పక్కన నటించడానికి కొంచెం జంకాను. అతను చాలా సమర్థవంతంగా నన్ను దారిలోకి తీసుకొచ్చాడు. మిగిలిన పాత్రలన్నిటికీ ఆ విధంగానే సహకారం చేశాడు.

కాని అతని అదుపు తప్పినవాడు అతని శిష్యుడు. ఏ ఒక్క చిన్న విషయంలో కూడా అతడు గురువును అనుసరించలేదు. కొసవరకు తన ప్రత్యేకతను నిరూపించుకున్నాడు. ఎక్కడా అనవసరంగా రాగం తీయలేదు. అతిగా విరగబడలేదు. ఏమీ లేదనుకున్న పాత్రలో, మరచిపోలేని కొత్త పద్ధతులు చూపించాడు.

ఎవరు బాగా నటించారు?

నా ప్రశ్నకు జవాబు దొరకలేదు. క్రింద నుండి మా అమ్మ కేక పెట్టింది. ఆ వచ్చిన అతను నాగభూషణం. అతనిని నా గదిలోకి తీసుకొచ్చి, వాలు కుర్చీలో కూర్చుండబెట్టాను.

''మీరు విజయనగరం నుండి మళ్ళా ఎప్పుడొచ్చారు?'' నేనే అడిగాను.

''ఇంతకీ నేను విజయనగరం వెళ్తేకదా?'' అన్నాడతడు నవ్వుతూ.

''ఎక్కడుంటున్నారు? ఏం చేస్తున్నారు?''

''ఇక్కడో లాడ్జిలో ఉంటున్నాను. ఒంటరిగా కాలం గడుపుతున్నాను. ఏమీ తోచకపోతే నీ గురించే ఆలోచిస్తున్నాను.''

నాకు మతిపోయింది.

నాటకంతో అయిపోయిందనుకున్నాను. నా అనుభవాలు జ్ఞాపకంలోనే మిగులుతాయనుకున్నాను. ఈ నటరత్న నాగభూషణం నా వెంటబడతాడని అనుకోలేదు. అంత చొరవ తీసుకొని యింటికి వస్తాడని కలలో కూడా భావించలేదు.

''ఏదో మీరు సరదాకంటున్నారు. నేను మరచిపోరానంత ప్రత్యేకమయిన వ్యక్తిని కాను.'' అన్నాను నేను.

''రాగలతా, నాకు స్త్రీ అంటే తెలియందికాదు. చాలమంది ఉత్తమ నటీమణులతో నేను నటించడమే కాకుండా అరమర అభ్యంతరాలు లేకుండా వ్యవహరించాను. అన్నీ వ్యాపార పద్ధతిలో నడిచాయి. చివరకు నాది అన్న స్త్రీ ఎవరూ మిగల్లేదు.''

''అవునవును!''

''ఎవరి మీదా నా మనసు నిలవలేదు. నా హృదయం శూన్యంగా ఉండిపోయింది. అందులో నువ్వు ప్రవేశించిన దగ్గిర నుండి చెప్పరాని ఆనందం నిండిపోయింది.''

నాకేదో యిబ్బందిగా తోచింది. అతడు ముందు స్నేహమన్నాడు. ఇప్పుడు హృదయంలో నేనున్నానంటున్నాడు.

''నాగభూషణంగారూ! కొన్ని విషయాలు మీ దృష్టికి తేవాలనుకుంటున్నాను. మొదటిది మా అమ్మదగ్గరికి ఇంకా కాతాదార్లు వస్తూనే ఉన్నారు. ఇటువంటి పిల్లను మీవంటివారు పెళ్ళాడకూడదు.''

నాగభూషణం నవ్వాడు.

''ఈ అభ్యంతరం నేను పాటించడం లేదు. రెండవ విషయం చెప్పు.''

''నేను బియ్యే పరీక్షలకు ఈ మధ్యనే వెళ్ళిన సంగతి మీకు తెలుసు. నాకు ఇరవైయ్యేళ్ళు మాత్రమే, ఇంకా చదువుకోవాలని నిశ్చయంతో ఉన్నాను. నాకు పోస్టు గ్రాడ్యుయేట్ చదువులక్కరలేదు. బియ్యీడి చదివి టీచరుగా ఉద్యోగం చేస్తాను. జీవితంలో స్థిరపడిన తరువాత నా వివాహం గురించి ఆలోచిస్తాను.''

''నీ నిశ్చయానికి చాల సంతోషిస్తున్నాను. నువ్వు తప్పకుండా బియ్యీడి చదువవలసిందే. నువ్వు ఉద్యోగం కూడా చెయ్యవచ్చు. అంటే ఒక సంవత్సరం నీ కోసం వేచి యుండాలి. దానికి నా అభ్యంతరంలేదు.''

''అప్పుడేనా మిమ్మల్ని పెళ్ళి చేసుకోవాలనే అభిప్రాయం కలుగకపోవచ్చు. మీరు మాస్తే నాకంటే పదిహేను, పదిహేడేళ్ళు పెద్దవాళ్ళు. నాకన్న మంచివాళ్ళు మీకెవరూ దొరకలేదా?''

''రాగలతా! నీకు యిష్టంలేందే బలవంతం చెయ్యను. నేనేమంత వయసులో పెద్దవాడిని కాను. నా ఆరోగ్యం మంచిదే. నిన్ను చూసినంతవరకు నాకు పెళ్ళి మీద కోరిక లేదు. నిన్ను చూడగనే నేనెందుకిలా మారిపోయానో నాకు తెలియదు. దాని ని అనురాగంటారో, ప్రేమంటారో నేనెరుగను.''

ఈ నాగభూషణం నన్ను చాల సంకట పరిస్థితిలో ఇరికిస్తున్నాడు.

''మా అమ్మకు యిష్టమో లేదో తెలియదు. ఆవిడ కూడా నా పెళ్ళికి అభ్యం తరం తెలుపుతున్నది. నాటకాలలో నేను బాగా రాణించగలనని ఆవిడకు మొన్నటి నాటకం చూసిన దగ్గిర నుండి మంచి నమ్మకం కుదిరింది. జీవితంలో ఏ ఒక్క-డితోనో పడి ఉండటంలో సొగసు లేదని ఆవిడ చెప్తుంది. ఈ శరీరంలో వయసు, లావణ్యం తగ్గక ముందే నాలుగు డబ్బులు వెనకేసుకోమంటుంది. నాటకాల్లోను, ఎప్పుడేనా అవకాశం దొరికితే సినిమాల్లోను హీరోయిన్ల పాత్రలు వేస్తే చాలామంది పెద్దవాళ్ళ స్నేహం లభిస్తుందని ఆమె చెప్పింది. ఆమెకూడా నా వివాహానికి అంగీ కరించడంలేదు.''

అతడు చాలసేపు నా ముఖంలోకి చూశాడు.

''ఇవన్నీ మీ అమ్మగారి అభిప్రాయాలు. మరి నీ అభిప్రాయం కూడా చెప్పు.''

''నా మనసులో ఇంతవరకూ ఎటువంటి అభిప్రాయంలేదు. బియ్యీడీ ఆయే వరకు, ఉద్యోగంలో ప్రవేశించే వరకు ఏ అభిప్రాయానికి రాదలచుకోలేదు కాబట్టి మీరు నామీద ఆశపెంచుకోకండి.''

''ఇన్ని చెప్పావు నా గురించి నీ అభిప్రాయమేదో చెప్పవేం?''

నేను నవ్వి ఊరుకున్నాను.

నాగభూషణం లేచి నిలబడ్డాడు.

నా ముఖంలోకి అయిదు నిముషాలు చూసి కిందకు వెళ్ళిపోయాడు. మా అమ్మను కలిసి సెలవు తీసకున్నట్లున్నాడు.

నేను అన్నీ మరచి పోదామనుకున్నాను.

పరీక్షా ఫలితాలు తెలిశాయి. నాకు మొదటి తరగతి వచ్చింది. బి.యి.డిలో సులువుగా సీటు దొరికింది. రెండు నెలల చదువు అయింది.

ఉన్నట్లుండి ఒకసారి ఆదివారం ఉదయం తొమ్మిది గంటలకు నాగభూషణం ఊడి పడ్డాడు. నాతో అయిదు నిమిషాలే ఉన్నాడు.

చాలసేపు మా అమ్మతో మాట్లాడి వెళ్ళిపోయాడు.

మా అమ్మ మరో వారం రోజుల తర్వాత మాటల సందర్భంలో నాగభూషణం గురించి చాల హెచ్చుగా మాట్లాడింది. అటుపిమ్మట చాలసార్లు మాట్లాడింది.

ఒక సాయంకాలం నేను కాలేజీ నుండి వచ్చేసరికి మా అమ్మ నాకోసం ఎదురు చూస్తోంది.

''ఇవాళ మధ్యాహ్నం నాగభూషణంగారు వచ్చారు. అతను కొవ్వూరులో ఒక యిల్లు కొనుక్కున్నారట. ఈ సాయంకాలం పాలు పొంగించి గృహప్రవేశం చేయాలని, మనలనిద్దరిని తప్పకుండా రమ్మని పిలిచి వెళ్ళారు. టాక్సీ చేయించుకొని రమ్మన్నారు. వేగంగా స్నానం చేసి బట్టలు వేసుకొనిరా!''

ఏదో ఆలోచిస్తున్నాను. నా.భూషణంకి కొవ్వూరులో ఇల్లెందుకు? విజయనగరంలో ఇల్లేంచేశాడు? అతనికి ఆ ప్రాంతంలోనే భూములు కూడా ఉన్నాయని చెప్పాడు. అవేం చేశాడు? అన్నీ ప్రశ్నలే - అతడేవో తొందరపాటు పనులు చేస్తున్నాడా? ఎవరికోసం చేస్తున్నాడు?

నాగభూషణమంటే నాకేమీ కోపంలేదు.

అతడు చాల గొప్పవాడు. ఆంధ్రదేశంలో చాల పేరున్న కళాకారుడు. మంచి అనుభవమున్నవాడు. మంచి వక్త, అపారమయిన నాట్యశాస్త్రజ్ఞానమున్నవాడు. అతడు అంత కొండమీంచి దిగి నావంటి దానికోసం వస్తున్నాడంటే ఎగిరి గెంతేసి అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలి.

మనసునెంత సముదాయించుకొన్నా ఎక్కడో వీణ తీగలలో అపశృతి వినిపిస్తోంది.

నేను తయారయి మేడ దిగి వచ్చేసరికి వీథిలో టాక్సీ మాకోసం సిద్ధంగా ఉంది. నాగభూషణమే దానిని పంపించాడు.

కొవ్వూరు నాకు బాగా పరిచయమున్న ఊరే, మేము నాగభూషణం ఇల్లు చేరేసరికి బాగా చీకటిపడలేదు. లాంచి రేవుకి కొంచెం మీదకు పోతే రోడ్డు పక్కనే ఉన్న యిల్లతనిది. ఇంటి చుట్టూ ప్రహరీ గోడ ఉంది. ఇటు, అటు, వెనక్కు చాల ఖాళీస్థలం ఉంది.

నాగభూషణం ఇల్లిల్లా చూపించాడు.

క్రిందను వెళ్ళగానే పెద్ద హాలు, రెండు పడక గదులు, వంట గది, భోజనాల

గది, సామాన్ల గది ఉన్నాయి. మేడ మీద రెండు పెద్ద గదులున్నాయి. లోపలి నుంచే మేడ మెట్లున్నాయి. క్రిందను, మీదను గదుల గోడలకు తేలిక రంగుల్లో డిస్టెంపర్లు వేయించాడు. మేడమీద ఉన్న గదులు రెండూ చాల బాగా అలంకరించాడు. రెండింటిలో పెద్ద డబల్ కాట్లున్నాయి. వాటిమీద ఫోమ్ పరుపులు - మల్లెపూల వంటి దుప్పట్లు - తలగడాలకు అటువంటివే గలీబులు - గోడలకు అక్కడక్కడ పటాలు ఒక సరస్వతీ విగ్రహం చిన్నబల్లమీద ఉంది. అన్నిటికన్నా నేను మెచ్చినది, కిటికీలు తెరిచితే కనిపించే దృశ్యం - గలగలా గోదావరి కదిలి ఆడుతూ దర్శనమిస్తుంది. అప్పుడే ఆకాశం మీదికి లేస్తున్న చంద్రుడి కిరణాలు నదీజలాలలో ఒక వెండి బాట వేశాయి. ఎంత మనోహరంగా ఉంది.

తరువాత పురోహితుడు వచ్చాడు. మా అమ్మ చాల నిండైన మనిషి. దగ్గిరుండి పనులన్నీ చేయించింది. తానే పాలు పొంగించింది. పురోహితుడికి భూరి దక్షిణలిప్పించింది. ఆరాత్రికి మేము ముగ్గురం అక్కడే భోజనం చేశాము. హోటలు నుంచి కారియర్లు తెప్పించాడు నాగభూషణం.

ఆ విధంగా ఈ నాగభూషణం నా జీవితంలో స్థిరపడడానికి ప్రయత్నాలు మొదలుపెట్టాడు.

అతను వారానికోసారైనా మా యింటికొచ్చేవాడు. కొత్తలో నేను, మా అమ్మ అతని యింటికి వెళ్ళేవాళ్ళమి. నేనొక్కర్తెనే చాలసార్లు వెళ్ళాను. ఏదో మాట్లాడుతూ ఎదురుగా పారే నదిని చూస్తూ చాల హాయిగా కాలం గడిపేవాళ్ళం.

నాగభూషణం నాతో మర్యాదగా ప్రవర్తించేవాడు.

కార్తీకమాసం, పరీక్షలకు ఇప్పటినుంచీ శ్రద్ధపడితేనే కాని మంచి మార్కులు రావు. ఒక ఆదివారం ఉదయం ఏడు గంటలకే నాగభూషణం దిగబడ్డాడు. మా అమ్మ కూడా యింట్లోనే ఉంది. ఆమెతో ముందు మాట్లాడి తరువాత మేడ మీదికి వచ్చాడు.

''రాగలతా! వేగంగా తయారవు. తొమ్మిది గంటలకు మనం లాంచిలో భద్రాచలం బయలుదేరుతున్నాము. అమ్మగారు కూడా వస్తున్నారు.''

''భద్రాచలమా?''

''అవును. చాలమంది నర్తకులు ఒక లాంచి మాట్లాడారు. దానిలో మనకి మూడు బెర్తులుంచారు. భోజన సదుపాయాలు అన్నీ వాళ్ళే చూసుకుంటారు. ప్రయాణం చాల సరదాగా ఉంటుంది.''

''పరీక్షలకని ఈరోజే శ్రద్ధగా చదవడం ప్రారంభించాను. ఆదిలోనే హంస పాదా?''

''రాగలత పరీక్షల కోసం చదువుతోందా? నేను నమ్మను. నీకుండే తెలివితేటలతో చదవకుండానే రాంకులో రావచ్చు. రాముడిని చూసి వస్తే నీకింకా మంచి మార్కులొస్తాయి.''

అతనెప్పుడు తన మాటలు నెగ్గించుకుంటాడు. కష్టపెట్టకుండా పని సాగిస్తాడు. నాకు వెళ్ళక తప్పలేదు.

కాని, నా అనుభవం ఎప్పటికీ మరచిపోలేను.

మేము ముగ్గురం సరిగ్గా పావుతక్కువ తొమ్మిదికి రేవు చేరుకున్నాము. సరిగ్గా తొమ్మిది గంటలకు లాంచి రాజమహేంద్రవరం విడిచిపెట్టింది.

గోదావరి నీళ్ళు స్వచ్ఛంగా ఉండి చేతులకందుతున్నట్లున్నాయి. చేపలు నిర్భయంగా ఈదుతున్నాయి. గాలిలో చల్లదనం, నును వెచ్చని ఎండ కష్టసుఖాల మిశ్రమానికి మల్లే ఉన్నవి.

లాంచిలో వాళ్ళందరూ చాల సంపన్నులు. ఆడవాళ్ళు పట్టు చీరలు కట్టుకున్నారు. మగవాళ్ళు పట్టు పంచలు, పట్టు చొక్కాలు ధరించారు. పిల్లల సంగతి సరేసరి.

అందరూ ఒక గంట భజన చేశారు.

తరువాత ఫలహారాలు - తేలికగా అరిగే ఫలాలు - తొనలు వొల్చిన బత్తాయిలు, చక్కెరకేళి అరటిపండ్లు, బొప్పాసి పండు ముక్కలు, ఇంకా యింకా ఏన్నోరకాలు.

తరువాత ఒకరినొకరు పరిచయం చేసుకున్నారు.

చాలమందికి భాగవతారిణి చంద్రిక తెలుసు.

పదిన్నర నుండి ఒంటి గంటవరకు మా అమ్మ 'రుక్మిణీ కల్యాణం' హరికథ చెప్పింది. వాళ్ళందరూ చాల సంతోషించారు. ఆమెకు రెండునూర్లు కవరులో పెట్టి యిచ్చారు. ఆమె తీసుకోలేదు. భద్రాద్రి రాముడికవి సమర్పించమంది. దానితో మా అమ్మ మీద వాళ్ళకు గౌరవం మరింతగా పెరిగింది.

లాంచి నడుస్తూనే ఉంది. మధ్యాహ్నం భోజనాలు చాల చక్కగా ఏర్పాటు చేశారు. కొంచెంసేపు విశ్రమించాము. మధ్యాహ్నం నాలుగు గంటల నుండి తిరిగి భజన మొదలయింది. రాత్రి అల్పాహారమేదో తొమ్మిదికిచ్చారు.

అందరూ ఆరగిసున్నారు.

క్రమంగా చంద్రోదయమయింది.

నాగభూషణం చంద్రుడిని చూస్తూ ఒళ్ళు మరిచిపోయాడు కాబోలు 'కవి బిల్హణ' నాటకంలో పద్యాలు చదవడం మొదలుపెట్టాడు.

అతను రాగం ఎత్తుకున్నాడు. తింటున్నవాళ్ళు తింటున్నట్లే ఉండిపోయారు. భోజనం ముగించినవాళ్ళు అక్కడే కూర్చున్నారు. ఇంజను కూడా ఆపేశారేమో.

ఎంత రమ్యమయిన ప్రకృతి - ఏరు పారుతున్నా శబ్దం చిన్నమువ్వల రవళికి మల్లే వినిపిస్తోంది. అతను ఎత్తుకున్నరాగం అందరినీ సమ్మోహనాస్త్రం వేసి కట్టి పడే

సింది. తరువాత తాపీగా, ఉదాత్తంగా, రమ్యంగా, శ్రవణసుభగంగా అతడు పద్యం తరువాత పద్యం చదువుతున్నాడు. నీళ్ళలో చేపలు తలలెత్తి వింటున్నట్లనిపించింది. తాను కదిలితే చప్పుడవుతుందని గాలి వీచడం మానింది. ఒక్కో పద్యంతో ఒక్కో మెట్టెక్కుతూ చంద్రుడు మీదకొస్తున్నాడు.

జడప్రకృతి రాగ సుధలో చైతన్యం పొందింది.

దేనినేనా ఇంత అంత గొప్పది అని వర్ణిస్తాము. కాని నాగభూషణం చదివిన పద్యాలు ఈ వర్ణనకు అతీతాలు.

క్రమ క్రమంగా అతని వంక ఆకర్షింపబడుతున్నానా?

అందరూ మళ్ళా ఒక గంట తరువాత ఈ లోకంలోకి వచ్చారు. అతనిని వేయినోళ్ళ పొగడారు. అతను అంత గొప్పవాడని వారికి తెలియదు.

లాంచి ప్రయాణంలో అతను మరొక్కసారి పాడాడు.

ఆబాలగోపాలం చలించిపోయారు. మా అమ్మ మాట సరేసరి. నేను కూడా ఆలోచిస్తున్నాను. అతనంతటివాడు అతనే.

అక్కడి నుంచి మా ప్రయాణం రాజపూజితంగా జరిగింది.

భద్రాచలంలో లాంచి దిగడమేమిటి, కొంతమంది దేవస్థానం ఆఫీసరుగారికి నాగభూషణం గురించి, మా అమ్మ చంద్రిక గురించి చెప్పారు. ఆయన స్వయంగా వచ్చి, మమ్మల్ని కలిసి, దేవస్థానం సత్రవులలో ఉత్తమమయిన దానిలో గది ఇచ్చారు. భోజన భాజనాదులకు అన్ని యేర్పాటులు దేవస్థానం వారే చేశారు. ఒక రాత్రి మా అమ్మ 'రామదాసు చరిత్రం' హరికథ చెప్పింది. మరునాడు నాగభూషణం రామదాసుగా ఏకపాత్రాభినయం చేశాడు. వేలకువేలు ప్రజలు తన్మయత్వం చెందిపోయారు. భక్తి, కరుణ ఇవి అతనికి పుట్టుకతో వచ్చినట్లనిపించింది.

మూడో రోజు, భద్రాది రాముల దివ్య సమక్షంలో మా తల్లిగారికి 'హరికథా కోవిద' బిరుదం, నాగభూషణానికి 'నటసార్వభౌమ' బిరుదం ఇచ్చారు. శాలువలు కప్పారు.

ప్రజలలో ఎంత కలకలం?

ఎన్ని వేలమందో జయజయధ్వానాలు చేసి నాగభూషణాన్ని ఆకాశానికెత్తేశారు. బహుశా అది కోరుకున్నాడా? అతడేమి ఆసక్తి కనపరచలేదు. యాధృచ్ఛికంగా వచ్చిన కీర్తికి వినయంగా అంజలి పట్టినట్లు కనిపించాడు. ఒకవేళ అదికూడా నటన అయితే అది అద్భుతంగా ఉంది.

అతనితో పాటు అమ్మకు, నాకు మంచి గౌరవం లభించింది.

ఆ విధంగా భద్రాచలంలో మూడు రోజులు రాజభోగాలనుభవించాము. నాకన్న మా అమ్మ చాల ఆనందించింది. ఆమెకు నాగభూషణం మీద చెప్పరాని అభిమానం ముంచుకొచ్చింది.

నాగభూషణం ప్రవర్తన చాల ప్రశస్తంగా ఉంది. మా అమ్మకివ్వవలసిన గౌరవంలో అతను లోపం చేయలేదు. నాతో తిరిగినప్పుడు వెర్రి వెర్రి వేషాలు వెయ్యలేదు. అనవసరంగా వాగడంగాని, తన గొప్పలు చెప్పుడంగాని మచ్చుకు కూడా కనిపించలేదు.

భద్రాచలం నుండి తిరిగి వచ్చేటప్పుడు మేము బస్సు మీద వచ్చాము. ప్రయాణం చాల బాగా జరిగింది.

నాగభూషణం నా దృష్టిలో క్రమంగా పెరగడం ప్రారంభించాడు.

అతని శిష్యుడు ఊరు, పేరు లేనివాడు. అందరినీ జ్ఞాపకం పెట్టుకోవాలంటే సాధ్యమా?

కాని, ఆ శిష్యుడిని మరచిపోడానికి సాధ్యమవడంలేదు.

కాలం చాల వేగంగా పరుగెత్తుతుంది. ఋతువు తరువాత ఋతువు పంతాలు వేసుకుని ముందుకి సాగుతుంది. క్రమంగా నాగభూషణంతో పరిచయం వృద్ధి పొందింది. ఆయన చాల విషయాలు, అన్నీ నాటకాలకి సంబంధించినవే, మాట్లాడేవాడు. అతని ఇంట్లో పెద్ద నాటకాల లైబ్రరీ ఉంది. రెండు బీరువాలలో నాటకాలు, రూపకాలమీద శాస్త్రగ్రంథాలు ఉన్నాయి. కొన్ని యింగ్లీషు పుస్తకాలు కూడా అందులో చోటు చేసుకున్నాయి. సంస్కృత నాటకాల గురించి అతనిని అడిగితే చాల విపులంగా చెప్పుకుపోతాడు. ఆ పుస్తకాలకు బైండింగ్ చేయించి, పేర్లు కూడా రాయకుండా జాగ్రత్తగా ఉంచాడు. చాలమందికి అనుమానం కలగవచ్చు. అవన్నీ కేవలం అలంకారాలే అని. కాని, అతనితో ఒక్కసారి మాట్లాడితే ఆ సందేహాలన్నీ తీరిపోతాయి.

నేను బియ్యాడీ పరీక్ష పాసయాను.

నాకు కొవ్వూరు హైస్కూలులో ఉద్యోగం దొరికింది.

నాకన్న, మా అమ్మకన్న, నాగభూషణం చాల సంతోషించాడు. రాజమహేంద్రవరంలో కాపురం ఎత్తేసి మమ్మల్ని తన యింట్లో ఉండమన్నాడు. అది జరగకపోయినా, నేను మాత్రం క్లాసులు లేని వేళల్లో అతనితోనే ఉంటున్నాను.

చాలమందికి సందేహాలు కలగవచ్చు. నేను మంచి వయసులో ఉన్న ఆడపిల్లను. అతను చాల గొప్ప పేరున్న నటుడు. చాలమంది స్త్రీలతో సన్నిహితంగా నటించాడు.

మంచి రసికుడని సాటి నటకులలో అతనికి పేరుంది. అతనితో నేను ఉంటున్నానంటే, ముఖ్యంగా మా అమ్మ పుట్టుపూర్వోత్తరాలు తెలిసిన వాళ్ళు, తప్పకుండా మా యిద్దరిమధ్య సంబంధముండక పోదని అంటారు. బహుశా అంటున్నారేమో. మన ముఖం ముందు అనరు కదా.

ఇది లోక వంచనకాదు. ఒక పెద్ద మనిషిని ఆ విధంగా యిబ్బందిపెట్టటం నాకు నచ్చలేదు. నా అంత నేను ఆ ప్రస్తావన తీసుకురావడం బాగుండదు. ఈ విధం వారాల తరబడి పేరుకుని గడ్డ కట్టిన మంచును నాగభూషణమే ఒక రోజు బద్దలు కొట్టాడు.

''రాగలతా! చాల కాలమయి నీతో ఈ విషయం విపులంగా చర్చించాలని అనుకుంటున్నాను. నువ్వేవో కొన్ని షరతులు పెట్టావు. నేను వాటిని గౌరవించాను. ఇప్పుడు అడ్డంకులన్నీ తీరిపోయాయి. సావకాశంగా మనం మాట్లాడుకుంటే బాగుంటుంది.''

ఆ రోజు ఆదివారం. ఉదయం నుండి మేఘాలు కమ్ముకుంటున్నాయి. పెందలేచి, స్నానాదులు ముగించి, కొవ్వూరు చేరుకొనేసరికి తొమ్మిది దాటింది. ఉదయం ఫలహారం కాఫీలు నాగభూషణం తెప్పించి ఉంచాడు. వర్షానికి దొరక్కుండా కొవ్వూరు చేరినందుకు అదృష్టవంతురాలనని అనుకున్నాను.

నాగభూషణం గదిలో కూర్చుని కిటికీలు తెరచి చూస్తే గోదావరి మీద వాలుతున్న వానతెరలు కనిపించాయి. ఆ వైపు నుంచే గాలి కూడా జోరుగా వీస్తున్నది. తలుపులు తెరచి ఉంచాలని ఎంత ప్రయత్నం చేసినా వీలుకాలేదు.

తలుపులు వేసి యిద్దరం కూర్చున్నాము. ఫలహారాలు సేవించి, కాఫీలు తాగుతుంటే నాగభూషణం మంచు బద్దలు కొట్టాడు. తాను వేసే నాటకాలకు రిహార్సల్సు వేసేదో లేదో చెప్పలేను. కాని, ఈ మాటలనడానికి అతను చాల రోజులై రిహార్సల్సు వేస్తున్నాడనిపించింది.

ఇటువంటి ప్రసంగం వస్తుందని నాకు తెలుసు.

ఈమధ్య మేమిద్దరం ఇంకా దగ్గిరికి వచ్చాము. నేను కాదు - అతనే - బలవంతం పెట్టాడు. తనను గౌరవంగా పిలవవద్దన్నాడు. దగ్గిర స్నేహితులకు మల్లే చూడమన్నాడు. అందుచేత అతనిని మామూలుగా సంబోధిస్తున్నాను.

''నాగభూషణం! ఈ విషయం మనం చర్చించడం అంత ముఖ్యమా?''

గది చీకటిగా ఉంది. పైన వర్షం మొదలయింది. దూరంగా ఎక్కడో పిడుగు.

''అవును - ఈ విషయం నీతో చర్చించడం చాల ముఖ్యం. ఈ మధ్య,

అంటే కొవ్వూరు రాక ముందు జరిగిన సంఘటనల గురించి నీతో నేను ఇంతవరకు ప్రస్తావించలేదు.''

''మా అమ్మతో చెప్పావా?''

''చెప్పడం చెప్పాను. కాని వివరంగా చెప్పలేదు.''

''ఆవిడ ఏమన్నది?''

''విని ఊరుకున్నారు.''

''అయితే చెప్పు.''

''కొన్ని విషయాలు నీకు తెలుసు. లోకంలో నాకెవరూ లేరు. నాకొక్క మేనత్త ఉండేది. ఆమె చనిపోయినప్పుడు నాకు విజయనగరంలో ఒక పెద్ద యిల్లు, పదిహేను ఎకరాల పల్లపు భూమి విడిచిపెట్టింది. జీవితంలో స్థిరపడక ముందే దానిని పాడుచేయకుండా ఆమె చాల కట్టుదిట్టాలు చేసింది. నేను వాటిగురించి ఏ విధంగాను ఆలోచించలేదు. నా నాటకాలకు, నా ఖర్చులకు ఇబ్బంది లేకుండా వెళ్ళిపోయింది.''

''బాగుంది.''

''నిన్ను మొదటిసారి రాజమహేంద్రవరంలో చూసిన దగ్గిరనుంచి నాలో చాల మార్పు వచ్చింది. అంతవరకు గాలి బట్టిన వాడిని జీవితంలో స్థిరపడాలని నిశ్చయానికి వచ్చాను. రోజురోజుకి ఈ కోరిక పెరిగింది. నీ సౌందర్యం, నీ గుణగణాలు, నీది అన్నదంతా నాకు చాల పవిత్రంగా తోచింది. నీవంటి దానిని జీవితాన్ని పంచుకునే భాగస్తురాలిగా చేసుకోవాలని కృతనిశ్చయుడిని అయాను. నీకు కూడా ఈ విషయం తెలుసు. నీ చదువు పూర్తిచేసి, ఉద్యోగంలో చేరి ఆర్థికంగా స్వతంత్రురాలవైన తరువాతే వివాహం విషయం ఆలోచిస్తానన్నావు. ఇప్పుడు అన్ని సమస్యలు తీరినవి కాబట్టి మనం ఒక నిర్ణయానికి రావడం మంచిది.''

నేను ఆలోచిస్తున్నాను. ఇది చాల మంచి అవకాశం. జీవితంలో ఇటువంటిది లభించడం కష్టం.

''నాగభూషణం! అవును. నీ అభిప్రాయాలు, నావి ఒకరికొకరం తెలియజేసుకోడం మంచిది.''

''రాగలతా! నువ్వు నా జీవితాన్ని పూర్తిగా మార్చేశావు. రోజురోజుకి నీమీద అనురాగం పెరిగింది. విజయనగరంలో నేనుండలేకపోయాను. నీకు దగ్గిరలో ఉంటే - ఏదో సాకు చెప్పి నిన్ను కలియవచ్చు. నీ మాటలు వింటుంటే, నీ రూపం చూస్తుంటే నేను అన్నీ మరచిపోతాను.''

నేను నవ్వాను. నాకు ఏ విధమయిన మోహమో, కామమో అతనిమీద కలగ నందుకు విచారించాను.

''అవును నాగభూషణం!''

''విజయనగరంలో మరొక్కరోజు కూడా ఉండలేకపోయాను. నా యింటిని ఏభైవేల రూపాయలకమ్మాను. నా భూములు చాల మంచి ధరకు అమ్ముడుపో యాయి. కృష్ణా జిల్లావారే మోతుబర్లు, మరేం ఆలోచించకుండా ఎకరం ముప్పై అయిదు వేలు చొప్పున కొన్నారు. రాగలతా! నేనింత గొప్పవాడినని అనుకోలేదు. నీ మూలాన్న నా విలువ నాకు తెలిసింది.''

అయిదు లక్షలకు పైగా వచ్చింది. చాల బాగా అమ్మకమయాయి.

''నాకు అప్పులు లేవు. ఈ ఊరిలో ఇల్లు కొనాలని ముందునించే అనుకు న్నాను. ఈ ఇంటి యజమాని సుబ్బారాయుడుగారు లక్షరూపాయలకి దీనిని మరో ఆలోచన లేకుండా ఇచ్చివేశారు. దీనిని బాగుచేయించి, ఇంట్లో ఫర్నిచరు మొదలైనవి కొనడానికి, యిల్లు అన్నివిధాల వాసయోగ్యంగా చేయడానికి మరో నలభైవేల వరకు ఖర్చుపెట్టాను. చేతిలో మిగిలిన మూడు లక్షల యాభైవేలు బాంకులో వడ్డీకి పడేశాను. నెలకు రెండు వేల రూపాయలు వడ్డీ వస్తుంది. బహుశా భార్యాభర్తలకిది సుఖంగా జీవించడానికి చాలు.''

ఈ నాగభూషణం ఎంత ముందాలోచన కలవాడు? తాను లక్షాధికారినని చెప్పడం కూడా లేదు. నా కోసమని చాల గొప్ప త్యాగం చేశాడు. ఇతని చేతుల్లో జీవి తం సుఖంగా వెళ్ళిపోతుంది. ఏమాత్రం సందేహంలేదు.

''నాగభూషణం! నీ చేతిలో ఉన్న ముక్కలు చూపించావు. అన్నీ ఆసులు, రాజులు - గెలుపు నీదే. నేను కూడా నా ముక్కలు బలమైనవనుకుంటున్నాను. ఏదో ఒక చిన్న ముక్క చాలు, గెలిపించడానికి.''

అతనికామాటలు అర్థమైనట్లులేవు.

''రాగలతా! చెప్పవలసిందేదో సూటిగా చెప్పు.''

''మరేంలేదు. పెళ్ళంటే నూరేళ్ళ పంట. మా అమ్మని సలహా అడిగితే పెళ్ళే వద్దంటుంది.''

''బహుశా నా విషయంలో ఆమె అలా అనరేమో!''

''కాదు నాగభూషణం! నీతో మొదలయి, క్రమంగా జీవితంలో ముందుకు పోవడానికి ఎంతమందినో చేరాలంటుంది.''

''నాకావిషయం తెలియదు.''

''కాని, నేను మాత్రం ఇటువంటి మోసానికి అంగీకరించను. నిన్ను పెళ్ళి చేసుకోకపోతే పోయేదేమీ లేదు. చేసుకున్న తరువాత వంచించడంకన్న ఆత్మద్రోహం మరొకటి లేదు.''

అతను నావంక చూస్తున్నాడు. సరిగా బోధపడడం లేదు.

''నాగభూషణం విను. అందరు ఆడవాళ్ళకుమల్లే ఆస్తి, అంతస్తు ఉన్న భర్తను నేను కోరుకుంటున్నాను. ఆస్తి విషయంలో నాకు ఏ విధమైన సందేహం లేదు. ఇక అంతస్తు విషయంలో - ఏవిధమైన ఉద్యోగ గౌరవమున్నవాడివి కావు. అధికారం చలాయించవలసిన స్థితిలో లేవు. కాని, వీటన్నిటినీ మించిన విఖ్యాతమైన నట జీవితం కలవాడివి. అధికారులు చాలా మంది దొరుకుతారు. కాని నీవంటి ఉత్తమ కళాకారులు లభించడం దుర్లభమే.''

''మరి నీ అభ్యంతరమేమిటి.''

''విను, నాకు పదహారేళ్ళ ప్రాయమప్పుడే నాటకాల మీద మనసు మళ్ళింది. ఆనాటి నుంచీ ఓ గొప్ప నటుడిని పెళ్ళాడాలని నిశ్చయించుకున్నాను.''

''అది నా అదృష్టమే.''

''నాకో మేనత్త ఉంది. ఆమె నాటకాల్లో వేసేది.''

''ఎవరామె?''

''ఆమె ఎవరో చెప్పడం బాగుండదు. నీకు వాళ్ళందరూ తెలిసే ఉంటారు.''

''అవును. నాకందరూ తెలుసు. ఇంతకీ ఆమె ఏమి చెప్పింది?''

''నేను అప్పటికో రెండు, మూడు స్కూలు నాటకాల్లో నటించాను. ఆమె ఓ సలహా యిచ్చింది.''

''నువ్వు ఎవరి సలహాలు, అంటే మీ అమ్మగారి సలహా కూడా, పాటించని దానివి. ఆమె సలహా ఎలా జ్ఞాపకముంచుకున్నావు?''

''కొన్ని సలహాలు మంచివి వుంటాయి. అనుభవం మీద ఆమె చెప్పింది. ఈ రొంపిలోకి దిగి చాలామంది పురుషుల సే[illegible] చేయవద్దంది. పెళ్ళి చేసుకోమంది. ఆ వరుడు కూడా నా అభిమతానికి సరిపోయిన కళకు చెందినవాడయితే చాల అదృష్టవంతురాలనంది.''

''అయితే అన్ని విధాలా నేను తగినవాడిని.''

''పెళ్ళి చేసుకునేప్పుడు ఆ కళలో అత్యధిక స్థాయిని చేరినవాడినే చేసుకోమంది.''

''ఆ విధంగా నేను నీకు యోగ్యుడినే. నాకు పది బిరుదులున్నాయి. ఆఖరిది భద్రాచలం దేవస్థానంవారు అనుగ్రహించిన ''నట సార్వభౌమ'' నేను మొదటినుంచి కథా నాయకుడి వేషాలే వేశాను. ఆ విధంగా కూడా గొప్ప వాడినే. ఆంధ్రదేశం అన్ని

ఖ్యాంల్లో నిర్వివాదంగా ప్రముఖ రంగస్థల నటుడనని పేరు పొందాను. రాగలతా! ఇంతకన్న గొప్పవాడు నీకెవడు దొరుకుతాడు?''

''నీ దృష్టిలో నువ్వు అద్వితీయమైన సామర్థ్యం కలవాడివి. దీనిని నేను కూడా కాదనలేదు. కాని చిన్న పునర్విమర్శ. నువ్వు మరో విధంగా అనుకోనంటే చెప్తాను.''

''నేనేమీ అనుకోను. తప్పకుండా చెప్పు.''

''నీకు వచ్చిన మొదటి బిరుదు ''నటరత్న.'' దీనిని వెంకాయపాలెం ఎమెచూర్ నాట్య మండలివారు ప్రసాదించారు. రెండవది ''నటభూషణ'' దీనిని చిలకపాలెం కల్చరల్ సొసైటీవారు యిచ్చినది....''

''రాగలతా! రాజమహేంద్రవరంలోనూ, భద్రాచలంలోను వచ్చిన బిరుదుల గురించి ఏం చెప్తావు?''

''వాటిగురించి కూడా ఆక్షేపణలు నాకున్నాయి.''

''ఆక్షేపణలా?''

''అవును, రాజమహేంద్రవరంలో వాళ్ళందరూ నీ అభిమానులు. భద్రాచలం వారందరూ యాత్రికులు, వాళ్ళెవరూ పండితులు కారు. శాస్త్ర జ్ఞానం లేని వాళ్ళు. వారిచ్చిన బిరుదులు కూడా అటువంటివే.''

నాగభూషణంలో ఏదో సంచలనం గోచరిస్తోంది.

''మరి నీ దృష్టిలో ఏ బిరుదులు ఆమోదించదగినవి?''

''నాగభూషణం! ప్రభుత్వమిచ్చే ''పద్మభూషణ'' విశ్వవిద్యాలయాలిచ్చే ''కళాప్రపూర్ణ'' వంటి బిరుదులు నేను ఆశించడం లేదు. అవి నీకు బాగా వయసు మళ్ళిన తరువాత రావలసినవి. నేను కోరేది సమకాలీన రంగస్థల నటులలో నువ్వు మొదటివాడుగా రావాలని, ప్రతి సంవత్సరం విజయవాడలో నాటకాల పోటీలు జరుగుతాయి. అందులో వ్యవహరించిన జడ్జీలు మూడు విశ్వవిద్యాలయాల నుండి వచ్చిన ప్రొఫెసర్లు వాళ్ళు థియేటర్ ఆర్ట్స్ శాఖలకు అధిపతులు. వారు ఉత్తమ నటుడికి ''మహానట'' బిరుదం యిస్తారు. అదీ నేను కోరేది.''

ఉన్నట్టుండి దగ్గరలోనే చాలా పెద్ద పిడుగు పడింది. గుండెలు భయంతో కొట్టుకున్నాయి. లోపల ఉన్న దీపాలు ఒక్కసారి ఆరిపోయాయి.

చీకటి, మిట్ట మధ్యాహ్నం గదిలో కారు చీకటి.

చాల ప్రయత్నం చేశాను కిటికీ తలుపులు తీయాలని.

జోరుగా గాలి, కడవలతో వాన.

నాగభూషణాన్ని ఒక స్థితికి తేవడానికి వారం రోజులు పట్టింది.

ఆదివారం మధ్యాహ్నం రమారమి పన్నెండున్నరకు అతను కుప్ప కూలి పోయాడు. నేను చాల భయపడ్డాను. ఎందుకిటువంటి ప్రస్తావన చేశానని చాల విచారించాను. అతని గుణ గణాలు, ఉన్న వాటిని దృష్టిలో ఉంచుకొని, అతనిని వివాహ మాడతాననో, లేకపోతే ప్రస్తుతానికి విషయం వాయిదా వేయమనో చెప్పి ఉండవల సింది.

అంత పెద్ద షాక్ తింటాడని నేను కలలో కూడా ఊహించలేదు.

అతనికి నేను పదే పదే చెప్పుకొని వచ్చాను.

''నాగభూషణం! నీవంటి నటుడికి, ఆ బిరుదు పొందడం ఎడం చేతి పని. నీకున్న శాస్త్రజ్ఞానం, అనుభవం కీర్తి మరో నటుడిలో కనిపించవు. నిన్ను కించపర చాలని నేననలేదు. నువ్వు రంగ స్థల నటులలో చిరస్థాయి అయిన స్థానం పొందాలని నేను కోరాను. రేపు పొద్దున్న నీ భార్యనయినప్పుడు, ఆ బిరుదుంటే ఎంతో గర్విస్తాను.''

ఈ మాటలకు అతడు తలెత్తలేదు. ఉదాసీనుడుగానే కనిపించాడు. ఆ మని షిని లేవనెత్తడం నా బాధ్యత. లేనిపోని సమస్యనొకటి కల్పించి చాల హాయిగా నడుస్తు న్నఅతని జీవితంలో చిచ్చురేపాను.

''నాగభూషణం!! నువ్వు ధైర్యం తెచ్చుకో! నీకు మరో హామీ కూడా యిస్తున్నాను. ఆ పోటీలో నువ్వు గెలవొచ్చు, ఓడిపోవచ్చు. దానికి కూడా నేను విచా రించాను. పోటీ అయిన వెంటనే మన వివాహం జరుగుతుంది. ఇంత వరకు నేను వివాహం గురించి తీవ్రంగా ఆలోచించలేదు. అందుబాటులోనున్న వరులలో నువ్వొ క్కడివే నేను కోరినవాడివి''.

ఈ మాటలు విని అతను నా ముఖం వంక చాలసేపు చూశాడు.

''నీ మాటలు నిజమా? ఈ వాగ్దానం చివరి వరకు నిలుస్తుందా?'' అతను ప్రశ్నించాడు.

''నేనెప్పుడూ వాగ్దానం చేయను. చేసిన తరువాత అతిక్రమించను. అటువంటి సందేహం నీకక్కరలేదు.''

క్రమంగా క్రమంగా తేరుకున్నాడు.

ఒక వారం తరువాత అతనొక నిశ్చయానికి చేరుకున్నాడు.

''రాగలతా!! నువ్వు చెప్పినట్లే చేస్తాను. రాబోయే పోటీలకు నిలబడతాను. మన వివాహం అంత వరకు ఆగుతుంది. ఆ తరువాత విషయాలు ఆలోచించవచ్చు. కాని, నీ సహాయం చాల అవసరం. పోటీలు నిర్వహించే ఆ సంస్థతో ఉత్తర ప్రత్యు

తరాలు జరిపి, ఫారాలు తెప్పించి, నింపి, ప్రవేశరుసుం కట్టి - ఈ బాధలన్నీ పడాలి. అంత కన్నా ముఖ్యమైనది. నువ్వు సదానాతోనే ఉండాలి. నువ్వు ఇంట్లో తిరుగుతుంటే నేను ఎటువంటి పోటీలనైనా అవలీలగా గెలవగలను.''

అతను నా పట్ల చాల మర్యాదగా ప్రవర్తిస్తున్నాడు. పగటిపూట కొంత భాగం స్కూలులో గడిచిపోతుంది. సాయంకాలం చాలసేపటి వరకు అతనితో మాట్లాడుతూ, ఏదో ఒక రైలులో ఇల్లు చేరుకునే దానిని, అతనేదో చాల విషయాలు, అన్నీ నాటకాలకి సంబంధించినవే మాట్లాడేవాడు.

నేను పోటీలు నిర్వహించే సంస్థకు రాసి అప్లికేషనుఫారాలు నింపి ప్రవేశరుసుము కట్టాను. రెండు వందల రూపాయలు డ్రాఫ్ట్ చేసి పంపించాను.

అన్ని విధాల అతను ముందుకు సాగుతున్నా ఏదో పెద్ద లోటు ఉన్నట్లే బాధ పడుతున్నాడు. నేను నాలుగైదుసార్లు తరచి తరచి అడుగుతే నవ్వి ఊరుకున్నాడు. నేరం చేసినవాడు తనకుతానే శిక్ష విధించుకొని, ఆ శిక్షను చాల ఓర్పుతో అనుభవిస్తు న్నట్లు నాకు తోచింది.

ఇంతకీ అతను చేసిన నేరమేమిటి?

పోటీలు మూడు నెలలే ఉన్నాయి.

నేను ఇంటికి కూడా వెళ్ళడం లేదు. రెండవ పడక గదిలో పడుక్కుంటున్నాను. నాగభూషణంతో పడుక్కున్నా మా అమ్మ ఏమీ అభ్యంతరం తెలుపదు. మరొక్క మూడు నెలల తరువాత అతనితో కాపురం వేయడానికి, ఇప్పటి నుంచీ మొదలు పెట్టడానికి ఏ విధమైన భేదం లేదంది.

సంస్థ నుండి నాగభూషణం పోటీలకు నిలబడడానికి అర్హుడని జవాబు వచ్చింది. తారీకులు కూడా నిర్ణయమయాయి. పోటీలలో రెండు దశలున్నాయి. మొదటి దశలో పద్దెనిమిది మంది నటులలోను తొమ్మిది మందిని మాత్రమే ఎంచుతారు. రెండవ వడపోతలో ముగ్గురే మిగుల్తారు. ఆ ముగ్గురికి ఒక రాత్రి పోటీ జరుగుతుంది.

మొదటి పద్దెనిమిది మందిలోను నాగభూషణం రావడంలో వింతలేదు. అన్నిటిలోను కూడా ముందుకే రాగలడు. తప్పకుండా నెగ్గుతాడు.

పోటీలు విజయవాడలో జరుగుతాయి.

మొదటి వడపోతలు హనుమంతరాయ గ్రంథాలయంలో జరుగుతవి. చివరి రోజు పోటీ మాత్రం ఏదో ఒక పెద్ద థియేటరులో జరుగుతుంది.

ఒక నెల్లాళ్లు విజయవాడలో నాగభూషణంతో ఉండాలి. అతనికి ఆర్థికపర మైన సహాయం కాని, శాస్త్ర విషయాలలో సహాయం కాని అనవసరం. అతనికి కావలసింది నైతికమైన సహాయం. ఇన్స్పిరేషన్ కలుగుతుందంటాడు.

అతనిని ఈ రొంపిలోకి దింపినదానిని నేనే. అతను బయటపడే వరకు నేను అండగా నిలవక తప్పదు. అందుచేత స్కూలుకు రెండు నెలలు సెలవుపెట్టి నాగభూషణంతో విజయవాడ బయలుదేరాని.

* * *

విజయవాడలో మంచి హోటలులో బస చేశాము. రెండు సింగిల్ రూమ్స్, ఎ.సి.వి. తీసకున్నాడు నాగభూషణం. సంస్థవారు నటులు ఉండడంకోసం కాలేజీ హాస్టలులో ఏర్పాటులు చేశారు. బస, భోజనం - అన్నీ ఏర్పాటుచేశారు. నాగభూషణం మాత్రం తన హోదాకది తగదని, ఇద్దరం ఉండడానికి వీలుండదని హోటలులో నలభైరోజుల వరకు గదులు బుక్ చేశాడు.

మేము విజయవాడ చేరిన మరునాటి నుండే రంగస్థల నటులు ఒకరూ ఒకరూ చూడడానికి హోటలుకు రావడం మొదలుపెట్టారు. హోటలు ఖరీదయినదవడం చేత కనీసం వారికి కాఫీలు తెప్పించినా చాల డబ్బవుతుండేది.

అక్కడికే సంతోషించేవాళ్ళం. కొంతమంది మహానుభావులు మందు తెప్పించమనేవారు. నాగభూషణం అటువంటి విషయాలలో కొంచెం ధృఢంగానే ఉండేవాడు. తాగుడు మానేసి చాలకాలమైందని, అటువంటి ప్రస్తావనే చేయవద్దని మొహమాటం లేకుండా చెప్పేవాడు.

చాలమంది నన్ను చూసి ప్రశ్నలువేస్తే అతను నవ్వుతూ జవాబు చెప్పేవాడు.

''ఈమె పేరు రాగలత. కొవ్వూరు హైస్కూలులో టీచరుగా పనిచేస్తున్నారు. నాకు ప్రస్తుతం సెక్రటరీ. ఈ పోటీలు అయిన తరువాత మేమిద్దరం వివాహం చేసుకుంటాము.

అతని నిజాయితీకి నాకు చాల సంతోషం కలిగింది.

వచ్చిన అతని స్నేహితులందరూ తప్పకుండ నాగభూషణమే పోటీలలో గెలుస్తాడని అనేవాళ్ళు.

ఒకరిద్దరు మాత్రం కొంచెం నిరుత్సాహంగావ మాట్లాడారు. వీరభద్రరావని ఒకాయన గూడూరు నించి, ధర్మయ్య అన్న అతను అనంతపురం నుండి పోటీలలో పాల్గొంటున్నారని, ఒకొక్కరికి పదిహేను బిరుదులున్నాయని, బంగారు పతకాలకు లోటులేదని, వారు వేసిన చాల నాటకాలకు రాబోయే ముగ్గురు జడ్జీలలో ఇద్దరు జడ్జీలు ఇంతకుముందు వారికి చాల బహుమతులిచ్చారని చెప్పారు.

అందులో ధర్మయ్య అన్నతను చాల నిష్ఠగా వుండి నటిస్తాడని, అతనిని గెలవడం ఎవరికీ సాధ్యంకాదని మా ఎదుటే చెప్పారు.

నాగభూషణం నిరుత్సాహపడడం సహజమే.

ఇలా ఉంటుండగా పత్రికా విలేఖరులు ఒకరోజు వచ్చి హోటలుమీద వాడి చేశారు. నాగభూషణం ఈ పరిస్థితిని కలలో కూడా ఊహించలేదు. వాళ్ళందరిని స్పెషల్ కాన్ఫరెన్స్ రూములో ముందు కూర్చోబెట్టమన్నాను. ఎండలో వచ్చినవాళ్ళకి కూల్‌డ్రింకులు, ఆకలిగొన్నవారికి అల్పాహారాలు యిప్పించడం జరిగింది. తరువాత నాగభూషణం నన్ను చూపించి అన్నాడు.

''ఈమె రాగలత! నా సెక్రటరి - నా జీవితం గురించి వివరాలన్నీ ఈమె చెప్తారు. మీరడిగిన ప్రశ్నలకన్నిటికీ ఈమె జవాబులు చెప్తారు.''

నాగభూషణం గురించి వివరాలు వారడిగారు.

''నాగభూషణం విజయనగరం జిల్లాలో భోగాపురం గ్రామంలో జన్మించారు. వారి చిన్నతనంలో తల్లిదండ్రులు గతించారు. వారి మేనత్త నాగభూషణం బాధ్యత తనపై వేసుకున్నారు. చిన్నప్పటినుంచీ నాటకాలంటే చాల ఉత్సాహం చూపించారు. వారు పదోయేటే పాతిక రాగాలు, వందపద్యాలు చదివి శ్రోతలను తన్మయులను చేశారు. వారికి నాటకాలపై కల అభిలాషను గుర్తించి వారి మేనత్త ప్రముఖ రంగస్థల నటులు, సుబ్బిశెట్టి పాత్రధారులు, నాటకాలమామ ఉర్ఫ్ శ్రీనివాసరావుగారివద్ద రంగస్థల విద్య నేర్పించారు. వీరు తన జీవితాన్ని నాటకాలకే ధారపోశారు. సినిమాలకు పిలుపు వచ్చి నా వెళ్ళలేదు. ఎప్పుడూ కథానాయకుల పాత్రలే ధరించారు. వేనకు వేలు ఆంధ్రప్రజల హృదయాలను, తన ఉత్తమ నటనచేత చూరగొన్న మేటి నటులు నాగభూషణం.''

తరువాత వాళ్లు చాల ప్రశ్నలు వేశారు. నాగభూషణానికి ప్రేయసులెంతమంది? ప్రేమ లేఖలెన్ని వచ్చాయి? ఎన్ని చెప్పులు విసిరారు? తనకి బహుమతులుగా వచ్చిన మెడల్సులో ఎన్ని అతను చేయించుకున్నాడు? ఈ విధంగా అవకతవక ప్రశ్నలెన్నో అడిగారు. అన్నిటికీ చిరునవ్వు సమాధానంగా సమర్పించాను.

మొదటి రెండు వడపోతలు అయిపోయాయి. పద్దెనమండుగురిలో చివరకు అనంతపురం ధర్మయ్య, గూడూరు వీరభద్రరావు, నాగభూషణం నిలిచారు. తొలి సారి వడపోతకు చింతామణి నాటకం, రెండవసారికి సారంగధర ఆడారు. పోటీ నాటకం హరిశ్చంద్ర. మిగిలిన పాత్రధారులను సంస్థవారే ఏర్పాటు చేస్తారు. రంగస్థలం అలంకరణ కూడా వారిదే. మిగిలిన హంగులన్నీ వాళ్ళే సమకూరుస్తారు. పోటీ నటులు తమవేషాలు తాము వేసుకొని, రెండు గంటలసేపు స్టేజీమీద నటించాలి. ఏ పోటీలో నేనా మొదటివాళ్ళు, రెండోవాళ్ళు ఈ విధంగా ఉంటారు. కాని ఈ పోటీలో ఒక్కడిదే విజయం. రెండో స్థలంలో వచ్చినవారికి కనీసం ''ఉప-మహానట'' బిరుదం కూడా యివ్వరు.

నాలుగు సంవత్సరాల నుండి ఎవరికీ ''మహానట'' బిరుదం లభించలేదు. ఈసారి పోటీకి మిగిలిన ముగ్గురు నటులు ఇంతకుపూర్వం ఈ పోటీలో పాల్గొననివారే.

ఎవరి కరపత్రాలు వారు పంచిపెట్టుకుంటున్నారు.

నాగభూషణం చక్కని బ్రోచరొకటి తయారుచేయించాడు. ఆర్టుపేపరు మీద ముద్రణ జరిగింది. అందులో వేషంలో లేకుండా సహజంగా మధ్యపాపిడితో, పైమీద వోణీతో తీయించుకున్న ఫోటో వేయించాడు. నాగభూషణం చేశాడంటే సెక్రటరీయే చేసిందన్నమాట. బ్రోచరులో ఎక్కడా అతని బిరుదులుకాని, అధిక ప్రశంసలు కాని లేవు. ఎవరు గొప్ప నటులో నిర్ణయించవలసినది ప్రేక్షకలోకం.

ఎవరిబాధలు వాళ్ళు పడుతున్నారు. మూడు రోజులలో జరుగునున్న పోటీ నటులగురించి స్థానిక పత్రికలో ప్రత్యేకమయిన వ్యాసం ఒకటి పడింది. అందులో ధర్మయ్య ఫోటో, అతని మెడల్సు, బిరుదాల పట్టీ, ఎక్కడెక్కడ ఏయే నాటకాలు వేసింది చాల చాల విపులంగా ఉంది. ఇన్ని వివరాలు ఎందుకివ్వవలసి వచ్చిందంటే, ఈ సంవత్సరానికి ''మహానట'' బిరుదం అతనికి లభించినట్లే భావించవచ్చునని వుంది. రెండవవాడు వీరభద్రరావు, ఇతని ఫోటో కూడా వేశారు. ఇతను చాల చక్కగా పాడగలడని, నటనలో కల కించిత్తు లోపం ఆవిధంగా కప్పబడుతుందని, అందు చేత ఒకవేళ ఏదైనా కారణంచేత, అదృష్టం వరిస్తే ఇతనికి బిరుదు రావచ్చు. ఇతని గురించి కూడా రెండు కాలములు వ్రాశారు. మూడవ నటుడు నాగభూషణం గురించి నాలుగు వాక్యాలుకూడా వ్రాయలేదు. ఓడిపోవలసినవాడి గురించి వ్రాయడంలో ఔచిత్యం లేదన్నారు.

అవన్నీ నాగభూషణానికి చదివి వినిపించాను.

అతడు నవ్వి ఊరుకున్నాడు.

అతను మాట్లాడుతున్నాడు. భోజనం చేస్తున్నాడు. నాతో సాయంకాలం షికార్లకి పోతున్నాడు. అన్ని పనులు యాంత్రికంగా చేస్తున్నాడు. ఈ పోటీలో నెగ్గకపోతే ఏం చేయడమని అతని భయమా? అటువంటి భయానికి తావులేదు. నేను పోస్టుడేటెడ్ చెక్ ఒకటి ఇచ్చాను. అతను పోటీలో గెలిచినా లేకపోయినా మా వివాహానికి ఆటంకం లేదన్నాను.

మరెందుకు దిగులు?

బహుశా నా దృష్టిలో తాను తక్కువవుతానని అతని అభిప్రాయమా?

ఏవో, చాలా రకాలుగా అనుకోవచ్చు.

ఒకటి మాత్రం నిజం. ఎంత ప్రోత్సాహం నేనిస్తున్నా అతను హెచ్చరికగా లేడు. తన మనసులో బాధనాతో చెప్తే నేను మార్గాంతరాలను వెదకనా?

అతను పడుతున్న ఈ కష్టానికి నేను కారకురాలను.

నన్ను నేను నిందించుకున్నా ప్రయోజనంలేదు.

నాకు మాత్రం అచంచలమైన విశ్వాసం అతనిమీదుంది.

అతను తప్ప మరొకరు ''మహానటు'' బిరుదానికి అర్హులు కారు. వడపోతల్లో మిగిలిన యిరువురు నటించే విధానం చూసిన తరువాత, నాగభూషణం ఇంకా ఉత్తమ నటుడని నాకు వ్యక్తమయింది. ఈ విషయమే అతనితో అన్నాను. అతను నవ్వి ఊరు కుంటాడు. మనసు విప్పి చెప్పడు.

పోటీ ఇంకా రెండు రోజులే ఉంది.

నాగభూషణం గదిలో పచార్లు చేస్తాడు. పరధ్యానంగా ఉంటున్నాడు. అతనిని చూసుకునే బాధ్యతనాది.

ఆఖరున ఆడవలసిన పోటీ నాటకం హరిశ్చంద్ర.

మరేదేనా నాటకం అయితే అనుకోవచ్చు. హరిశ్చంద్ర నాటకం గురించి అవం తయినా సందేహం అక్కరలేదు. ఆంధ్రదేశంలో హరిశ్చంద్ర వేషానికి నాగభూషణాన్ని మించినవాడు లేడు.

మూడు రోజుల ముందు నుండి ప్రచారం చాల ముమ్మరమయింది. అద్దెకో మనిషిని పెట్టి బ్రోచర్లు పంచిపెట్టించాము. అంతకుమించి మరేం చేయలేకపోయాము.

రోజులు, క్రమంగా గంటలు - తరువాత పోటీ.

పోటీ అయిపోయే వరకు ఒక ఆపలేని ఆందోళన.

తరువాత.......?

* * *

ఆ విషయం తలచుకుంటే ఇప్పటికీ గుండె జలదరిస్తుంది.

లోకం అంతటికీ తెలిసిన విషయమిది.

పోటీనాడు రాత్రి ఎనిమిది నుండి పదిన్నర వరకు గూడూరు వీరభద్రరావు గారి నాటకం. ఆ నాటకం మొదలవడం ఓ అరగంట ఆలస్యమయింది. ముగ్గురు జడ్జీలు సరిగ్గా ఎనిమిదిన్నరకు రావడమేమిటి, నాటకం మొదలుపెట్టారు. ముగ్గురు పోటీ నటులకు మూడు పెద్ద గదులిచ్చారు. వాటికి అటాచ్‌డ్ బాత్‌లు ఉన్నాయి. పెద్ద నిలువుటద్దం, నాలుగు కుర్చీలు, ఒక టేబిలు, ఒక పెద్ద సోఫా ప్రతి గదిలో ఉన్నాయి.

నాగభూషణం వేయవలసిన నాటకం పదకొండుకు మొదలవుతుంది. వేషం వేసుకోడానికి మేము మా గ్రీన్ రూములోకి ఎనిమిదిన్నరకు చేరుకున్నాము.

నాగభూషణం తొమ్మిదిన్నరకు తయారయి, సోఫామీద విశ్రాంతి కోసం కూర్చున్నాడు. మొదటి హరిశ్చంద్రుడు తన ప్రావీణ్యమంతా ఆడియన్సుకి వొలక బోస్తున్నాడు. మధ్య మధ్యను చప్పట్లు మాత్రం మాకు గ్రీన్ రూములోకి కూడా వినిపిస్తున్నవి.

క్రమంగా అన్నీ ఆగిపోయాయి.

నాగభూషణం నటించవలసిన రెండవ నాటకం (అదీ హరిశ్చంద్ర నాటకమే) సరిగ్గా పదకొండుకి మొదలయి రాత్రి ఒంటి గంటన్నరకు ముగిసింది.

మూడవ నాటకం పూర్తి అయ్యేసరికి రాత్రి మూడున్నర అయింది.

న్యాయ నిర్ణేతలు, విడివిడిగా, సామూహికంగా చర్చించి ఉదయం నాలుగు గంటలకు పోటీ ఫలితాలు వెల్లడి చేశారు.

మంగళతూర్యాల మధ్య నాగభూషణానికి ''మహానట'' బిరుద ప్రదానానకి స్టేజి మీద ఏర్పాటులు పూర్తిచేశారు.

కాని ఆ బిరుదం అందుకోడానికి నాగభూషణం స్వయంగా స్టేజి వరకు రాలేక పోయాడు. జడ్జీలు తమ నిర్ణయాన్ని ఒక కొలిక్కి తీసుకొస్తుండే సమయంలో అతను గ్రీన్ రూములో హరిశ్చంద్రవేషంలోనే పడిపోయాడు. సంస్థ యజమానులు వెంటనే దగ్గరలో ఉన్న డాక్టరును తెప్పించారు. క్రింద పడిపోయిన మనిషిని సోఫా మీద పడుకోబెట్టడం కష్టమయింది. స్ట్రోక్ వచ్చిందని, వెంటనే ఇంటెన్సివ్ కేర్ యూనిట్‌లో చేర్పించమని ఆయన సలహా ఇచ్చారు.

ఈ విషయమే ప్రధాన న్యాయ నిర్ణేత, బిరుద ప్రధాన సభలో మాట్లాడుతూ, థియేటరులో కిక్కిరిసిన నాటకాల అభిమానులకు తెలియజేశారు. అతని జాగాలో నేనా బిరుదం అందుకొని, బహుమతి, పూలదండలను, ప్రశంసా పత్రాన్ని పట్టుకొని, అంబ్యులెన్సులో నాగభూషణంతోపాటు గవర్నమెంటు హాస్పిటల్‌కి పోయాను.

మరునాడు పత్రికలలో ముందు పేజీలో ఇదే వార్త. నాగభూషణం ఎవ్వరూ అనుకోని విధంగా నటించి, నాలుగు సంవత్సరాల నుండీ 'మహానట' బిరుదుకు అర్హులైనవారు తెలుగు దేశంలో లేరనే అపఖ్యాతి నుండి నాటకరంగాన్ని రక్షించారని వేనోళ్ళ పొగడారు. అన్ని పత్రికలవారు, ఏకగ్రీవంగా నాగభూషణం ఆరోగ్యవంతుడయి మళ్ళా స్టేజి మీద దర్శనమీయాలని కోరారు. ఆ వార్తలలో ఎక్కడా గూడూరు వీర భద్రరావుగారి గురించి కాని, అనంతపురం ధర్మయ్య గారి గురించి కాని కొంచెమయినా ప్రశంసలేదు. హాస్పిటల్‌లో వారం రోజులున్నాము.

నాగభూషణం బాధ్యత అంతా నామీదే వేసుకున్నాను. ఎవరికీ టెలిగ్రాములి చ్చి పిలిపించవలసిన బంధువులు అతనికి లేరు. మా అమ్మను విజయవాడ రప్పించ డంలో అర్థం లేదు. మొదటి మూడు రోజులు ఇంటెన్సివ్ కేర్ యూనిట్‌లో ఉం చిన తరువాత అతనిని స్పెషల్ కాబిన్‌లోకి మార్చాము. ప్రమాద పరిస్థితి దాటిపో యింది.

నాగభూషణానికి కుడి చేయి, కుడి కాలు రావడం లేదు. మూతి కొంచెం వంగినా మాటకు ఆటంకం కలిగించలేదు.

నాగభూషణం తనతో పదివేల రూపాయలు తెచ్చాడు. హోటలులో ఉండి ఖర్చుపెట్టినది, ప్రచారానికి ఖర్చు పెట్టినది పోగా ఇంకా చేతిలో అయిదు వేలున్నాయి. అతనికి తెలియకుండా నేనో రెండు వేలు తీసుకొచ్చాను. అందుచేత డబ్బుకి ఏ విధమైన ఇబ్బందిలేదు.

నాగభూషణాన్ని చూడడానికి వచ్చే స్నేహితులను, అభిమానులను హాస్పిట లువారు అడ్డలేక చాల అవస్థపడ్డారు. ఎవరి నోటంట విన్నా నాగభూషణం నటన గురించే. వాళ్ళ మాటలు వింటుంటే నాకేదో గర్వంగా ఉండేది. ~~ఈ నాగభూషణాన్ని~~ పోటీలకు ముందుకు తోసి, మహానటుడి నొకడిని ఆంధ్రదేశానికి సమర్పించానని చాల సంతోషించాను.

నాగభూషణం చాలా ప్రమాదమైన పరిస్థితులలో చిక్కుకున్నాడు. మూడు రోజులు అతనికి తెలివిలేదు. నాలుగో రోజు తెలివి వచ్చిన తరువాత అతని ఘనవి జయం గురించి చెప్పి, పత్రికలలో వార్తలు చదివి వినిపించినా అతను హర్షపులకిత గాత్రుడు కాలేదు. కొంతమంది ప్రేక్షకులు తమ అనుభూతులు తెలియజేశారు. ఆ ప్రశంసలు అతనికి వినిపిస్తే అతని ముఖం ఇంకా మ్లానమయి, ఉదాసీనమయి, నిస్తేజమయిపోయేది.

నాగభూషణం బాగుపడాలంటే నాటకం గురించి మాట్లాడకూడదు.

వారం రోజులు హాస్పిటలులో ఉన్న తరువాత పెద్ద డాక్టరుగారు పరీక్ష చేసి నాతో కొన్ని నిజాలు చెప్పారు.

''అమ్మాయీ! ఇతను చాల అదృష్టవంతుడు. చాల బలమయిన స్ట్రోక్ నుండి బయటపడ్డాడు. రెండు నెలల వరకు ఇతనిని మంచం మీద నుండి దిగనీయకూడదు. అప్పటికి ఇతనికి కాలు చేయి తిరిగి రావచ్చు. ఎటువంటి పరిస్థితులలోను ఇతను ఉద్రేకం పొందకూడదు. దయతో, ఆదరంతో అతనిని చూడాలి. అతనిని అన్నివి ధాల చాల శ్రద్ధతో, అభిమానంతో కాపాడుకొని రావాలి. దానికి ఎంతో త్యాగం అవ సరం. నువ్వొక్కర్తెవె ఇతనికి కావలసినదానివి. మీరిద్దరూ వివాహం చేసుకోవలసిన

సమయంలో ఈ విపరీతమయిన పరిస్థితి ఏర్పడింది. అతని వావుబతుకులు నీ చేతి లోనే ఉన్నాయి. కాబట్టి నువ్వు చేయవలసిన త్యాగం ఏ ప్రమాణంలో ఉండాలో నేను వివరించనక్కరలేదు.''

నాగభూషణానికి డాక్టరుగారు నాతో మాట్లాడినట్లు తెలీదు. మందులు రాసి యిచ్చారు.

మరునాడు ఉదయం టాక్సీలో బయలుదేరి పన్నెండు గంటల వేళకి కొవ్వూరు చేరుకున్నాము.

ఆ క్షణం నుంచి కొవ్వూరులో ఉన్న యింటికి అంకితమయిపోయాను.

నేను కొవ్వూరు చేరిన నాలుగు రోజుల తరువాత మా అమ్మ చూడడానికి వచ్చింది. నాగభూషణం పరిస్థితి చూసి పెదవి విరిచింది.

''లతా! తొందరగా ఎవరో నర్సుని చూసి ఇతడిని ఆమెకప్పగించు. నిన్ను రాజమండ్రి బదిలీ చేయిస్తున్నాను.''

''అమ్మా! నేను నిన్ననే నా ఉద్యోగానికి రాజీనామా యిచ్చాను. ఈ నాగభూషణం మంచి పేరుప్రఖ్యాతులతో ఉండేటప్పుడు పెళ్ళి చేసుకోడానికి ముందుకొచ్చాను. ఇప్పుడు అతనిని ఈ దీనపరిస్థితులలో విడిచి వెళ్ళిపోవడం కన్న తప్పేముంది? నాగభూషణం నాకోసం అన్నీ అమ్ముకొని ఈ ఊళ్ళో స్థిరపడ్డాడు. అతడు శేషజీవితం మరే యిబ్బందులు లేకుండా గడవడానికి నేను చేయవలసిన సహాయమంతా చేస్తాను. కొన్నాళ్ళవరకు నువ్వు నన్ను మరచిపోతే మంచిది.''

ఆవిడ మరేం జవాబు చెప్పకుండా వెళ్ళిపోయింది.

నలుగురైదుగురిచేత చెప్పించింది. చివరకు విసిగెత్తి ఊరుకుంది.

కొవ్వూరులో స్నానాలరేవుకు కొంచెం పైదుగా, రోడ్డు పక్కనే ఉన్న ఇంట్లో నేను స్థిరపడ్డాను.

రోగి పరిచర్యలలో కొన్ని నేను చేయలేనివి వున్నాయి. ప్రతిరోజు ఉదయం నాగభూషణానికి స్నానం చేయించడానికి, బట్టలు మార్చడానికి ఒక మనిషిని పెట్టాను. అతనే బజారుకుపోయి కాయగూరలు, పప్పులు తెచ్చిపెట్టేవాడు. పాలు వాడిక ఉండనే ఉంది. క్రింది భాగంలో వంటచేసి, మేడమీద గదిలో అతనితో పాటు భోజనం చేసే దానిని. తనని నేను విడిచిపెట్టి వెళ్ళిపోనని అతనికి విశ్వాసం కలిగించడానికి చాల శ్రమపడ్డాను.

శ్రమపడితే అతనికి నామీద విశ్వాసం కలుగుతుందా? సహజంగా కనిపిస్తుందా? అదికూడా ఒక నటనే అని ఆ మహానటుడు గ్రహించలేడా?

అతను ప్రశాంతంగా రోజులు గడపాలంటే నేను కూడా చాల శాంతంగా ఆ ఇంట్లో తిరగాలి. ఆ ఇల్లు, ఇంట్లోని సామానులు, పెరటిలోని మొక్కలు, మేడ మీద గదిలో మంచంమీద నుండి దిగలేని మనిషి, అందరూ నా వారని భావించాలి. మొదటిలో అంతా కొత్తగా కనిపించింది. నావి కానివి అన్నీ - వాటిని నావని అనుకో వడం ఎంత అవివేకమైన పని అని అనిపించేది.

దేనితోనో రాజీపడాలి.

నేను ఎదురునిలిచిన వాటితో అన్నిటితో రాజీపడ్డాను.

కాబట్టి రాగలత అన్న మనిషి తన నైజాన్ని చంపుకొని, నాగభూషణం శ్రేయస్సు కోసమే తనువు దాల్చినట్లు మధనపడింది.

అటువంటి వేళల్లో ఏం చేయాలి?

మంచంమీద నాగభూషణం మందుల మత్తులో నిద్రపోతుంటాడు.

కిటికీ తలుపులు తెరుస్తే గోదావరి నిర్మలంగా పారుతుంటుంది.

నదీమతల్లి లోకం సేవే తన ముఖ్య ధర్మమనుకుంటుంది.

దుఃఖంతో నిండిన మనసుకు, నదిమీద పోయే పడవల తెరచాపలు గాలిలో ఎగురుతూ ఓదారుస్తాయి.

రైలుబ్రిడ్జిమీద వేళకు పోయే బళ్ళు- ఆ బళ్ళలో ఉత్సాహం, ఆనందం, శోకం, ఆందోళన అన్నీ ఉన్న సజీవమైన వ్యక్తులు, చలనంలో ఉన్న ఆ ప్రయాణీకులు నిశ్చలంగా నేనొకతెను బందీగా ఉన్నాని తెలుసుకోగలరా!

కన్నులు దాటిన బాష్పబిందువును కొనగోటితో చిమ్మి హృదయానికి హిత వు చెప్తాను.

''దివ్యమైన సూర్యోదయం వరకు తనువు ధరించి ఉండాలి.''

* * *

''నాగభూషణం! నీదగ్గర ఉన్న పుస్తకాలు చూస్తుంటే నాకు మతిపోతోంది. ఎంతమంచి కలెక్షను!'' అన్నాను నేను.

మేము విజయవాడ నుంచి కొవ్వూరు వచ్చి రెండు నెలలు గడిచాయి. ఇప్పుడు నాగభూషణం లేచి కుర్చీమీద కూర్చుంటున్నాడు. స్నానం చేయించడానికి అంత యిబ్బంది లేదు. టేబిలు దగ్గిర కూర్చుని భోజనం చేయగలుగుతున్నాడు. ఈ రెండు నెలలలోను నేను చాల పనులు చేశాను. పెరడల్లా గడ్డి మొక్కలు మొలిచి కాలుపెట్టడానికి వీలులేకుండా తయారయింది. నాగభూషణం నిద్రపోయే సమయాల్లో కిందికి దిగి, పనివాళ్ళను పెట్టి ఆ విశాలమైన పెరటిని బాగుచేయించాను.

ఒకపక్క పూలమొక్కలు, ఒకపక్క పాదులు వేయించాను. అక్కడక్కడ నారింజ, నిమ్మ, సపోటా చెట్లు పాతించాను. వంటచేసేటప్పుడు, పెరట్లో కాయగూరలు కోసి చేటలో తెచ్చి అతనికి చూపించేదాన్ని.

ఆ విధంగానే దుప్పట్లమీద పూవులుకుట్టి, కర్టెన్లు వేలగట్టి ఇంటిని అలంకరించాను.

రెండు అలమరంలలోను ఉన్న పుస్తకాలకు పట్టిక ఒకటి తయారుచేశాను. మొత్తం పదిహేను వందల పుస్తకాలు ఉన్నాయి.

ఆ పుస్తకాలు సర్దులుంటే, అక్కడక్కడ పేజీలమీద మార్జినులో వ్రాసిన నోట్సు కనిపించాయి. ఆ వ్రాత చాల కుద్దిరంగా ఉండేది. సందేహాలు, వాటికి సమాధానాలు, తెలియని పదాలకు అర్థాలు ఈవిధంగా అన్ని పుస్తకాలలోను నోట్సు కనిపించాయి.

నాగభూషణం నవ్వేశాడు. న మాటలకు అతను జవాబివ్వలేదు.

''ఎన్ని నోట్సు రాశావు. నీకు శాస్త్రంమీద ఇంత శ్రద్ధ అని నేను అనుకోలేదు. ఎక్కడెక్కడినుంచో పుస్తకాలు తెప్పించావు. ఎంత శ్రమపడి ఉంటావో?''

దానికి కూడా అతను జవాబు చెప్పలేదు. ఏదో ఆలోచిస్తున్నాడు.

మరి ఆ విషయం ఎత్తలేదు.

నాగభూషణాన్ని మళ్ళీదారిలోకి తేవాలి.

''నాగభూషణం! మీ మేనత్తకు కూడా నాటకాలంటే అంత ఇష్టమా?''

''అవును, నేను పద్యాలు చదువుతుంటే పనిమానేసి వింటూ కూర్చునేది.''

ఈ ప్రసంగంలో అతనికి అరమరికలులేవు.

కొంచెంసేపు ఆవిడ మంచితనం గురించి, ఆమె వంటల రుచిగురించి చెప్పాడు.

''ఆవిడ చనిపోవడంతో నువ్వు చాల యిబ్బందులకు లోనయ్యావు. పాపం! రోజూ వండుకునేవాడివా?''

''నేనా! వంట వండడమా? అవి ఆడవాళ్ళు చెయ్యవలసిన పనులు. హోటలులో భోంచేసేవాడిని. లేకపోతే కారియరు తెప్పించుకునేవాడిని. ఒకొక్కప్పుడు హాయిగా పస్తు పడుకునేవాడిని.''

''పది సంవత్సరాలయి బాధపడుతున్నావన్నమాట!''

''లేదులేదు - ఒకటో, రెండో ఏళ్ళ తరువాత వాడొచ్చి అన్ని ఏర్పాట్లు చేశాడు. వేళకు భోజనం, నిద్ర, వ్యాయమం ఇవన్నీ వాడే అమలులోకి తెచ్చాడు. మంచిన టుడికి ఆరోగ్యం కూడా ముఖ్యమని వాడు చెప్పేవాడు''.

ఆ వాడెవడు?

మళ్ళామరోసారి అడిగాను.

''సాయంకాలంపూట ఆటలాడేవాడివా? కసరత్తు చేసేవాడివా;''

''అవేమీకావు, యోగాసనాలు వేసేవాడిని.''

''చాల వింతగా ఉందే. ఇంతకీ నీకు ఆ గురువెవడు? యోగాసనాలు సరిగా వెయ్యకపోతే ఆరోగ్యం మాట అటుంచు, అంగవైకల్యం కూడా సంభవిస్తుంది.''

''నాకు వేరే గురువెవడూలేడు. వాడే-వాడికే ఇటువంటి ఊహలు. తాను అన్నిరకాల ఆసనాలు వేస్తాడు. నాకు చాలవరకు నేర్పాడు. రోజూ ఒక అరగంట వరకు చేయించేవాడు.''

''ఇన్ని విధాలుగా నువ్వు నీ శరీరం గురించి శ్రద్ధ తీసుకున్నావు. మంచి ఆహారం, నియమంతప్పకుండా వ్యాయామం, ఆయుర్వృద్ధికరమైన సంగీతం - ఇవన్నీ నువ్వు పాటించినా ఎందుకీ ప్రమాదం సంభవించింది?''

నాగభూషణం దానికి జవాబియ్యడు. నా ముఖంలోకి చూస్తాడు. ఆ చూపులు నా గుండెల్లోకి పోతాయి. ఈ ప్రమాదానికి నేను కారణమని అవి ఘోషిస్తాయి.

నాగభూషణం క్రమంగా ఇంట్లో నడవగలుగుతున్నాడు.

ఏదోమాటల సందర్భంలో అన్నాను.

''నాగభూషణం! ఈ ఇల్లు నీకు లక్షరూపాయలకు ఎంత చవకగా అమ్మారు? అర ఎకరం జాగా, ముందుకో చక్కని మేడ, పెరటిలో నుయ్యి, చుట్టూ ప్రహరీ- ఇవన్నీ ఏ మూడు లక్షలో అవవలసినవి. నువ్వు చాల అదృష్టవంతుడివి.''

''అదృష్టానికేముంది! వాడితో అన్నాను రాగలతను పెళ్ళాడుతానని. పెళ్ళికి ముందు మార్పులు కావాలన్నాడు. ఆమె విజయనగరం వచ్చి ఉంటుందో లేదో! చాల స్వతంత్రమైన అభిప్రాయాలు ఆవిడవి. ఆమెతో పరిచయం పెంచుకోవాలి, సర్వం ఆమె కోసం త్యాగం చేయాలి. ఆమె ఎడల నిజాయితీగా ఉండాలి. పెళ్ళి చేసు కోమని ఆమెను తొందర పెట్టకూడదు. వాడి ఆలోచనలు ఎంత ముందు చూపుక లవో నేను చెప్పలేను. ఒక ప్రణాళిక - పెళ్ళి ప్రణాళిక - అను - ఏమను - అది తయారు చేశాడు. అందులో భద్రాచలయాత్ర కూడా వాడి ఆలోచనే - ఆ వర్తకులు మా వూరివాళ్ళే - వాడు కొవ్వూరులో తన స్నేహితుడికి రాసి ఇంటి గురించి కను క్కున్నాడు. తాను స్వయంగావచ్చి బేరం నడిపాడు. వాళ్ళకి నచ్చచెప్పి, తక్కువ ధరలో కొనిపించి, రిజిస్ట్రేషను చేయించాడు.''

నాకేమీ కాళ్ళందడంలేదు. ఎంత ఉదార చరితుడు ఆ 'వాడు'.

''భూముల విషయంలో కూడా అంతే. వాళ్ళు కృష్ణా జిల్లా వాళ్ళు. ఏదోమాట

వాసికి ఆ ప్రాంతాలలో పంట భూములు కావాలన్నారు. ఈ ప్రాంతాల వారైతే ఎకరం పాతికవేలకు కొనడమే కాకుండా, రిజిస్ట్రేషను ఖర్చులు భరించారు. ఉద్యోగం చేసినా చేయకపోయినా, నెలకో పదిహేను వందలు కనీసం చేతికందాలని మూడు లక్షలకు పైగా బాంక్‌లో వేశాడు.''

తరువాత అతనెందుకు ముందుకు రాలేదు?

నాగభూషణాన్ని నాకు అప్పజెప్పాడు. అతని మంచి చెడ్డలు నామీద వేశాడు. చాల గొప్ప నటుడిని తాను తయారు చేసి, అతనిని భద్రంగా చూసుకో వలసిన బాధ్యత నామీద ఉంచాడు.

అంత మంచివాడికి కనీసం ప్రియ మిత్రుడి ఆరోగ్యం గురించి తెలియజేయ వలసిన అవసరం ఎంతేనా ఉంది. ఈ మహానటుడు తానుగా ఉత్తరం కూడా వ్రాయలేదు. అంతగొప్పవాడు కాలేజీలో ఆ రోజు ఉపన్యాసం ఎలా యిచ్చాడు? అది కూడా 'వాడి' చలవే.

నామీద నాగభూషణం భారంవేసి అతడు మరుగైపోతున్నాడు.

అతను చేయిదాటి పోకూడదు.

అతనిని ఇటువేపు తిప్పుకోవాలి. ఏదో రోజు నాగభూషణాన్ని పెళ్ళాడినా మిత్రుడిని పోగొట్టుకోకూడదు.

కాని, నాగభూషణం ఏ విషయం అతని గురించి ప్రస్తావించినా ముభావంగా ఉంటున్నాడు.

నాకు అతనికి రోజులు గడుస్తున్నకొద్దీ, దూరం హెచ్చుతున్నది.

ఏ రోజేనా పోస్టుమాను శుభలేఖ ముఖం మీద కొడితే ఏం ఏడ్చినా ప్రయోజనమేమిటి?

ఒక రోజు నాగభూషణంతో వాదించి, కనీసం ఆ మిత్రుడికి ఉత్తరం వ్రాయడం తన ధర్మమని నొక్కి చెప్పాను. వ్రాసిన ఉత్తరాలు తనకు వినిపించి మరీ పోస్టు చేస్తానన్నాను. అతను నోటితో అంగీకరించినట్లు చెప్పకపోయినా మేము కొవ్వూరు చేరిన మూడు నెలల తరువాత మొదటి ఉత్తరం తయారు చేశాను.

రాజశేఖరం,

ఈ విధంగా నిన్ను పరిచయమున్న వాడిలా సంబోధించి ఉత్తరం రాస్తున్నాను. నీకు, నాకు, నాగభూషణానికి మధ్య ఏ మర్యాదలు అక్కరలేదు. బహుశా నాగురించి నాగభూషణం అంతగా చెప్పకపోయినా, నీ గురించి మాత్రం నాకంతా తెలుస్తున్నది. ఏ విషయం ఎలా ఉన్నా మనిద్దరం నాగభూషణం ఆరోగ్యం బాగుపడాలని కోరుతు

న్నవాళ్ళం. ఇంత పెద్ద ఇంట్లోను, నేను నాగభూషణమే ఉంటున్నాము. నాగభూషణం ఇంటిలో నడుస్తున్నాడు. అతని ఆరోగ్యం గురించి వారానికో ఉత్తరం వ్రాయడానికి అతను అంగీకరించాడు. నువ్వు కొత్తగా దగ్గిరకొచ్చిన స్నేహితుడివి కావు. ఈ స్నేహం చాల వింతయినది. మన ప్రవృత్తికి అనుకూలమయిన వాళ్ళతో చేసిన స్నేహం రోజు రోజుకి అభివృద్ధి పొందుతుంది. మంచి స్నేహితుడు లభించడం పూర్వపుణ్య సుకృతమే. ఒకొక్కరికి ఒకొక్క విద్యలో నైపుణ్యముంటుంది. నాగభూషణం చక్కగా మాట్లాడతాడు. నాకది చేతకాదు. నా మనసునిండా ఆలోచనలే. అదుపు తప్పిన ఆలోచనలు. నాగభూషణంతో మాట్లాడుతున్నప్పుడు, పెరటి తోటలో పని చేస్తున్నప్పుడు ఏ విధమైన ఆలోచన ఉండదు. అతడు భోజనం చేసిన కొంత సేపటికి నిద్రపోతాడు. నేను కిటికీ దగ్గిర కూర్చొని గోదావరిని చూస్తుంటాను. ఆ నదికి ఇటువైపు అటువైపు ఉన్న జనుల జీవితం గురించి ఆలోచిస్తాను. ఉదయం లేచిన దగ్గిరనుండి, రాత్రి నిద్రపోయేవరకు వాళ్ళకు నదితో సంబంధముంటుంది. వారి నిత్య జీవితాలలో ఈ గోదావరి ఒక భాగం. నది ఒడ్డున పడవలు బాగు చేస్తుంటారు. సరకులు పడవలకెత్తుతారు. వాటి నుండి దింపుతారు. నది గట్టునుండే ఆలయాల్లో నిత్యం పూజలు, అభిషేకాలు జరుగుతునే ఉంటవి. ఋతువు ఋతువుకి ఆ నదీ గమనంలో మార్పు, ప్రజల జీవితాలలో మార్పు - వర్షర్తువులో గంభీర గమనంలో ఈ నది పరవళ్ళు తొక్కుతుంది. ప్రజల మనసులు భీతితో కొట్టుకుంటాయి. ఈ అమ్మ కోపం తగ్గి, శరత్తులో, కొప్పులో ముడుచుకున్న రెల్లు పూలు గాలికి ఊగుతుంటే, మందంగా మందంగా ముందుకు సాగుతుంది. అవ్వలిగట్టున చీకటి రాత్రిలో వేచియున్న ప్రేమికుడు ఇవ్వలి గట్టుమీద, ఒక ఇంటి నుండి కనుపించే దీపపు వెలుతురికి తపిస్తాడు. ఆ దీపం వెలుతురిలో అతని ప్రాణమయిన మరొకరు ఎదురు చూస్తుంటారు. వాళ్ళ హృదయాలలో చిగురించిన కోరికలు ఆ కాంతితో కొత్త జీవం పోసుకుంటాయి. ఎంత రమ్యంగా ఉంటాయి ఈ ఊహలు.

నాగభూషణం ఒకందుకే ఒప్పుకున్నాడు. తన ఆరోగ్యం గురించి నీకు ఉత్తరం రాయడం వరకే అంగీకరించాడు. నీ నుండి జవాబు మాత్రం అతను కోరలేదు. ఈ ఉత్తరాలకు కాగితాల మీద జవాబులెందుకు? భావాలు రెక్కలు కట్టుకొని ప్రయాణం చేస్తాయికదా.

రాగలత-

ఆవిధంగా మా యిద్దరిమధ్య ఉత్తరాలు మొదలయాయి. ప్రత్యుత్తరాలకు తావులేకుండా పోయింది.

విధిగా వారానికో ఉత్తరం వ్రాసేదాన్ని. ఆదివారం వ్రాయడం పూర్తిచేసి సోమ వారం ఉదయమే పోస్టులో వేసేదాన్ని.

నాగభూషణం ఆ ఉత్తరాలను వినేవాడు. మౌనంగా గదిలో పచారులు చేసే వాడు. సోమవారం అంతా అతను మతిపోయినట్లే ఉండేవాడు.

నా ఉత్తరాలలో అన్ని విషయాలు చోటుచేసుకునేవి. ఏవి చెప్పాలని తహతహ లాడానో వాటినన్నిటిని వాటిలో వ్రాశాను. మారే ఋతువులు, మారని నా బ్రతుకు, నేను కనే రంగుల కలలు, నేను కోరిన ఆదర్శాలు, నా అభిరుచులు, నాకు లలిత కళలలో గల ప్రావీణ్యం, నేనెవరినో, నేనెవరినికానో అన్నీ ఆ ఉత్తరాలలో ఉండేవి.

నాలో స్వార్థం పేరుకుంది.

అతను దూరం కాకుండా, ఏ పని చేయలేకుండా దిగ్బంధంచేసే మాయా జాలం పన్నాను.

లోకంలో బతకడానికి పరిశ్రమించే ప్రాణికోటిలో నేనూ చేరిపోయాను.

* * *

లోకానికి తెలియని విషయం ఒకటుంది.

దాని గురించి తలచుకుంటే నా ఒళ్ళు పులకరిస్తుంది.

ఆ విషయం రెండున్నర సంవత్సరాలనుంచి నన్ను కాపాడుకువస్తోంది.

ఆ మరునాడే పోటీ నాటకం హరిశ్చంద్ర ప్రదర్శిస్తారు. గూడూరు వీరభద్ర రావు... అనంతపురం ధర్మయ్య విపరీతంగా ప్రచారం చేస్తున్నారు. మా తరపున కొట్టించిన బ్రోచర్లు గదిలో ఒకమూల పడిఉన్నాయి. ఎవడినో పంచమంటే, వాడు కొన్ని కాగితాలు పంచి, మిగిలినవాటిని మామీద పడేసి శత్రుపక్షాల ప్రచారంలో చేరి పోయాడు. నాగభూషణం చాల గాభరా పడుతున్నాడు. ఏమ చేయడం?

హఠాత్తుగా నాకు జ్ఞాపకం వచ్చింది.

''నాగభూషణం! నీ శిష్యుడో ఎవరో అతడు, కణ్వుడు వేషం వేసినవాడు, అతడు మీ ఊర్లో ఎక్కడున్నాడో నాకు తెలీదు. అతనికి నువ్వంటే చాల అభిమానం. నీకోసం ఎటువంటి చిన్నపని అయినా భక్తి శ్రద్ధలతో చేస్తాడు. ఏవో మనస్పర్థలు తలెత్తవచ్చు. మనం కార్యవాదులం కావాలి. నువ్వు అంగీకరించి, అతని అడ్రసుచెప్తే వెంటనే టెలిగ్రాం ఇస్తాను. రేపు ఉదయానికి ఇక్కడికి చేరుకుంటాడు. నేను చూస్తే ఆడదానిని. నీ స్నేహితులందరూ శత్రుపక్షంలో చేరిపోయారు. శత్రువులు మందు దోసెళ్ళతో వాళ్ళకి తాగ బెడుతున్నారు. రేపొక్కరోజు మాత్రం నీ మనిషిని తెప్పించు.''

నాగభూషణం అరగంటసేపు ఆలోచించాడు. అతడు వెళ్ళేసరికి సాయంకాలం ఆరుగంటలయింది. ఎక్స్‌ప్రెస్ టెలిగ్రాము వెంటనే ఇచ్చి వచ్చాను.

చాలకాలమయి ఆ మనిషిని చూడాలని కోరికవుంది. ఈ విధంగానేనా అతనితో గడపవచ్చునని అనుకున్నాను.

ఆ రాజశేఖరం ఉదయం తొమ్మిదిన్నరకు మా హోటలు చేరుకున్నాడు.

అతనిని చూడగనే నాగభూషణం పడిన భయానికి అర్థం కనిపించింది. అతడు రాత్రంతా నిలబడి ప్రయాణం చేశాడు. బెర్తు దొరకలేదుపో, కనీసం కూర్చోడానికి కూడా అతనికి చోటుదొరకలేదు. అతని ముఖం స్వచ్ఛంగావుంది. అతని కళ్ళు విశాలంగా కనిపించాయి. అతని పెదవులమీద చిరునవ్వు, అతని ఫాలంమీద అదుపు తప్పిన ముంగురులు.

అతనిని చూడగనే ఏదో ఆపరాని ఆకర్షణ.

''నాగభూషణం! కార్యక్రమం చెప్పు.''

నాగభూషణంలో చాల మార్పొచ్చింది. నా ముఖంలోకి చూడడం కూడా మానేశాడు.

''రాజా! వాళ్ళిద్దరూ విపరీతమైన ప్రచారం చేస్తున్నారు. ఆటకట్టించాలి.''

''నాటకం నీది ఎన్ని గంటలకు?''

''రాత్రి పదకొండుకు.''

''ఎంతవరకు ప్రచారం చేయవచ్చు?

''రాత్రి ఎనిమిది గంటలకు మొదటి నాటకం మొదలు పెడతారు. అంతకు ముందు ఒక గంట వరకు ప్రచారం చెయ్యవచ్చు.''

''నువ్వెన్ని గంటలకు థియేటరు కెళ్తావు.''

''సరిగ్గా ఏడు గంటలకు.''

''అయితే నిన్ను థియేటరు దగ్గిరే కలుస్తాను. కొంచెం దూరంవరకు పోవాలి. తిరిగి రావడంలో ఆలస్యమవుతుంది.''

''మరేం విచారంలేదు. నాటకాలు అయినవరకూ నువ్వు వుండక్కరలేదు. ఏదైనా రైలు దొరికితే వెళ్ళిపోవచ్చు.''

రాజశేఖరం నవ్వాడు.

''నాకు కూడా సెలవు దొరకలేదు. వెంటనే వెళ్ళిపోతాను.''

''తొందరగా స్నానం చేసి టిఫిన్ తినివెళ్ళిపో! ఆలస్యం చెయ్యకు.''

అతను తొందరగా అన్నీ ముగించుకొని వెళ్ళిపోయాడు.

అప్పటికి పదిగంటలయింది.

నాగభూషణం విరాగిగా తిరుగుతున్నాడు.

ప్రచారం చేయడానికి మేమతనికి ఒక దారి నిర్దేశించాము. వెళ్ళేటప్పుడు ఏయే వీథులలోంచి పోవాలో, ఎక్కడ నిలబడి ప్రచారం చేయాలో చెప్పాము. మిగిలిన బాధలన్నీ అతనే పడాలి. ఒకపైసా కూడా నాగభూషణం జేబులోంచి తీసి ఇవ్వలేదు.

మధ్యాహ్నం ఒంటిగంటకు భోజనాలు గదిలోకి తెప్పించుకున్నాము. తరువాత ఒక గంట విశ్రాంతి. మూడు గంటలకు నాగభూషణం ఎవరినో కలియడానికి వెళ్తానన్నాడు. నేను కూడా ఒకసారి రాజశేఖరం ఎటువంటి ప్రచారం చేస్తున్నాడో చూసి వస్తానని బయలుదేరాను. నాగభూషణంతో సాయంకాలం అయిదుకి హోటలుకి తిరిగివస్తానని, తరువాత ఇద్దరం కలిసి ఏడు గంటలకు థియేటరు చేరుకుందామని చెప్పాను. దానికతడు అవుననలేదు, కాదనలేదు.

ఉదయం కాళేశ్వరరావు మార్కెట్టు, కనకదుర్గగుడి దిగువ ప్రాంతాలలో ప్రచారం ముగించుకొని, ఈ వేళకు రాజశేఖరం మొగల్రాజపురం చేరుకుంటాడు. అక్కడ సాయంకాలం అయిదు వరకు ఉంటాడు. తరువాత లబ్బీపేట మీదుగా రాత్రి ఏడు వరకూ ప్రచారం చేసి ఎనిమిది గంటలకు తిన్నగా థియేటరు చేరుకుంటాడు.

రిక్షా చేయించుకొని మొగల్రాజపురం బయల్దేరాను. అక్కడికి చేరేసరికి, మూడున్నర అయింది. అక్కడ కొంచెం విశాలంగా ఉన్న చోట ఒక రిక్షా ఆగి ఉంది. ఆ రిక్షాలో ఒక ఇరవైమూడేళ్ళ మనిషి కూర్చున్నాడు. గొంతు సవరించుకొని అతను ఉపన్యాసం మొదలుపెడుతున్నాడు.

''ఓ మహాజనులారా! మీరెంత అదృష్టవంతులు. ఈ రాత్రి ముగ్గురు గొప్ప నటులు రంగస్థలం మీద తమ కౌశల ప్రదర్శన చేస్తున్నారు. ఆంధ్రదేశంలో వాళ్ళు అగ్రగణ్యులు. హరిశ్చంద్ర పాత్ర ధరిస్తారు. వాళ్ళలో ఎవరు గొప్పగా నటిస్తారో వారికి 'మహానట' బిరుదం ప్రదానం చేస్తారు. నటుడు చిన్నప్పటి నుంచి కలలు కంటాడు. చాల గొప్పవాడినైపోదామని. అదే ఆశ అతనిని ముందుకి నడిపిస్తుంది. ఈ ప్రపంచమంతా పెద్ద నాటకరంగం - మనమందరం అందులో పాత్రధారులం. అటువంటప్పుడు రంగస్థల నటుడికి, జీవిత యాత్రలో సాగే నటుడికి భేదమేముంది? రంగస్థల నటుడు తన గాడి బట్టిన జీవితాన్ని నటించలేడు. ఇంకెవరివో గొప్పవారి పాత్రలు నటిస్తాడు. అది నటన - జీవితం కాదు. ఆ నటన జీవితానికి ఎంత సమీపంగా ఉంటే అంత అద్భుతంగా ఉంటుంది. ఎవరో నాగభూషణంగారు హరిశ్చంద్ర వేషం వేస్తున్నారని, పరీక్షలకు చదవడం మానేసి రాత్రంతా నాటకం చూశాను. అప్పుడెంత టిక్కెట్టు రూపాయే కదా - అప్పుడే నాగభూషణంగారి హరిశ్చంద్ర నాటకం చూశాను.

పక్క పక్క ఊళ్ళనుంచి ప్రజలు బళ్ళు చేసుకు వచ్చారు. నాగభూషణం గారికి అప్ప టికే ఆరు బిరుదులున్నాయి. అతనికేం? మహారాజు - మహారాజు వేషం వేస్తే ఆనాటి మహారాజులు కూడా అతనికి తీసికట్టే కదా! అప్పటి నుంచీ అతనిదొకటే గుణం తన వేషం తనే వేసుకుంటాడు. దానిన్ని పెండాలు దాకా మోసుకొస్తాడు. అవేం పద్యాలు అవేం రాగాలు! అవేం మాటలు - ఆ రోజుల్లో మైకులున్నాయా? అతను పద్యం చదువుతుంటే ఆఖరున కూర్చున్న ప్రేక్షకుడికి కూడా చాల స్పష్టంగా వినిపిస్తుంది. అందరూ అలా నిశ్శబ్దంగా కూచొని ఒళ్ళు మరచిపోయేవారు.

''ఏదేది - అదే పద్యం - మెడలో మాంగల్యం చూసి - ఆ చంద్రమతి మెడ లోని పుస్తెలు మరెవ్వరికీ కనపడవు - అప్పుడు పద్యం చదువుతాడు''.

రాజశేఖరం ఆ పద్యం చదువుతున్నాడు. చుట్టూ ఉండే ఖాళీస్థలమంతా నిం డిపోయింది. ఆ పద్యం అచ్చంగా నాగభూషణం చదివినట్టే ఉంది. చివరకు రాగం ఒక పావుగంటవరకు లాగించి, ప్రజలు ఉబ్బితబ్బిబయ్యేటట్టువ చదువుతున్నాడు.

నేను నా రిక్షాను కొంచెం దూరంలో అతనికి సులువుగా కనిపించని దూరంలో ఉంచి వింటున్నాను.

ఆ హరిశ్చంద్రుడు మరో పద్యం చదువుతాడు. ముందో వెనుకో - అకటా - వేరెడు నేలకుందగడె....''

ఆ పద్యం ముందు చదివిన దానికన్న అద్భుతంగా ఉంది. జనం ఇంకా పెరు గుతున్నారు. అంతటితో ఆగిపోయాడు!

''చంద్రమతి - ఆ వేషం వేసినావిడ ఎటువంటిదనుకున్నారు. పంచ కావ్యాలు చదువుకుంది. సంగీతం నేర్చుకుంది. గజ్జె కడితే ముజ్జగాలను నిలబెడుతుంది. కాని ఆవిడ తనకుండే విద్యలేం అక్కడ ప్రదర్శించలేదు. కొడుకు కనిపించలేని తరుణంలో ఆమె రాగాలతో సాము చేస్తుందా? ఆమె చదివిన ఒక్క పద్యం చాలునయ్యా! హృద యమున్న మనిషికి కళ్ళంట జలజల నీళ్ళు కారకుండా ఉంటాయా.''

అపుడు రాజశేఖరం పద్యం ఆఖరి పాదాలు రెండూ ముందు చదివాడు.

''నీ కుమారుని బోలిన నా కుమారు
వేగ కాన్పించ జేయవో విశ్వనాథ.''

ఆ రెండు పాదాలు చదివి తిరిగి పద్యం మొదటి నుంచి చదవడం మొదలు పెట్టాడు.

''జలదమా.....''

ఆ పద్యం వింటూ ప్రజలు చేష్టలు దక్కి నిలిచిపోయారు.

చాల గంభీరంగా ఉంది వాతావరణం. ఇంకా అతను చదివే పద్యాలను వినాలని ప్రజలు ఎదురు చూస్తున్నారు.

''ఇంకా చాలా మంచి పద్యాలున్నాయి. మీరందరూ ఈ రాత్రి జరిగే పోటీ నాటకాలకు రండి. గొప్పవాళ్ళెవరో మీరే నిర్ణయించండి. మీ అభిమతానికి అనుగుణంగా ఉన్న నాటకం హరిశ్చంద్ర.''

రాజశేఖరం మధ్యాహ్నం భోజనం చేశాడో లేదో, పొద్దున్న టిఫిన్ కూడా సరిగా చేయలేదు. రాత్రంతా శ్రమపడి ప్రయాణం చేసి వచ్చాడు. పొద్దున్న పది దగ్గిర నుండి ప్రచారంలోనే మునిగిపోయాడు. ప్రచార సామగ్రి ఏముంది? రెండు స్పీకర్లు ఆంప్లిఫయరు - బేటరీ సెట్ - అదే రిక్షా ఆక్రమించింది. దాని వెనుక రాజశేఖరం నడుస్తున్నాడు. ఇంకెవరూ ఈ విధంగా శ్రమపడరు. ఈ నాగభూషణం ఎంత స్వార్థపరుడు.

నా రిక్షా కూడా మెల్లిగా లబ్బీపేట చేరుకుంది.

రాజశేఖరం తన సరంజామా సిద్ధం చేసుకొని ఉపన్యాసం మొదలుపెడుతున్నాడు.

''ఈ విజయవాడ పౌరులెంత అదృష్టవంతులు! దేశంలో మకుటాయమానమయిన రంగస్థలంపై ముగ్గురు ఉత్తమ నటులు ఈ రాత్రి ప్రదర్శనలిస్తున్నారు. వారిలో ఒకరికి 'మహానట' బిరుదం లభిస్తుంది. ఒకే నాటకం, హరిశ్చంద్ర వేషంలో వాళ్ళు మీకు దర్శనమిస్తారు. ఈ మధ్య, అంటే నాలుగు సంవత్సరాలయి ఈ బిరుదానికి అర్హులైన నటులే దొరకలేదు. ఈ రోజుల్లో నటులంటే సినిమా నటులనే అర్థమిస్తుంది. రంగస్థలానికో ప్రత్యేకత ఉంది. అందుబాటులో ఉండే సాధన సామగ్రి చాల పరిమితమైనది. తొందర తొందరగ డ్రెస్సులు మార్చుకోవాలి. సీనులు మార్చుకోవాలి. మైకుల ముందు తక్కువ స్థలంలో తిరుగుతూ నటించాలి. ఇన్ని ఇబ్బందులు పడుతూ ఈ రంగస్థల నటులు ఏదో సాంప్రదాయాన్ని పునరుద్ధరించాలని, ఈ కళను సజీవ సమాధి చేయడం సహించలేక, మీ అందరి సహకారాన్ని కోరుతున్నారు. మహానుభావులు కపిలవాయి రామనాథశాస్త్రి, వేమూరి గగ్గయ్య, మాధవపెద్ది, కన్నాంబ, సురభి నాట్యమండలివారు, బందావారు, స్థానంవారు రంగస్థలానికొక గౌరవం సమకూర్చారు. వారి బాణీలు మీరొక్కసారి వినండి - ఒళ్ళు పులకిస్తుంది''.

తరువాత రాజశేఖరం ఆ ప్రఖ్యాత నటుల పద్యాలు చదివాడు. వాళ్ళ పాటలు పాడాడు. పద్యంలో గమనం, అర్థ విశ్లేషణ, రాగచ్ఛాయలు, ఒకటేమిటి, వాళ్ళు ఎన్నో ఏళ్ళ క్రింద వేలాది ప్రేక్షకుల హృదయాలలో సంచలనం కలిగించిన ఉత్తమమైన పద్యాలు, ఈనాడు స్ఫూర్తివంతంగా చదివి వినిపించాడు.

వింటున్న వాళ్ళందరూ ముక్కుల మీద వేళ్ళు వేసుకుంటున్నారు.

ఆ నటుల పేరులే వినని యువతరం అంత గొప్పగా వాళ్ళు పాడారా అని అబ్బురపడ్డారు.

అన్నీ వినిపించి చివరకు రాజశేఖరం అన్నాడు.

''ఎవరి బాణీ వారిది. ఏ పూవు అందం ఆ పూవుదే. ఏ సుమ సౌగంధ్యం ఆ సుమానిదే. అనంతమైన వర్ణ సమ్మేళనంలో ఏ పుష్ప శోభ ఆ పుష్పానిదే. ఒకటి మంచిదని, మరొకటి కాదని చెప్పలేము. నా బాణీ కూడా వినండి.....''

అపుడు రాజశేఖరం కృష్ణలీలల నుండి ఒక పద్యం చదివాడు. నిజానికది భాగవతంలోనిది.

''నల్లనివాడు - పద్మ నయనంబులవాడు...''

ఆ పద్యం ఎంత లలితంగా ఉంది? ఎంత మధురంగా ఉంది! ఎంత రమ్యంగా ఉంది! ఎంత మనోజ్ఞంగా ఉంది! ఎంత అద్భుతంగా ఉంది.

ఎంతమందో జనం. అందరూ ఆ పద్యం విని అమృతం తాగి తృప్తులైనట్లు పరబ్రహ్మను దర్శించి పునీతులైనట్లు అనుభూతిని పొందుతున్నారు. నాలో నాకే నవ్వు వచ్చింది. నాలో కలిగిన ఈ మార్పులు అందరికీ కలిగాయని అనడం సమంజసమేనా? నేనేం చేయను. వాళ్ళ ముఖాలు ఈ మార్పులన్నీ దాచడంలేదు.

రాజశేఖరం చాల గొప్పవాడు. శ్రోతల హృదయాలను తన గుప్పిటలో ఉంచుకొని, వాళ్ళా భ్రమనుండి తేరుకోక పూర్వమే మెల్లిగా, తన బాణీ ఒకటి వాళ్ళ మనసుల్లో ముద్రవేసి జారుకుంటున్నాడు. ఈ ప్రచార విధానం నాకు చాల కొత్తగా కనిపించింది.

ఆలోచిస్తూ కూర్చున్నాను నా రిక్షాలో.

లబ్బీపేట ఉపన్యాసంలో ఈ రాజశేఖరం 'మహానటు' బిరుదం పొందడానికి సిద్ధంగా ఉన్న నాగభూషణం గురించి ఒక మాటైనా ఆడలేదు. ఈ పద్యాలు చాల మట్టుకు నాగభూషణం పాత్రలకు సంబంధించినవి. అంటే అతడు మెచ్చునవి. అన్నిటికీ మించి తనకో బాణీ ఉందని అప్రయత్నంగా ఇతడు బయటపడుతున్నాడు. ఆ పద్యం చదివే బాణీయే కొత్తది. సమ్మోహనాస్త్రం వేసినట్లు శ్రోతలను కట్టిపడేసింది. వాళ్ళు ఇంకా ఇంకా వినాలని ముందుకొస్తుంటే ఇతడు చల్లగా రంగం నుండి ఉపక్రమిస్తున్నాడు.

చేతికుండే రిస్టు వాచీ చూసుకున్నాను. అప్పుడే ఆరు గంటలయిపోయింది. నాకోసం నాగభూషణం ఎదురు చూస్తుంటాడు. కాలం ఎంత వేగంగా పరిగెడుతున్నది. వెంటనే వెళ్ళిపోవాలనుకున్నాను. కాని, కాళ్ళాడడంలేదు. ఈ రాజశేఖరం చెప్పినది రెండు చోట్ల విన్నాను. ఒక చోట చెప్పినట్లు రెండో చోట చెప్పలేదు. అంతా కొత్తగానే ఉంది. చదివిన పద్యం చదవడంలేదు. పాడిన పాట పాడడంలేదు. అతని మాటలు ఎంత లోతులకు పోతాయి!

ఏడు గంటలు కొట్టగానే అతను కూడా దుకాణం కట్టేస్తాడు.

ఆఖరి ప్రచారోపన్యాసం వింటే ఇంకా అతని గురించి బాగా తెలుసుకోవచ్చు. నాగభూషణానికేదో సమాధానం చెప్పవచ్చు. ఈ అవకాశం మాత్రం జారవిడుచు కోలేము.

ఆఖరి మజిలీ సూర్యారావుపేటలో. అక్కడ పెద్ద పెద్ద యిళ్లు. ఆ యిళ్ళలో సంపన్న కుటుంబాలు. అక్కడ వినేవాళ్ళెవరుంటారు? అక్కడెందుకు ఆఖరి ఉప న్యాసం ఏర్పాటు చేశారు?

క్రమంగా వెలుగు తగ్గుతోంది.

రాజశేఖరం రిక్షా మెల్లిగా నడుస్తోంది. దాని వెనుక అతడు నడుస్తున్నాడు. మరో రిక్షా చేయించుకొని పోవలసింది. ప్రచారం చెయ్యమని చెప్పడమే నాగభూష ణానికి తెలుసు. ఇబ్బందులేవీ అతనికి పట్టినట్లు లేవు. అతని దగ్గిర డబ్బుందో లేదో? నేనేనా కొంత ఇవ్వవలసింది. ఆ ఇద్దరి మధ్య నేను తొందరగా నిర్ణయం తీసు కోలేకపోయాను. ఏం చెయ్యడం? అతనిని సమీపించి, ఏ హోటలులోనో కాఫీ అత నితో తాగితే బాగుండునేమో! అప్పుడే ఆరుంపావు. సరిగ్గా ఏడు గంటలకు ప్రచారం ముగిసిపోవాలి. సంస్థకు చెందిన మనుషులు ప్రతి విషయం చాల శ్రద్ధతో గమనిస్తు న్నాను.

నేను సూర్యారావుపేట చేరేసరికి అప్పుడే రాజశేఖరం మైక్ అమర్చి మాట్లా డడానికి సిద్ధంగా ఉన్నాడు. రెండు రోడ్లు ఒకదాన్నొకటి క్రాస్ చేస్తున్నాయి. ఒక మూలకు కొంతమందేనా నిలబడడానికి చోటుంచి, రాజశేఖరం మైకు సరిచేశాడు.

''హాయిగా యిళ్ళలో ఉన్న సంపన్నులారా! మిమ్మల్ని కొంతకాలం ఇబ్బంది పెట్టవలసి ఉంది. ఓర్పుతో మీరీ రెండు మాటలు వింటే నా ప్రచార కార్యక్రమం ముగుస్తుంది. మరి కొద్దిసేపటిలోనే పోటీ నాటకం 'హరిశ్చంద్ర' మొదలవుతుంది. తినబోయే కూరకు రుచి అడగడమేమంటారో! దాని గురించి మీకు కొంచెం చెప్తే మీరు ఇంకా ఆనందిస్తారు. హరిశ్చంద్ర పాత్రను ముగ్గురు నిర్వహిస్తున్నారు. చూసిన నాటకమే మళ్ళా మళ్ళా అదే స్టేజి మీద చూస్తే విసుగనిపించదా? బహుశా ఈ హరి శ్చంద్ర నాటకం కొన్ని వేలసార్లు ఆడి ఉంటారు. చూసినవాళ్ళే చూస్తున్నారు. వాళ్ళే ఒకే బిగిని ముగ్గురు నటులు ఏ విధంగా స్టేజి మీద రాణిస్తారో చూడడానికి తొందర పడుతున్నారు. ఈ నాటకంలో నాయకుడు, అంటే హీరో, హరిశ్చంద్రుడు. అతడు చక్రవర్తి. ఆడిన మాట తప్పకుండా ఉండడం కోసం ఏ మానవుడూ ఊహించలేని బాధలకు లోనవుతాడు. అందుకోసం ఎంతేనా త్యాగం చేస్తాడు. కాబట్టి ఇతడు సామా న్యమయిన నాయకుడు కాదు. మహా నాయకుడు. మహానాయకుడు సాధారణంగా ధీరోదాత్త నాయకుడయే ఉంటాడు. ధీరోదాత్తుడి గుణాలు చిత్తగించండి. ఈ నాయ

కుడు అతి గంభీరమైనవాడు. మహాసత్త్వుడు అంటే మహా బలశాలి. క్షమాశీలుడు, స్థిరబుద్ధి, అవికత్థనుడు అంటే ఆత్మ ప్రశంసను చేసుకోనివాడు. వినీతుడు, ధర్మము వేపే మనసు కలవాడు. చేసిన ప్రతిజ్ఞను చివరి వరకు పాలించవలసినవాడు. లోక వ్యవహారం, శాస్త్రం తెలిసినవాడు. వాంగ్మి అంటే సంభాషణాదక్షుడు - ఇవన్నీ అతని శీలానికి సంబంధించిన గుణాలు. ప్రకృతి ననుసరించి ఈ మహా నాయకుడు ఉత్తముడు. సాత్త్విక గుణసంపన్నుడు. ప్రియంవదుడు, శూరుడు, తేజస్వి - ఇలా చెప్పుకుపోతుంటే ఎన్నో ఉన్నాయి.

సుందర్ గుణ - మందిర్ యువా, యువతి బిలోక్యైం జాహి

కవితా - రాగ - రసజ్ఞ జో, నాయక కహియే తాహి ... అంటాడు జ్ఞాన వినోదుడు. మహా నాయకుడి వేషం వేసే నటుడు ఈ గుణాలన్నీ రంగస్థలం మీద చూపించడానికి ప్రయత్నిస్తాడు. అలంకార శాస్త్రజ్ఞులో మాటన్నారు. మహానటుడి గుణగణాలు అతడు ధరించే మహానాయకుల పాత్రల గుణాలకు విరుద్ధంగా ఉండవు. అంటే ఎవరయితే రంగస్థలం మీద, నిజజీవితంలోను, ఈ సద్గుణాలు కలిగి ఉంటారో వారే 'మహానట' బిరుదానికి అర్హులు.

''మహా నాయకులలో రాముడు, జీమూతవాహనుడు, యుధిష్ఠిరుడు వస్తారు. ఈ హరిశ్చంద్రుడు కూడా వారితో సమానమయినవాడే. ఆ వేషం వేస్తున్న నటులలో కొన్ని ఉత్తమ గుణాలున్నా ఈ మహానట బిరుదం వారికివ్వచ్చు. ఇది రహస్యం. మచ్చుకి రెండు పద్యాలు చదువుతాను వినండి.

అప్పటికే చాలమంది పోగయారు. పద్యాలు చదవడంతో జనం ఇంకా వచ్చారు. గుమ్మాలలో, డాబాల మీద ఆడవాళ్ళు నిలబడి వింటున్నారు. వీథులలో, జనసంచారమే అంతగా ఉండదన్నచోట, ఉన్నవాళ్ళే అందరూ వళ్ళు మరచి వింటున్నారు.

సరిగ్గా ఏడయింది.

నమస్కారం అందరికీ పెట్టి రాజశేఖరం ప్రచారం సమాప్తి చేశాడు.

మరో ఐదు నిముషాలలో ఎక్కడివాళ్ళు అక్కడికి వెళ్ళిపోయారు.

అతని రిక్షా ముందు - దానికి అర ఫర్లాంగు దూరంలో నా రిక్షా - నా ఆలోచనలన్నిటిలోను రాజశేఖరమే ఉన్నాడు. నాగభూషణం గురించి హోటలు చేరిన తరువాత జ్ఞాపకమొచ్చింది. అప్పటికి ఏడున్నర దాటి పోయింది.

తొందరగా మా గదుల దగ్గరికి పరుగెత్తాను. నాగభూషణం గది తలుపు తాళం వేసి ఉంది. తొందరగా నా గది తెరచి, ఒళ్ళు కడుక్కొని, చీర మార్చుకొని వీథిలోకి వచ్చాను. రాజశేఖరం వస్తాడేమోనని అయిదు నిముషాలు వేచి ఉన్నాను. అప్పుడు

జ్ఞాపకం వచ్చింది. అతను మైకు అప్పుజెప్పడానికి కాళేశ్వరరావు మార్కెటు వేపు వెళ్ళి పోయాడని ఎప్పుడొస్తాడు, ఎక్కడికొస్తాడు? నాకు వేటికీ సమాధానాలు లేవు.

అప్పటికే ఎనిమిదయింది. నాగభూషణం ఏం చేస్తున్నాడో?

ఆటో చేయించుకొని థియేటరు చేరుకున్నాను. ముగ్గురు నటులకు మూడు వేరే వేరే గదులిచ్చారు. ఒకరికొకరికి సంపర్కంలేదు. మాకిచ్చిన గది తలుపు తట్టాను. లోపల గడియలేదు. తలుపు తోసుకొని లోపలికి ప్రవేశించాను.

నా కళ్ళను నేనే నమ్మలేకపోయాను.

హరిశ్చంద్ర మహారాజు టేబిలు దగ్గర కుర్చీమీద కూర్చున్నాడు. వేషం పూర్తి అయింది. అతడు బ్రాందీ సీసా నుండి గ్లాసులోకి మధువు పోసి, దానిలో సోడా కలుపుకుంటున్నాడు.

రమారమి సంవత్సరం పైగా అతనితో తిరుగుతున్నాను. ఒకనాడు నాకతడు తాగినట్లు తెలియలేదు.

''నాగభూషణం!'' ఉరిమాను.

అతను తలెత్తి నావేపు చూశాడు. జవాబు చెప్పకుండా గ్లాసు ఖాళీ చేశాడు.

''ఏమిటీ ఆగడం? అప్పుడే మొదటి నటుడు రంగస్థలం మీద ఉన్నాడు. నువ్వు రెండోవాడివి. 'మహానట' బిరదం పొందవలసిన వాడివి. ఇది నీకు తగునా?''

అతను మరో గ్లాసు నిండా సోడా పోస్తున్నాడు.

తొందరగా ఆ గ్లాసు తీసి విసిరేశాను.

''రాగలతా! ఈ విషయంలో నన్నడ్డడానికి నీకు అధికారం లేదు. ఎప్పుడు తాగాలో ఎప్పుడు తాగకూడదో నాకు తెలుసు. అనుకున్న ప్రకారం అన్నీ జరిగితే ఈ తాగడం అనవసరం. ఇప్పుడు చాలా అవసరం.''

ఇప్పటికి తాగింది చాలు. ఆపు!

''చాలదు. నేనన్నీ మరచిపోయేదాకా తాగాలి.''

టేబిలు మీద సోడాబుడ్లు పక్కకు పెడుతున్నాను. అతడు బ్రాందీసీసా తీసుకొని, ఏ నీళ్ళు, సోడా కలపకుండా సీసాలో మిగిలినదంతా తాగేశాడు.

''నాగభూషణం! నువ్వు ఇంత అసహ్యకరంగా ప్రవర్తిస్తావని నేను కలలో కూడా అనుకోలేదు. ఎందుకింత తప్పుపని చేశావ్?''

నాగభూషణం అంత మైకంలోను నవ్వాడు.

''రాగలతా! నిజం అంత వేగం తెలుస్తుందా? దానికోసం ఎంత శ్రమపడాలి.''

అతని మాటలు నాకప్పుడు అర్థంకాలేదు.

ఆరు నెలల తరువాత నాకు తెలిసింది. అప్పటికి అన్నీ అయిపోయాయి. నా హృదయం ఎవరికో సమర్పించుకున్నాను.

అప్పటికి తొమ్మిది గంటలయింది.

రాజశేఖరం జాడ కనిపించడంలేదు. ఏం చేయడం? 'మహానట' బిరుదం మీద చాలమంది రసికులు పందాలు వేశారు. ధర్మయ్య మీద పదివేలు, వీరభద్ర రావు మీద అయిదు వేలు, నాగభూషణం మీద వేయి రూపాయలు. ఎవరు పోటీలో గెలిస్తే వారికి పందెం మొత్తంలో సగం భాగం యిస్తారు. మిగిలినది పందెంలో గెలుపొం దినవారు పంచుకుంటారు.

ఈ పందెం మాట అటుండనీయండి.

సరిగ్గా పదకొండు గంటలకు నాగభూషణం స్టేజి మీద ఉండకపోతే ఎంత గొడవ జరుగుతుంది. హాలు నిండా కిక్కిరిసి కూర్చున్నారు. స్టేజి విరగ్గొడతారు. నాగభూషణం చర్మం వొలుస్తారు. అతని సెక్రటరీనని బహిరంగంగా నన్ను రేప్ చేస్తారు.

ఏమీ తోచడంలేదు. ఇంకెక్కడనుంచి తీశాడో నాగభూషణం - మరో సీసా - గడగడ సగం దాకా తాగేశాడు. గుడ్లు పగిలి చచ్చిపోతాడు. ఓ భగవంతుడా ఏం చేయడం?

అతని చేతులో ఉన్న సీసాను బలవంతంగా లాక్కొని మిగిలిన బ్రాందీని సింకులో పోశాను. గదంతా బ్రాందీ వాసన గుప్పుమని వ్యాపించింది.

మత్తు తలకెక్కింది. నాగభూషణం లేచి నిలబడ్డాడు. నిలబడలేక సోఫామీద పడిపోయాడు.

పడిపోతూ నాటకంలో డైలాగొకటి అందుకున్నాడు. లేచి కూర్చున్నాను. నేను ఏ తాగుడునయితే అసహ్యించుకొంటానో ఏ అసందర్భ ప్రలాపాలను వినదలుచుకోనో అవన్నీ తప్పడంలేదు.

నేను దేనికీ విచారించలేదు. ఈ నటులందరికీ తాగే దుర్గుణం స్టేజి ఎక్కిన దగ్గర నుంచీ ఉంటుంది. స్టేజి ఫియర్ లేకుండా ఉండాలని మొదలుపెట్టి వాళ్ళు క్రమంగా సారా బట్టీలను అపోశనం పడతారు. కాని నాటకమాడవలసినప్పుడు కొంతలో కొంతేనా అదుపులో ఉంటారు. ఈ నాగభూషణం అన్ని హద్దులను అతిక్రమించాడు.

ఏం చేయడం?

అన్నిటికన్నా ముఖ్యం రసాభాస కాకుండా చూడడం. ముందుగా సంస్థ వారికి తెలిపి, నాగభూషణం తీవ్రంగా అస్వస్థుడయాడని, పోటీ నుంచి ఉపసంహరించు కుంటున్నాడని చెప్పడం సబబైన పని.

లేచి నిలుచున్నాను. ఈ మనిషికి మత్తు వదలిస్తే దారికొస్తాడు. కొళాయికింద కూచోబెట్టి ఒక అరగంట స్నానం చేయిస్తే అన్ని తెగుళ్ళూ కుదురుతాయి.

కాని, ఈ నాగభూషణం అటువంటి అవకాశమే ఇవ్వడంలేదు.

మనిషి పూర్తిగా వేషంలో ఉన్నాడు. కోటూ పూర్తిగా కొట్టుకున్నాడు. చివరకు కిరీటమయినా విడిచిపెట్టలేదు. అది కూడా విగ్గుకి తగిలించుకున్నాడు.

ఏం చేయడం? ఏం చేయడం?? ఏం చేయడం???

గది నలుమూలల చూశాను. ఏదేనా సులువు దొరుకుతుందా? ఇంత సోఫా మీంచి నాగభూషణం పడిపోయాడు. పెద్ద శబ్దమయింది. ఆ మనిషిని లేవనెత్తడానికి ప్రయత్నం చేశాను. చేతులు పట్టుకు లేవనెత్తబోయాను. మనిషి బరువుగా ఉన్నాడు. ఏ విధంగా కూడా నాకు సహాయం చేయడం లేదు. పైపెచ్చు నా పైట లాగిపారేశాడు.

''డార్లింగ్! నువ్వెంత అందంగా ఉన్నావ్! రోజూ నిన్ను చూస్తూ గుటకలు మింగుతున్నాను. ఇవాళ నిన్ను విడిచిపెట్టను''.

అరుస్తున్నాడు. నాకు భరించరాని దుఃఖం వచ్చింది. పెనుగులాటలో నా చీర చింపేశాడు.

ఇది నాగభూషణం తప్పుకాదు. ఏమాత్రం తెలివున్నా ఇటువంటి తప్పుడు పనులు చేయడు.

అతనినలా విడిచి గదిలో ఒక మూలకు పోయి చేతుల్లో ముఖం దాచుకొని ఏడుస్తున్నాను.

''రాగలతా!''

సూర్యరశ్మికి ఉడికిపోతున్న మనిషి మీద మలయానిలం వీచినట్లు ఆ పిలుపు వచ్చింది. తలెత్తి చూశాను.

గది గుమ్మం దగ్గిర రాజశేఖరం నిలబడ్డాడు.

అతని ముఖం చాల నిర్మలంగా ఉంది. ఏ విధమైన ఉద్వేగం కనిపించలేదు.

''మీరు ముందు మరో చీర కట్టుకొని రండి. అప్పుడు మనిద్దరం ఈ మనిషిని సోఫామీద పడుకోబెడదాం!''

నేనేం జవాబు చెప్పలేదు. ఆ ఆజ్ఞను పాలించడమే ధర్మమనుకున్నాను. లేచి మరో చీర బాత్ రూములో మార్చుకొని వచ్చాను.

ఇద్దరం కలిసి నాగభూషణాన్ని సోఫామీద పడుక్కో బెట్టడానికి ప్రయత్నించాము. అతను తలవేపు పట్టుకున్నాడు. నేను కాళ్ళు పట్టుకున్నాను. ఇద్దరం ఎత్తి అతనిని సోఫా మీద పడుక్కోబెట్టాం.

నాగభూషణం మళ్ళా డార్లింగ్ అంటూ అరవడం మొదలుపెట్టాడు.

''నాగభూషణం! నేనిప్పుడే వచ్చాను. ఇక నువ్వు అదుపులో ఉండడానికి ప్రయత్నించు, ఇప్పుడు పది గంటలవుతున్నది. మరొక్క గంటలో స్టేజి మీదికి నడవాలి'' అన్నాడు రాజశేఖరం.

''ఓరబ్బీ! అది ముడియాదు. ఈ నాగభూషణం ఈ రోజు స్టేజెక్కడు. వాళ్ళతో చెప్పి పోటీ తేదీ మార్పించు.''

''నీ వేషం విప్పు - షవర్ కింద తలుంచు, లే!''

నాగభూషణం ఈగిలబడ్డాడు - లేవనన్నాడు - నిమిష నిమిషానికి మత్తు తలకెక్కుతోంది.

''దాహం! దాహం!'' అరుస్తున్నాడు నాగభూషణం.

రెండు గ్లాసులు నీళ్ళు తాగి మళ్ళా సోఫామీద పడుకున్నాడు.

''ఈ పరిస్థితులలో మనం బలవంతం చేసి స్టేజి ఎక్కించినా ప్రయోజనం లేదు. మీరు వెళ్ళి సంస్థ యజమానులతో చెప్పిరండి. నాగభూషణం పోటీ నుంచి ఉపసంహరించుకుంటున్నాడని. అదొక్కటే మర్యాదగా మనం చేయవలసిన పని.'' అన్నాను నేను.

''రాగలతా! ఒక్క సంగతి మీరు మరచిపోకండి. తండోపతండాలుగా ప్రజలు వచ్చి పడ్డారు. వారందరూ నిరుత్సాహం పొందుతారు. మిగిలిన ఇద్దరూ 'మహానట' బిరుదానికి అర్హులైన వాళ్ళు కారు. ఈ సంవత్సరం కూడా రంగస్థల నటులలో ఎవరూ యోగ్యులు లేరని నలుగురూ అనుకుంటారు. రసాభాస, అసంతృప్తి ఈ రెండూ వెంటనే సిద్ధించనున్న పరిణామాలు.''

''మార్గాంతరమేదేనా ఉందా?''

''అదే నేనూ ఆలోచిస్తున్నాను. పోటీల కార్యక్రమానికి ఏవిధమైన ఆటంకం రాకుండా చూడడం మన ప్రథమ కర్తవ్యం. దీనిని దృష్టిలో ఉంచుకొని ఆలోచించండి.''

''అంటే పోటీలో గెలుపు మాట అటుంచి, నాటకం ఆడాలి. ఆ వేషానికి సరిపడే వ్యక్తి కావాలి. హరిశ్చంద్రుడి వేషంలో అతనికి నాగభూషణానికి తేడా ఉండకూడదు.''

''అందుకు మీరే తగినవాడు - మీరు పద్యాలు చదవగలరు - రంగస్థలంమీద మీకు నటనానుభవం చాల తక్కువని విన్నాను.''

''నిజమే! నేనెన్నో నాటకాలలో నటించలేదు.''

''ఇంతకుపూర్వం హరిశ్చంద్ర వేషం వేశారా?''

లేదు.

''పోర్షను, పద్యాలు బాగా వచ్చా?

''బాగావచ్చు! నాగభూషణాన్ని తీర్చిదిద్దడం కోసం అవన్నీ బట్టీ పట్టాను.''

''అయితే మరేం! బిరుదం మాట దేవుడెరుగు. మీరు బండి నడిపించగలరు. టైము పదిన్నరయింది. ఒక్క గంట మాత్రమే ఉంది.''

''అవును.''

''మీరు భోజనం చేశారా?''

''లేదు.''

''ఎందుకింత ఆలస్యమయింది?''

''కృష్ణలో స్నానం చేస్తూ ఉండిపోయాను. నాటకం పదకొండుకు గదా! ప్రేక్ష కుడిగా నాకేం పనుంటుంది?''

''నాగభూషణం గురించేనా మీరు ముందుగా వస్తే ఈ అందోళన తప్పేది కదా?''

''రాగలతా! మీరు సమర్థవంతంగా అన్ని పనులు చేయగలరు. ఆ ధైర్యంమీదే నేను వెనక్కు తప్పుకున్నాను.''

''అయ్యో భగవంతుడా! ఎంత తప్పభిప్రాయ పడ్డారు. నేను మీకన్న అనుభ మున్న దాననా? ఈ నాగభూషణం ఇంతవరకు పెద్దమనిషి వేషంలో నా వెంట పడ్డాడు. నన్ను నమ్మించాడు. ఈ విధంగా ప్రవర్తిస్తాడని ఒక్కనాడు కూడా అనుకోలేదు.''

''రాగలతా! ఇప్పుడు విచారించడానికి వ్యవధి లేదు మా వాడి దగ్గిర ఎప్పు డూ మరో సెట్టు విగ్గు, కిరీటం, రంగులు సూట్‌కేసులో ఉంటాయి. అవి ఇక్కడికి తెచ్చాడా, హోటలులో విడిచి పెట్టాడా?''

''ఇక్కడికే తెచ్చాడు. టేబిలు కిందరెండో పెట్టె ఉంది.''

''కాని, నాకు కోటా వేసుకోడం సరిగా రాదు.''

''దానికేం ఇబ్బంది లేదు. మా ఆడపిల్లలందరికీ నేనే రంగులు పులిమేదాన్ని ముందు చొక్కా బనియను విప్పిరండి.''

ఇంకా ఒక్క అరగంట మాత్రమే ఉంది.

రంగులు తీసి కోటా కొట్టాను. అతను మిగిలిన వేషం పూర్తి చేశాడు. సరిగ్గా సమయానికి రాజశేఖరం గ్రీన్ రూము వదిలి స్టేజి వేపు నడిచాడు. మిగిలిన పాత్ర లందరూ అప్పటికే అక్కడ సిద్ధంగా ఉంటారు. నడిచి వెళ్తున్న రాజశేఖరానికి, నాగ భూషణానికి బేధం కనిపించలేదు.

మొదటి నటుడి పని అయిపోయి ఉంటుంది.

పది నిమిషాలపాటు జడ్జీలు విడివిడిగా కూర్చొని మరొక్కసారి పునర్విమర్శ చేసుకుంటారు. అభిప్రాయం కొంతవరకు ఏర్పడుతుంది.

మళ్ళా ఆ గ్రీన్ రూములో నేను, నాగభూషణం మిగిలాము. అతను సోఫా మీదే ఉన్నాడు. మధ్య మధ్యను అరుస్తున్నాడు. ఒకటి రెండుసార్లు మంచినీళ్ళడిగాడు.

ఎంతో ఉత్సాహంతో విజయవాడ వచ్చాను. పోటీ నటుల కార్యక్రమాలన్నీ చూద్దామనుకున్నాను. చివరకు తాగి పడిఉన్న మనిషితో గ్రీన్ రూములో కూర్చున్నాను.

అప్పుడే పదకొండున్నరయింది. రెండవ నటుడితో నాటకం ప్రారంభమయింది. ఆ స్థితిలో ఉన్న మనిషిని విడిచి వెళ్ళలేను. నాటకం ఎంత చూడాలనుకుంటే మాత్రం ఏం ప్రయోజనం?

రంగస్థలంమీద ఏం జరుగుతుంది? రాజశేఖరం ఏమీ బెదిరిపోడు కద! ఏ కొంచెం ప్రమాదం జరిగినా, నాగభూషణానికి బదులు మరొకరు నటిస్తున్నారని, ఇదంతా వట్టి మోసమని ప్రజలు హాహాకారాలు పెడతారు.

ఇప్పుడు చేయవలసిందేమీలేదు. ప్రతి నిమిషం గడుస్తూంటే, భయం, ఆందోళన అన్ని నిండిన గుండెని గుప్పిట్లో పట్టుకొని కూర్చోవాలి.

ఆలోచలనలో ఉన్నానేమో, నాగభూషణం వేపు చూడడం లేదు. ఉన్నట్టుండి అతను మళ్ళా సోఫామీంచి కిందికి పడిపోయాడు. మనిషి కొంచెం కూడా స్పృహలో లేడు. అతన్ని తిరిగి సోఫాలో పడుక్కోబెట్టడం నాకు సాధ్యంకాని పని.

ఏం చేయడం?

చినిగిన నా చీర మడతబెట్టి అతని తలకింద ఉంచాను. కాళ్ళు, చేతులు తిన్నగా చాచాను. అతనికి తెలివి లేదు.

ఆ గదిలో నేనూ, అతనూ, స్టేజి మీద రాజశేఖరం ఏవిధంగా నాటకమాడుతున్నాడో? అతడు చాలా తక్కువ నాటకాల్లో వేషం వేశాడు. అందులోకి హరిశ్చంద్రుడి వేషం చాల కష్టతరమయినది. చూచేవాళ్ల అదృష్టం. వాళ్ళందరూ ముందు వీరభద్రరావు వేషం చూశారేమో, విసుగెత్తి చెప్పులు విసురుతారు. ఫైనల్సు వరకు ఆ మనిషిని ఎందుకు రానిచ్చారని గోలపెడతారు.

నేనిక్కడ అన్నీ లేనిపోనివి ఆలోచించుకుంటూ బందీగా కూర్చున్నాను.

ఇంత స్వతంత్రంగా వ్యవహరించేదాన్ని, ఇలా గోళ్ళు గిల్లుతూ కూర్చుండడంలో అర్థం లేదు.

నాగభూషణం వేపు పది నిమిషాల చూశాను. అతనిలో చలనం లేదు. అతడలా

అరగంటయి పడుక్కునే ఉన్నాడు. మరో గంట పడుక్కుంటాడు. అతడు నిద్ర పోతున్న కాలం సద్వినియోగం చేయాలి.

రాజశేఖరం హరిశ్చంద్ర పాత్రను ఏ విధంగా ఖూనీ చేస్తున్నాడో చూడడానికి నిశ్చయించాను.

గ్రీను రూములోంచి సైడ్ కర్టెన్సువరకు వెళ్ళి చూడొచ్చు. తలుపు దగ్గిర పెట్టే ముందు నాగభూషణాన్ని మరోసారి చూసి బయలు దేరాను.

. జనం కిక్కిరిసి ఉన్నారు. సైడు కర్టెన్సు దగ్గిర కూడా, వాళ్లను తోసుకు వెళ్ళ డానికి ఎంత ప్రయత్నం చేసినా లాభం లేకపోయింది. వి అయ్ పీలకు ముందు కుర్చీలు కేటాయించారు. నా దగ్గిరో స్పెషల్ పాసుంది. దానినుపయోగించి చాలా శ్రమపడి లోపలికి ప్రవేశించాను. కుర్చీలు కాళీ లేవు. ఒక పక్కకు నిలబడ్డాను.

మహాసాగరం అలల నన్నిటినీ ఉపసంహరించుకొని, గంభీరమైన సరస్సుగా మారినట్లు ఒళ్ళు మరచిన ప్రేక్షకులు కనిపించారు. మహానిశ్శబ్దం అంతటా తాండ విస్తున్నది. స్టేజిమీద రాజశేఖరాన్ని చూస్తే ఒళ్ళు గగుర్పొడిచింది. ఎంత ఠీవిగా ఉన్నా డతడు. మహారాజుకుండే అధికారం అతనిలోనే కనిపించింది. అతడు స్టేజిమీద ఇటు నుంచి అటు తిరిగినా, చేయి తిప్పినా, ముఖ మెత్తి చూసినా అంతా అద్భుతంగానే ఉంది. నాగభూషణం ఏ పద్యం చదివినా ముందో, వెనుకో పది నిమిషాలవరకు రాగం సాగతీయకుండా ఉండడు. ఇతడు పద్యం చదివే విధానమే వేరు. ఎంత జటిల సమా సాలతో ఉన్న దానినైనా చాల తేలికగా, అర్థవంతంగా, అందరికీ అవగాహనయేటట్లు చదువు తున్నాడు. పదాలు ఎక్కడో చాల మృదువుగా ఉండి కర్ణపేశలంగా ఉంటున్నవి. గమనంలో కృతకమైన వేగం లేదు. చాల సహజంగా ఉంది నడక.

సీను తరువాత సీను. చివరి సీనులలో ఎవరూ ఊహించని విధంగా రాజ శేఖరం నటిస్తున్నాడు. వేలకొలది జనుల కళ్ళ నుండి ధారలుగా నీళ్ళు, అతడు నటు డని, అది రంగస్థలమని అందరూ మరిచిపోయి నట్లున్నారు. హరిశ్చంద్రుడే దిగివ చ్చినట్లుంది..

ఎంత చెప్పినా, ఏమి చెప్పినా, అన్నీ కొంచెమైనా రాజశేఖరం నటన గురించి సరిపోవు. రాజశేఖరం గురించి నేను పడిన అపోహలు ఎంత సత్యదూరాలు.

మా మేనత్త ఓసారి చెప్పింది.

కొంతమందికి నటన పుట్టుకతోనే వస్తుంది.

తన దృష్టిలో అటువంటి వాడొక్కడే కనిపించాడంది.

ఆరోజు అతను కణ్వుడుగా వేషం వేసినప్పుడు ఎవరము ఊహించలేదు. ఒక ఎమోచూర్ అంత గొప్పుగా నటిస్తాడని. అది నటన కాదు. ఆశ్రమంలో ఉన్న కణ్వుడు.

అతని కూతురు శకుంతల. ఆ పరిసరాలు అన్నీ అతనికి చిరపరిచితాలు. ఆ వేషానికా వేసమే- ఈ వేషానికీవేషమే. ఇక్కడ అతను రాజాధిరాజు, సత్యం కోసం సర్వం ధార పోసినవాడు.

మా మేనత్త చెప్పింది. ఆ అబ్బాయి రోహితాస్యుడి వేషం వేసి జనుల హృద యాలను దోచుకున్నాడని. పాత్ర కాదు ప్రధానం.

నాగభూషణానికి పాత్రే ప్రధానం. అతడు నాయకుడికి తక్క మరిదేనికీ పనికిరాడు.

జనులలో ఎంతగానో సంచలనం. అందరూ తన్మయులై చివరివరకు హరి శ్చంద్ర చక్రవర్తి సుఖాలను, కష్టాలను పంచుకున్నారు. జడ్జీలు కూడా పాయింట్సు నోట్ చేయడం మరచిపోయారు.

ప్రజలకో పావు గంట విశ్రాంతి.

అందరూ పైకి నడుస్తున్నారు. ఆ మహాసముద్రంలో ముందుకు కాలు వేయడమే కష్టమయింది.

రాజశేఖరాన్ని ఎలా అభినందించాలో తెలియలేదు.

రెండు చేతులలోను అతనిని బిగించి, పెదవుల మీద చెరగని ముద్దొకటి పెట్టాలనిపించింది.

నేను గ్రీన్ రూము చేరేసరికి పావుగంట పట్టింది.

తలుపు తోసుకొని లోపలికి ప్రవేశించాను.

నాగభూషణం అలానే పడివున్నాడు. అతని నోటంట తడి కారుతున్నది. అత నిలో చలనం కూడా లేదు.

రాజశేఖరం తన కర్తవ్యం నెరవేర్చుకొని వెళ్ళిపోయాడు. కిరీటం, విగ్గు, మిగిలిన డ్రెస్సు అక్కడే పడేసి ఉన్నాయి. నన్ను, నాగభూషణాన్ని అపఖ్యాతి నుండి తప్పిం చాడు. రెండు రాత్రులు, ఒక పగలు నిర్విరామంగా పని చేశాడు. తనకు రావలసిన యశస్సునంతా తన స్నేహితుడికి ధారపోసి వెళ్ళిపోయాడు. ఆపదలో నన్నురక్షించాడు.

ఆలోచించడానికి మరేం లేదు.

నాగభూషణాన్ని ఈ బిరుదం కోసం ప్రోత్సహించాను నేను. దానివలన అతడు తన స్వభావాన్నే మార్చుకున్నాడు.

అతని ముఖంలోకి చూసినప్పుడు అతడొక్కటే మాటన్నాడు. తాగడానికి తనకి అధికార ముందన్నాడు. దానికి కారణం నేను.

మధ్యాహ్నం రాజశేఖరం ప్రచారం ఎలా చేస్తున్నాడో చూసి వస్తానని బయలు దేరితే, నా వెంటనే అతడూ వచ్చాడు. నాగభూషణానికి తన స్నేహితుడి శక్తి సామర్థ్యాలు

తెలుసు. నన్ను వాటికి బలి కాకుండా ఆపడానికి సర్వవిధాల ప్రయత్నించాడు. అన్నీ విఫలమయి, అతడు సందేహించినట్లే, నేను శరీరం, మనసూ అన్నీ వశం దప్పి అతని స్నేహితుడి వెంట తిరుగుతుంటే సహించలేకపోయాడు.

అన్నీ నా చేయి దాటిపోయాయి.

ఇపుడు నేను నా కాళ్ళమీద నిలబడవలసి వచ్చింది.

ధర్మయ్య నాటకమవుతుంటే, నాగభూషణం పడిపోయాడని, వెంటనే వైద్య సహాయం కావలసిందని, సంస్థ సెక్రెటరీకి చెప్పాను.

అప్పుడు సంక్షోభం ప్రారంభమయింది.

కాని నా హృదయాన్ని ఎవరో తీసుకు.....

(అంతవరకే ఆ డైరీలో ఉంది. అపుడు రాగలత లేచిపోయి, గదిలోకి వచ్చింది.)

* * *

లాయరు ఆదిశేషయ్య గారి ఆఫీసు గది చాల విశాలమైనది. సరిగ్గా సాయంకాలం నాలుగు గంటలకు రాగలత. రాజశేఖరం అక్కడికి చేరారు. రాగలత చేతిలో ఒక బ్రీఫ్‌కేసుంది.

విశాలమైన పెద్ద టేబిలు ముందు అయిదారు కుర్చీలున్నాయి. వాళ్ళు లోపలికి ప్రవేశించేసరికి అక్కడ మరిద్దరు పెద్ద మనుషులున్నారు. అందులో ఒకరు విజయవాడ నుండి వచ్చారు. ఆయన పేరు ఆనందరావు గారు. ''నాట్య భారతి'' సంస్థకు ఆయన కార్యదర్శి. రెండవ అతను జ్ఞానానందస్వామి వారు ''గోతమి రక్షాసమితి'' నుండి వచ్చారు. వీరిద్దరినీ ఆదిశేషయ్య గారి ఇంట్లో సాయంకాలం నాలుగు గంటల వేళ కలియవలసిందని రాగలత పదిరోజుల క్రిందే ఉత్తరం రాసింది.

ఆదిశేషయ్య గారు యింకా ఇంట్లోంచి రాలేదు.

''నాపేరు రాగలత. మీకు ఉత్తరం నేనే రాశాను. మీరిద్దరూ వచ్చినందుకు మా కృతజ్ఞతలు తెలుపు తున్నాను. ఆదిశేషయ్య గారు రాగానే విషయం విపులంగా మీతో విన్నవించడం జరుగుతుంది.''

ఇంతలో ఆదిశేషయ్యగారు వచ్చారు.

నమస్కారాలు, పరిచయాలు అయిన తరువాత రాగలత అంది.

''ఇతడు రాజశేఖరం. మనం ఇక్కడ ఎందుకు కలుస్తున్నామో వివరంగా చెప్తాడు.''

''నా మిత్రుడు నాగభూషణం. అతడు తన జీవితాన్ని రంగస్థల నటనకు ధార పోశాడు. అతడు రెండున్నర సంవత్సరాలయి అస్వస్థుడయి ఈ మధ్యనే దివంగతుడయాడు. ఇవాళ అతడు పోయి పన్నెండు రోజులయింది. రాజమహేంద్రవరం

లోనే అతని కర్మ పూర్తి చేశాము. అతడు చనిపోవడానికి ఆరు నెలల ముందే ఒక వీలునామా రాసి రిజిస్ట్రేషను చేయించాడు. ఆ వీలునామా ప్రకారం అతని యావ దాస్తి అతని సెక్రెటరీగా పని చేసిన రాగలతకు చెందుతుంది. కొవ్వూరులో అతనికో మంచి యిల్లు, దాని వెనుక విశాలమైన కాళీస్థలం ఉన్నాయి. అతనిపేర బాంకులో మూడు లక్షల రూపాయలు ఫిక్స్‌డ్ డిపాజిట్లలో ఉన్నాయి. రాగలతా! ఇంటి క్రయ పీటి, వీలునామా, ఫిక్స్‌డ్ డిపోజిట్ రసీదులు ఆదిశేషయ్యగారి చేతికియ్యి.''

బ్రీఫ్‌కేస్ తెరిచి రాగలత కాగితాలన్నీ ఆదిశేషయ్యగారికిచ్చింది. ఆయన వాటి నన్నిటినీ పరిశీలించి, రాజశేఖరం చెప్పిన వివరాలు సరిపోయినట్లు తల ఊపారు.

''ఇంత చెప్పిన తరువాత నాగభూషణం గురించి తెలపడం సమంజసం. నా గభూషణం చిన్నప్పటి నుండీ నాటకాలంటే మోజుపడి, జ్ఞానమొచ్చిన దగ్గిర నుండి స్టేజి మీద నటించాడు. సినీమాలకు పిలుపులు వచ్చినా, రంగస్థల నటన ఒక గొప్ప కళ అని, దానిని పోషించడం తన కర్తవ్యమని దృఢంగా నమ్మి ఒకే మార్గంలో ముందుకు నడిచాడు. అతడు వివిధ పాత్రలు ధరిస్తూ, శాస్త్రం క్షుణ్ణంగా అధ్యయనం చేసి, అద్భుతమైన ప్రజ్ఞ చూపించాడు. అతడు నిజంగా అదృష్టవంతుడు. అతని భావి జీవితం కోసం అతని మేనత్త తన ఆస్తినంతా యిచ్చింది. ఆ ఆస్తిని రాగలత వాల నేర్పుగా దక్షతతో కాపాడింది. అతడు కీర్తి శిఖరాలకు చేరుకొని రాగలతను పెళ్ళాడా లని నిశ్చయానికి చేరుకున్నాడు. కీర్తి శిఖరం చేరిన రాత్రే అతను పక్షవాతంతో పడి పోయాడు. రాగలత అతనికి రెండున్నర సంవత్సరాలయి నిరవధికంగా సేవ చేసింది. ఆమెను వివాహమాడాలన్న అతని కోరిక తీరకుండా మిగిలి పోయింది. కాని, అతడే మీ ఆమెకు లోటు చేయదలచుకోలేదు. తన యావదాస్తిని ఆమెకు రాసి యిచ్చాడు. రాగలత మాత్రం ఈ ఆస్తి నాగభూషణం పేరు నిలిచే విధంగా ధర్మ కార్యాలు చేయా లని ఒక నిశ్చయానికి వచ్చింది. వాటి వివరాలు ఆమే చెప్తుంది.'' అన్నాడు రాజశేఖరం.

''నాగభూషణం గారు నాకిచ్చిన ఈ ఆస్తి సద్వినియోగం చేయాలని నా అభిప్రాయం. గౌతమి రక్షాసమితి వారు రాజమహేంద్రవరంలో రెండు అనాథ బాలల హాస్టళ్ళు నడుపు తున్నారు. వారికి కొవ్వూరులో కూడా ఒకటి నడపాలని ఉద్దేశ మున్నట్లు తెలిసింది. నాగభూషణం గారి యింటి ప్లాను ఈ కాగితాలలోనే ఉంది. ప్రస్తుతమున్న ఇంట్లో క్రింది భాగంలో పాతిక మంది విద్యార్థులుండడానికి సరిపో తుంది. మేడమీద ఉన్న రెండు గదులలోను, ఒకదానిలో వార్డెను ఉండడానికి, రెం డవది ఆఫీసు కింద వినియోగించడానికి బాగుంటుంది. ఆదిశేషయ్యగారిని ఆ విధంగా గిఫ్టు డీడ్ తయారు చేయమని కోరుతున్నాను.'' అంది రాగలత.

''మరొక్క విషయం కూడా చెప్పవలసిఉంది. పెరట్లో ఉన్న కాళీ జాగాలో డార్మిట్రీ కట్టిస్తే మరొకపాతిక మందికి చోటు దొరుకుతుంది. ఆ పనికోసం అదనంగా ఒక లక్ష రూపాయలుకూడా ఆమె యిస్తారని నేను ఆశిస్తున్నాను.'' అన్నాడు రాజ శేఖరం.

రాగలత రాజశేఖరం వేపు ఓ అయిదు నిమిషాలు చూసింది.

''ఆదిశేషయ్యగారు - ఆ విధంగానే కానియ్యండి.''

''ఆ ఇంటిని 'నాగభూషణం హాస్టలని' పిలిచే షరతుకూడా చేర్చండి. ఆ విధంగా ఆ ఇల్లు, డబ్బు సద్వినియోగమౌతవి.'' అంది రాగలత.

''నాగభూషణం నమ్మిన నాటక కళకు సహాయం చేయడానికి రాగలత నిశ్చ యించింది. ఆ వివరాలు కూడా ఆమే చెప్తుంది'' అన్నాడు రాజశేఖరం.

''వివరంగా చెప్పడానికేమీలేదు. మిగిలిన రెండు లక్షల రూపాయలు 'మహానటు' బిరుదం ప్రతీ ఏటా ప్రదానం చేస్తున్న నాట్యభారతీ సంస్థ వారికి విరా ళంగా ఇస్తున్నాను. వారు ఆ ధనం ఫిక్స్డ్ డిపాజిట్లో ఉంచి, దానిమీద వచ్చిన వడ్డీతో ఒక బంగారు పతకం, నగదు బహుమతి 'మహానటు' బిరుదం పొందినవారికి నాగ భూషణం పేర ఏర్పాటు చేయవలసింది.''

''మీకీ ఆస్తిలో ఏమీ మిగలలేదే!'' అన్నారు ఆదిశేషయ్యగారు.

''నాకీ ఆస్తి ఏమీ అక్కరలేదు. బి.ఇడి. పాసయ్యాను. ఏదేనా ఉద్యోగం చేసుకొని బతగ్గలను. అతని కష్టార్జితం, మేనత్త యిచ్చినది మంచి పనులకుపయోగిస్తే అదే పదివేలు.'' అంది రాగలత.

''రాగలత చెప్పిన వాటికి మరికొన్ని వివరాలున్నాయి. ''నాట్యభారతి'' వారికిచ్చిన రెండు లక్షల రూపాయలలోను, ఒక లక్షమీద వచ్చే వడ్డీ 'మహానటు' బిరుదాంకితుడికి చాలు. మిగిలిన రెండవ లక్ష మీద వచ్చే వడ్డీ రంగస్థల నటులలో బీదవారైన వారికి ఆర్థిక సహాయం కింద ఖర్చు పెట్టవలసింది. అందరూ మహానటులై పారితోషికాలు పొందలేరు. వారు నాటకాలను నమ్ముకుంటే చివరిదశలలో మరీ ఇబ్బందిపడతారు. అట్టివారికి నాగభూషణం నిధి నుండి సహాయం అందజేసే బాధ్యత నాట్యభారతి వారిదే'' అన్నాడు రాజశేఖరం.

రాగలత అతని సలహాకు అడ్డు చెప్పలేదు.

ఆవిధంగా రాతకోతలయిపోయాయి. ఎవరికాగితాలు, చెక్కులు వాళ్ళు తీసు కుని సెలవు తీసుకోడానికి నిలబడ్డారు.

''నాగభూషణం ఇంట్లో రెండు అలమరాలలో రమారమి పదిహేను వందల పుస్తకాలు-నాటకాలు, నాట్య శాస్త్ర గ్రంథాలు ఉన్నాయి. వాటిని అలమరాలతో సహా

నాట్యభారతివారికి ఇప్పించమని జ్ఞానానందస్వామివారిని కోరుతున్నాము.'' అన్నాడు రాజశేఖరం.

రాగలత తన ఆమోదం తెలిపింది.

ఇద్దరూ లాడ్జి చేరేసరికి రాత్రి ఎనిమిది గంటలయింది.

నాగభూషణం చనిపోయిన తరువాత వాళ్ళిద్దరూ కొవ్వూరు వెళ్ళలేదు. రాజమండ్రిలోనే లాడ్జి తీసుకొని సత్రవులో కర్మ చేయించారు. పన్నెండో రోజు రాత్రికి అన్ని పనులూ అయిపోయాయి.

''రాగలతా! నేను వచ్చిన పని అయిపోయింది. ఇకమీద నువ్వు చెప్పేది విని ఆవిధంగా చేయాలి.''

''నువ్వా?''

''అవును నేనే! నాగభూషణం బాధ్యత నుండి ముక్తిపొందావు. నీ ఆలోచనలకు అనుగుణంగా నడుచుకోడం నాధర్మం.''

''అయితే విను. నాకు రెండే దారులున్నాయి. మొదటిది- ఉద్యోగానికి ప్రయత్నించి మా అమ్మతో ఉండడం. ఉద్యోగం చేయవచ్చుకాని మా అమ్మతో ఉండడం సరిపడదు. మా అమ్మ నుండి తప్పించుకోడానికి ఏ అయ్యనో చేసుకోవాలి.''

''సుందరకాండలో సీతాదేవి రెండు మాటలంటుంది. తానూ, రామచంద్రుడూ, శచీదేవి ఇంద్రులకు మల్లే అరుంధతీ వశిష్ఠులకు మల్లే, రోహిణీ శశాంకులకు మల్లే, లోపాముద్ర అగస్త్యులవలె, సుకన్యా చ్యవనులవలె, సావిత్రీ సత్యవంతులవలె, శ్రీమతి కపిలుల వలె, దమయంతీ సౌదాసులవలె, కేశినీ సగరులవలె, దమయంతి నలులవలె- ఆదర్శదంపతులమని, తన చుట్టూ ఉన్న రాక్షసస్త్రీలతో చెప్తుంది. అందులో ఒక రాక్షసస్త్రీ మీరిద్దరూ ఎలా ఉంటారంటే అగ్నిదేవుడూ స్వాహాదేవీ వలె, శచీదేవీ- ఇంద్రుడూ వీరి వలె మీరు దంపతులుగా పేరొందుతారు. సవ్యమైనా, అపసవ్యమైనా, స్త్రీ పురుషుల మధ్య దాంపత్యం సర్వశ్రేయమని వీరి అభిప్రాయం. నాదికూడా అంతే.''

''ఓ రాజశేఖరా! నీ అభిప్రాయానికీ రాగలత ఎదురుచెప్తుందా?'' అంది రాగలత రాజశేఖరం కంఠం మీద చేతులు బిగిస్తూ.



# Kurella Group of Trusts

12-1-26, Maharanipeta, Visakhapatnam - 530 002 (A.P.) India
Ph : 563339 (STD : 0891)

(NON - PROFIT ORGANISATIONS)

## *Aims and Objects of Four Trusts*

1. **KURELLA SOMESWARA RAO CHARITABLE TRUST :**

i) To felicitate great persons, in the field of Telugu Literature, Music, Dance, Drama, Photography, Cartoonist, Painting, Sculpture, VEDAS, Journalism and Social Service at the annual function every year in December at kala Bharathi (AC) Auditorium.

ii) To give legal Literary Award for the best article relating to legal subjects amongs Lawyers and Judges once in every year.

iii) To give Vidya Vikas Awards for the best and Meritorius students of several high schools every year besides felicitating best teachers and encouraging Bala Pratibha Murthies between 3 to 8 yrs. (Child Prodigy)

2. **SITA MUSIC AND DANCE ACADEMY TRUST :**

To give awards for up-coming Musicians and Dancers every year besides organising Music and Dance concerts. To start a Music & Dance School to facilitate common people to learn at reasonable fees. To start a library by collection of books on Music & Dance.

3. **SAHITYA SEVA SAMITHI TRUST :**

To conduct competitions for giving awards for Telugu Novels. Dramas, Stories annually, besides felicitating luminaries at special Sahithi functions and hounouring renowned scholars and also publishing books in Telugu litarature. A memorable short story competition of fifty stories of 50 writers. **named as 'Kadhamanjari' was released in 1998.**

4. **SOMESWARA PUNYABHOOMI TRUST :**

To open Somewara Punyaboomi Mandiram for exhibiting several Divine Murthies especially relating to Vinayaka. Vishnurupas. Jyotirlingams etc. etc., and also produce Devotional Music casetts and conduct functions for Bhakti Sangeeta Sabhas etc., and publish books on devotional subjects.

For the above causes. co-operation in all ways and by way of donations are requested for carrying the objects of the Trusts.

***Kurella Someswara Rao***
Advocate
Founder-Chairman
Kurella Group of Trusts